హిందూధర్మ శాస్త్రగ్రంథమాల 19



# ఆంధ్రకవితరంగిణి

## పదకొండవ సంపుటము

శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూధర్మశాస్త్ర గ్రంథమాల 19.

శ్రీ

# ఆంధ్రకవితరంగిణి

పదకొండవ సంపుటము

రచయిత:

శ్రీ చాగంటి శేషయ్యగారు

హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము
కపిలేశ్వరపురం (తూ. గోదావరి)

# PROCEEDINGS OF
# THE DIRECTOR OF PUBLIC LIBRARIES
# ANDHRA STATE

MADRAS

Dis.3331-54 Dated 21-9-54

Sub:- Books and Publications - Book entitled "ANDHRA KAVI TARANGINI" Commendation for use in Public Libraries and in libraries of schools and colleges.

Ref:- Letter dated 17th June, 1954 from Sri Chaganty Seshayya, Kapileswarapuram: East Godavary.

The Book entitled "ANDHRA KAVI TARANGINI" in ten volumes written by Sri Chaganty Seshayya is recommended for use in all public libraries and in libraries of schools and colleges. The undermentioned officers are therefore, requested to bring this publication to the notice of all the concerned authorities

2. The cost of each volume is Rs. 3/-, and copies may be had from the author, c/o The Hindu Dharma Sastra Grandha Nilayam. Kapileswarapuram, East Godavari District

(Sd) K. Raghava Reddy,
For Director of Public Libraries.

(True Copy Forwarded By Order)

L. Subbarao,
Superintendent.

To

All the District Educational Officers, Inspectress of Girls Schools. Copy to The Principals of all colleges, Arts and Professional. Copy to the Divisional Inspector of Schools. Copy to Sri Chaganty Seshayya. Author Andhra Kavi Tarangini. Kapileswarapuram. East Godavari District

(True Copy)

## Sir C. Ramalinga Reddy Kt.

M.A. (CANTAB.), HON. D. LITT.,
Vice-Chancellor, Andhra University

"I have read with much pleasure and appreciation Chaganty Seshayya's "Andhra Kavi Tarangini". It is a remarkably fine contribution to the History of our literature and our country. He has taken trouble to study the latest archaeological material available and make his treatment of the different Poets as scientifically accurate as possible.

.........Sri Seshayya seems to be fitted both by his knowledge of the subject and his scientific spirit to present the Andhra world with an authoritative Lives of Andhra Poets.

He does not mix up Puranas with history and legend with truth and that is a rare and refreshing feature.

## ఆంధ్రపత్రిక

[illegible]
[illegible]
[illegible]"

## The Hindu

Research into the records of the past brings forth continually new facts on the history of literature and the present book is the first of many volumes which the author proposes to bring out in an attempt to write a new history of Telugu poets. According to earlier historians of Telugu literature, the maximum number of Telugu poets worth the name did not exceed three hundred and fifty. But the author includes many more whose names have hitherto laid hidden in the unfathomed caves of time. The author has unearthed considerable interesting material by an intensive study of inscriptions......"

ఆంధ్రకవి తరంగిణి ముద్రణమునకు విరాళము లొసంగిన

# భా షా భి మా ను లు

---

## రా జ పో ష కు లు:

౧ శ్రీ బలుసు బుచ్చిసర్వారాయుడు జమీందారువారు. కపిలేశ్వరపురం
కేశనకుర్రు ఎస్టేట్లు, కపిలేశ్వరపురం.

## ప్ర ధా న పో ష కు లు:

౧ శ్రీ చిక్కాని వెంకటరత్నంగారు, భూస్వామి, మాజీమంత్రి,
రామచంద్రపురం కోఆపరేటివు సెంట్రల్ బ్యాంకిఅధ్యక్షులు, చోడవరము.

## పో ష కు లు:

౧ శ్రీ బలుసు బుచ్చిపట్టాభిరామయ్యగారి కుమారులు అచ్యుతరామయ్యగారు,
భూస్వామి, కపిలేశ్వరపురం.
౨ శ్రీ మద్దూరి సూరన్నగారు, వర్తకులు, గోపాలపురం.
౩ శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, భూస్వామి, బుచ్చిరెడ్డిపాలెం.
౪ శ్రీ వాడ్రేవు విశ్వసుందరరావు బహద్దర్ వారు, జమీందారు వేగాయమ్మపేట.

## స హా యు లు:

౧ శ్రీ దేశరాజు వేంకటసుబ్బారావుగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.
౨ శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణగారు, ప్రొప్రయిటరు:
సుజనరంజనీ ప్రింటింగువర్క్సు, రాజమహేంద్రవరము.
౩ శ్రీ వట్టికూటి పట్టాభిరామయ్యగారు, పునకరమిల్లి యస్టేటు జమీందారు నెల్లై.
౪ శ్రీ బండారు చినవెంకయ్యఅనే రామకృష్ణయ్యగారు భూస్వామి వాడపాలెం
౫ శ్రీ బలుసు వెంకటరామారావుగారి భార్య మాణిక్యంగారు భూస్వామిని,
కపిలేశ్వరపురము.
౬ శ్రీ కొరపాటి వెంకట్రాయుడుగారిభార్య శ్రీమతిసత్యవతమ్మగారు భూస్వామిని,
కపిలేశ్వరపురము.

౭ శ్రీ కేసాప్రగడ వేంకటరమణ రాజేశ్వరరావుగారు, భూస్వామి, అన్నంపల్లి

౮ శ్రీ పోతాప్రగడ కృష్ణమూర్తిగారు, ప్రొ॥ మాన్సరమాన్ ప్రింటర్సు, కాకినాడ

౯ శ్రీ వాడ్రేవు రత్నేశ్వరరావుగారు, భూస్వామి, పసలపూడి.

౧౦ శ్రీ నెక్కంటి దొరయ్యగారు, భూస్వామి, కపిలేశ్వరపురము.

౧౧ శ్రీ నెక్కంటి రామయ్యగారు, భూస్వామి, అసిస్టెంటుయింజనీరు కపిలేశ్వరపురం

౧౨ శ్రీ బుద్ధవరపు మహాదేవుడుగారు, బి.ఎ.బి.ఎల్. వకీలు, రామచంద్రపురము.

౧౩ శ్రీ లక్కరాజు సుబ్బారావుపంతులుగారు, అడ్వకేటు భూస్వామి, కాకినాడ.

౧౪ శ్రీ పుష్పాలూరి వెంకటరమణమూర్తిగారు, భూస్వామి, అడ్వకేటు, కాకినాడ.

౧౫ శ్రీ నెక్కంటి జగపతిరామయ్యగారు, భూస్వామి, ప్రొప్రయిటరు రైసుమిల్లు-వేదురుమూడి.

౧౬ శ్రీ ఏకా ఆంజనేయులుపంతులుగారు, భూస్వామి గుంటూరు.

౧౭ శ్రీ క. వెంకయ్యచౌదరిగారు భూస్వామి డివిజనలు ఇంజనీరు కాకినాడ

౧౮ శ్రీ ఏలూరిపాటి నరసింహసర్వతోముఖయాజులుగారు, భూస్వామి, బిళ్ళకుర్రు

౧౯ శ్రీ తురగా పురుషోత్తం పంతులుగారు, ఎమ్. ఎల్. సి. పలివెల.

౨౦ శ్రీ మల్లాడి సత్యలింగం నాయకర్సు చారిటీసువారు, సత్యలింగవరం, కాకినాడ

౨౧ శ్రీ అయ్యగారి మోహనరావు పంతులుగారు, బి. ఎ. బి. ఎల్., అడ్వకేటు, సీతానగరం, విశాఖపట్టణంజిల్లా.

౨౨ శ్రీ రావుసాహెబ్ పట్టమట్ట సోమగిరిరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, జార్జిప్రెస్, కాకినాడ.

౨౩ శ్రీ వెంటూరి దొరయ్యగారు, కోటిపల్లి.

౨౪ శ్రీ బొప్పన దొరయ్యగారు, కందులపాలెం.

౨౫ శ్రీ వైట్ల వీర్రాజుగారు, కందులపాలెం.

౨౬ శ్రీ తురగా రామచంద్రరావు పంతులుగారు, ఇన్కమ్టాక్సు ఆఫీసరుగారు, మదరాసు.

౨౭ శ్రీ ముక్కవిల్లి వెంకటనారాయణగారు, Pleader, రామచంద్రపురం.

౨౮ శ్రీ వాడ్రేవు వెంకప్పారావుగారు, జమీందారు, దానవాయిపేట, రాజమహేంద్రవరము.

౨౯ శ్రీ వాడ్రేవు గోపాలకృష్ణగారు, పిఠాపురము.

౩౦ శ్రీ నేమాని వెంకటనారాయణగారు, బి. కామ్. ఇన్కంటాక్సు ప్రాక్టీషనరు, కాకినాడ.

౩౧ శ్రీ సందూరి వెంకటరమణగారు, పెనుమళ్ళ.

౩౨ శ్రీ దంటు సూర్యారావుగారు, మర్చంట్సు, కాకినాడ.

33 శ్రీ గుండపునీడు జానికిరామయ్యగారు, రామచంద్రపురం.
౩౪ శ్రీ మేడవరపు సత్యనారాయణమూర్తిగారు హాసన్ బాదా.
౩౫ శ్రీ బండారు పెదవీరయ్యగారు, భూస్వామి, వాడపాలెం.
౩౬ శ్రీ మాజేటి హనుమంతరావుగారు, మర్చంటు, గుంటూరు.
౩౭ శ్రీ దేశరాజు రామారావుగారు, మర్చంటు గుంటూరు.
౩౮ శ్రీ టి. కే. నాగయ్యగారు, మర్చంటు, గుంటూరు.
౩౯ శ్రీ గోపాలుని వీరరాఘవయ్యగారు బి. ఎ. బి. యల్. అడ్వకేటు, ప్రసిడెంటు: బార్ ఎసోసియేషన్, గుంటూరు.
౪౦ శ్రీ ఉన్నం వెంకటరామారావుగారు, బి. ఎ. బి. యల్ విశాఖపట్టణము
౪౧ శ్రీ బెండపూడి పేర్రాజుపంతులుగారు, యం. బి. బి. ఎస్. విశాఖపట్టణము.
౪౨ శ్రీ చీమలపాటి గనేశ్వరరావుగారు, శక్రటరీ, ది విశాఖపట్టణము ఎలక్ట్రిక్ సప్లయి కార్పొరేషను లిమిటెడ్ విశాఖపట్టణము.
౪౩ శ్రీ దూర్వాసుల సీతారామమూర్తిగారు బి. ఎ. బి. ఎల్. విశాఖపట్టణము.
౫౪ శ్రీ మాదిరాజు సుబ్బారావుగారు, మేనేజింగు ప్రొప్రయిటరు సిటీహైస్కూలు విశాఖపట్టణము.
౪౫ శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులుగారు విజయవాడ.
౪౬ శ్రీ దాట్ల సత్యనారాయణరాజుగారు, బి. ఎ బి. ఎస్. రాజమహేంద్రవరము.
౪౭ శ్రీ ఈదర వేంకట్రావు పంతులుగారు, ఏలూరు.
౪౮ శ్రీ పేర్ల సత్తెయ్య శెట్టిగారు చినవాల్తేరు యస్టేటు, విజయనగరం
౪౯ శ్రీ రామదాసు ట్రాన్సుపోర్టు లిమిటెడ్., కాకినాడ.
౫౦ శ్రీ బలుసు సర్వారాయుడుగారు, కపిలేశ్వరపురము.
౫౧ శ్రీ మేకా వెంకట్రాయుడుగారికు॥ జానికిరామయ్యగారు, కపిలేశ్వరపురం.
౫౨ శ్రీ కన్నమని వెంకటసుబ్బారాయుడుగారు, కపిలేశ్వరపురం.

## అభిమానులు

1 శ్రీ పైండా వెంకటరమణ బ్రదర్సు, కాకినాడ.
2 శ్రీ డాక్టరు నందివాడ సత్యనారాయణరావుగారు, రామచంద్రపురం.
3 శ్రీమతి చిగురుపాటి అన్నపూర్ణమ్మగారు, రామచంద్రపురం.
4 శ్రీ మరివాడ సూర్యనారాయణమూర్తిగారు, కపిలేశ్వరపురం.

## ఏతత్కవి కృతులు:

# విజ్ఞాపనము



ఆంధ్రకవితరంగిణి పదునాల్గవ సంపుటమును ఆంధ్రలోకమున కర్పించు భాగ్యమలవడినందుకు భగవంతున కనేక వందనము లర్పించు చున్నాడను. ఈవిషయమున నాకు సహాయ్య మొసఁగుచున్న యుదారాశయులకు కృతజ్ఞుడను

ఈగ్రంథములలో కవులు రచించిన కావ్యములయందలి గుణాగుణ విమర్శనము లొక్కింతయుండిన మేలని పలువురు పండితులు సూచించుచున్నారు. అవి లేకుండుట యీగ్రంథములకు లోపమని తలంచువారుకూడ కలరు. కవులయొక్కయు, వారినాదరించిన కృతిపతులయొక్కయు చారిత్రములను మాత్రమే యిందు రచింపవలయునని నాయుద్దేశము. కావ్యములనుగూర్చి యిందు వ్రాయుట సాధ్యమైనపని కాదని యిదివరకే విన్నవించితిని. ఆంధ్రకవుల చరిత్రను రచించిన ఆంధ్రకవి చరిత్రకారులగు శ్రీపంతులుగారుకూడ తమగ్రంథమునందు కావ్యవిశేషములను గూర్చి వ్రాయలేదు.

అయినను అట్టివిషయములను జేర్చుచు ఆంధ్రకావ్యరసతరంగిణి యనుపేర నొకమాలగా కొన్నిసంపుటములను ప్రకటింప సంకల్పించుకొని అందులకై ప్రయత్నించుచుంటిని. గ్రంథ పీఠికలలోను మాసపత్రికాదులలోను యిదివరకు పండితులు ప్రకటించిన వ్యాసములను సేకరించి వారిపేరులతోడనే అందుచేర్పదలంచితిని. నాకుమిత్రులయిన కొందఱుపండితులను నిట్టివ్యాసరచనలు చేసి పంపుడని కోరియుంటిని. నేనుగూడ కొన్నిగ్రంథములపై అట్టి విమర్శనమును వ్రాయ సాహ

సించుచున్నాడను. కాని ఆంధ్రలోకముయొక్క ప్రస్తుతపరస్థితిని బట్టి ఆయుద్యమ మెంతవఱకు కొనసాగునో చెప్పఁజాలను.

ఒక్కభారతకావ్యమ్ముమీద పండితులుగావించిన విమర్శనములు మూఁడువందల పుటలుగల యొకగ్రంథమగు ననియు దానికి పది, పండ్రెండు వందల రూప్యములు వ్యయమగు ననియు తోఁచుచున్నది. కాని దానిని కొనియాదరించు పాఠకలోకము లభించునను యాశ లేదని నాయనుభవము. ఐనను నాశక్తికొలఁదిఁజేయ ప్రయత్నించెదను. కావున ఆంధ్రకవితరంగిణి యందిట్టి విమర్శనము చేర్పబడకుండుటొక లోపముగా తలంపవలదని నామనవి.

క పి లే శ్వ ర పు రం — ఇట్లు విన్నవించు విధేయుఁడు

మార్గశీర్ష శు॥ ఏకాదశి — గ్రం థ క ర్త.

# విషయసూచిక

శ్రీరామచంద్ర

# ఆంధ్రకవితరంగిణి

## (పదకొండవ సంపుటము)



## 230 పట్టమట్ట సోమనాథ సోమయాజి



ఈకవివతంసుఁడు నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; హరితసగోత్రుఁడు; లింగామాత్యపౌత్రుఁడు; వెంకటమంత్రి తిమ్మాంబలకుఁ బుత్రుఁడు; ఈయన మామాతామహునకుఁ బూర్వుఁడు.

ఈతఁడు సూతసంహిత యను నేడాశ్వాసములు గలపద్యకావ్యమును రచియించి బిక్కనవోలుసంస్థానప్రభువగు కామారెడ్డి కంకితము చేసెను. మఱియు బ్రహ్మోత్తరఖండ మను నైదాశ్వాసములగ్రంథమును రచించి పైనచెప్పిన కామారెడ్డితమ్ముఁ డగు నెల్లారెడ్డికిఁ గృతియిచ్చెను. షట్చక్రవర్తిచరిత్రమును రచించిన మల్లారెడ్డియు, సూతసంహిత, బ్రహ్మోత్తరఖండములను గృతినందిన కామారెడ్డి ఎల్లారెడ్డి యనువారలును సోదరులు. కామారెడ్డి కుమారులు. ఈ కామారెడ్డిని కామిరెడ్డియనికూడ వాడుచుందురు.

సూతసంహితయందు సోమనాథకవి తనను గూర్చి యిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. నను భవానీశంకరనితాంత కారుణ్య
పాత్రు నాపస్తంబసూత్రు హరిత
గోత్రు లింగామాత్య పౌత్రుని వేంకట
మంత్రికిఁ దిమ్మమాంబకు సుపుత్రు
రాజమహేంద్రదుర్గస్థలోభయగౌత
మీపథ్యరాజ్యాభిరామధాము

నిర్వాహకుఁ డైత్రుసఖులలో నాహ్లాద
జనకసౌహార్ద్రపావనచరిత్రు
గీ. బండితారాధ్య వంశాబ్ధి పారిజాత
గౌరగురురాడ్భవాన్యంబికాతనూజ
లింగనారాధ్య సత్కృపాపాంగవీక్ష
ణామృత రసోన్నతిసనాథు సోమనాథు.

సూతసంహిత రచియించునాఁటి కితఁడు సోమయాజి కాలేదు. బ్రహ్మోత్తరఖండమును జేయునాఁటికి యజ్ఞమొనర్చి సోమయాజియై నట్లు బ్రహ్మోత్తరఖండ మందలియీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. ననుభవానీశంకరనితాంతకారుణ్య
పాత్రు నాపస్తంబసూత్రుహరిత
గోత్రు లింగామాత్యపౌత్రుని వేంకట
మంత్రికిఁ దిమ్మమాంబకు సుపుత్రు
పురభేది మల్లికార్జునపండితాన్వయ
గౌరదేశికభవానీరమణుని
ఘనగర్భశుక్తిముక్తాయిత లింగనా
రాధ్యోపదిష్టచరణపవిత్రు
తే. పట్టమట్టాన్వ వాగ్విభ్రాజి సతత
నిర్భరానందకారి వాణీవిలాస
శుభకృదభినవకృతిరాజి సోమనాథ
సోమయాజి కడుం జెల్మి సొంపుకల్మి.

ఈకవి తనప్రజ్ఞావిశేషములను సూతసంహితయందలి యీక్రింది పద్యములోఁ జెప్పియుండెను.

సీ. ఘటికాశతగ్రంథఘటనముఖ్యకవిత్వ
నానావిధానావధానరూఢి

పాతంజలిగ్రంథ ఫక్కికాసందర్భ
నిర్భేదన క్రియానిశితబుద్ధి
బహువిధాలంకార భావధ్వనివిశేష
సాహిత్యసర్వంకషత్వమహిమ
యఖిలదిగ్దేశరాజాస్థానవిఖ్యాత
చాటుగాథా కథా చతురిమంబు
తే. తర్కవేదాంతధర్మశాస్త్రక్రమంబు
చంద్రమౌళీభవానీప్రసన్న కేళి
నీక దయచేసినాఁడుగా నిట్టియెడల
ఘనయశస్సాంద్ర సోమశేఖర కవీంద్ర.

ఈపద్యమునుబట్టి కవి వ్యాకరణశాస్త్రమునందుఁ బండితుఁడనియు, తర్కవేదాంతధర్మశాస్త్రములందుఁ బరిజ్ఞాతయనియు, సాహిత్యసర్వంకషుఁ డనియు విదిత మగుచున్నది. కవి కెట్టిలక్షణములుండవలయునో సూతసంహితయందలి యీక్రిందిపద్యమునఁ గుకవినిరసనాసందర్భమున నుడివియున్నాఁడు.

సీ. ఆదికారణ మీశ్వరానుగ్రహము లేక
ప్రణుతశిష్టాచారపరుఁడుగాక
తర్కవక్రోక్తితాత్పర్యంబుఁ దెలియక
వేదాంతవాసన విస్తరిలక
ప్రస్తుతాలంకారపథ మాకళింపక
శబ్దనిర్ణయశాస్త్రసరణిఁ గనక
చాటుగాథాలోకసమయంబు లెఱుఁగక
బహుపురాణకథామతవముఁ గొనక
గీ. గాఢనిష్ఠురదుర్గగ్రకాకఘూక
భేకఝిల్లీనిచయఘోషభీషణోగ్ర
భాషణంబులఁ గవితగీష్పఱచు శఠుల
గాకవుల నేల సృజియించెఁ గమలభవుఁడు.

పై పద్యములోఁ గవిలక్షణములను జెప్పి పిమ్మటఁ గవిత్వ మెట్లుండవలయునో యీక్రిందిపద్యమున సూచించియున్నాఁడు.

సీ. సర్వజ్ఞమౌళిభూషణలీలఁ జెన్నొంది
శబ్దగుణార్థాఢి చౌకళించి
ఘనమహీభృద్రాజకటకస్థలుల మించి
యలఘుధారాశుద్ధి నవఘళించి
గంభీరనవరసోజ్జృంభణంబునఁ బొంగి
ధ్వనివిశేషముల చందమున మెఱసి
యఖిలలోకైకప్రియంకరస్థితిఁ బ్రూని
యన్నిదోషంబుల నపనయించి
గీ. బహుముఖతరంగితం బయి పరిఢవిల్లి
పావని సారస్వతావాసపూర్తిఁ దనరి
వాసివహియించు గంగాప్రవాహమట్ల
విశదరీతిఁ గవిత్వంబు వెలయవలయు

ఈకవి సంస్కృతకవుల నొకపద్యములోను ఆంధ్రకవుల నొకపద్యములోను స్తుతించుచు వారివారి కావ్యములఁ బరికించి యందలి స్వారస్యమును గ్రోలిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియుండుటంబట్టి యాతఁడు బహుగ్రంథావలోకన మొనర్చి యేకవికవిత్వమున నెట్టిగుణసంపత్తికలిగియుండెనో గ్రహించిన సాహిత్యచక్రవర్తియని చెప్పఁదగియున్నది.

సీ. భామహ జయదేవ భాషావిభూషావి
శేషావినింద్యత లప్పత్తగించి
భవభూతి బాణ ప్రబంధానుసంధాన
సంధానుభావంబు సంగ్రహించి
కాళిదాస మయూర గాథానిరోధావ
బోధానుభావము లుబ్బుద్ధిఁ దెలసి
దండి భారవి మాఘ చండ వాక్తాండవా
ఖండవాహాసముత్కంఠఁ దేలి

గీ. మరియు శ్రీహర్ష బిల్హణ మల్హణాది
సుకవినవరసరసికోక్తి నికరసుకర
మధుసుధారసధారాయమానమంబు
భావపావకపాకంబు బరిచరించి

సీ. సర్వజ్ఞమౌళిభూషణ మైనశబ్దశా
సను బహుముఖరసజ్ఞతఁ దలంచి
యోగ్యశ్రుతిహితప్రయోగుఁడౌ సోమయా
జులరీతి వృత్తిసంశుద్ధి నెన్ని
నిర్దోషసుసమాధినియతోక్తి యగుశంభు
దాసు ప్రసాదపాత్రత నుతించి
నిస్తులౌజఃకాంతినిధులైన సోమభా
స్కరుల శబ్దగుణప్రసక్తిఁ బొగడి
గీ. రుచిరపదసిద్ధధారానిరూఢమహిమఁ
దగినశ్రీనాథు నచ్యుతత్వము గ్రహించి
తత్కవిత్వకథాసుధాధానసంత
తావధానైకచిత్తుండనై కణంగి.

ఈసోమనాథకవికిని, సూతసంహితకృతిపతి యైనకామిరెడ్డికిని గూడ మల్లికార్జునపండితారాధ్యుల వంశములోనివాఁడైనలింగారాధ్యుఁడే గురువు. అందువలననే కామారెడ్డికవిని

గీ. అనఘా!మాకు సతీర్థ్యుఁడ
వనురక్తుఁడ వాశ్రితుండ వఖిలజ్ఞుఁడ. నే
మనుసంధించినకార్యం
బనుకూలముసేయ నీవ యర్హుఁడ వెందున్.

అనుపద్యములో సతీర్థ్యుఁడని చెప్పియున్నాఁడు.

ఈకవి జన్మస్థానము గోదావరి మండలములోని రాజోలు తాలూకాయందలి వెలవలపల్లియను గ్రామము. ఈగ్రామము రాజమహేంద్రవరమున కించుమించుగ నిరువదియైదుమైళ్ళ దూరములో

నున్నది. రాజమహేంద్రవరమున నఖండగౌతమియని పిలువంబడు, గోదావరినది యాపట్టణమున కొక్కింతదిగువ నేడుపాయ లైనది. అందు రెండుపాయలకు నడుమ నీవెలవలపల్లియున్నది. దీనికు త్తరమున గౌతమియను పాయయు దక్షిణమున కౌశికయను పాయయు నున్నవి. ఈగ్రామము మానివాస మైనకపిలేశ్వరపురమున కాగ్నేయభాగమున నాలుగైదుమైళ్ళదూరములో నున్నది ఈసోమనాథకవి వంశములోని వాఁడైన సరస్వతిసోమయాజి పృథుచరిత్ర మను ప్రబంధమును రచియించియున్నాఁడు. సరస్వతిసోమయాజి మొదలుగా వంశవృక్షము నాయొద్దనున్నది. అందలివివరములు సరస్వతిసోమయాజిచారిత్రమున వ్రాసియున్నాఁడను. సరస్వతిసోమయాజకి పైనిగనున్నవతరములో నీ సోమనాథసోమయాజి యున్నాఁడో తెలియఁదగిన యాధారములు నాకుదొరకలేదు. కాని సరస్వతిసోమయాజి హయాణశము 1670 సం॥ ప్రాంతముననున్నాఁడని యాతనిచారిత్రమునఁ జెప్పియుంటిని ఈసోమ నాథసోమయాజి క్రి. శ 1578 వ సంవత్సరప్రాంతమున నున్నట్లు తేలుచున్నది. కావున నీయిరువురుసోమయాజులకు నడుమ 3 లేక 4 తరములు గడచియుండునని యూహింపఁదగియున్నది. సరస్వతిసోమయాజి తనపృథుచరిత్రమున సోమనాథసోమయాజినిగూర్చి యేమియుఁ జెప్పినట్లు గాన్పింపదు. సోమనాథసోమయాజి వెలవలపల్లిలో జన్మించి యచ్చటనే విద్యాభ్యాసము చేసి, యుక్తవయసువచ్చినపిమ్మట నిజాం రాష్ట్రమున కేఁగి యచ్చట మల్లిఖార్జునపండితారాధ్యుల లింగారాధ్యుని నాశ్రయించి కామారెడ్డి, ఎల్లారెడ్డి, మల్లారెడ్డి ప్రభువులతోఁగూడ, నుపదేశములనఁ బొంది పండితుఁడై కవియై యారెడ్డిప్రభువుల నాశ్రయించి, వృత్తులను సంపాదించి యచ్చటనే యుండి మరల వెలవలపల్లి రాకయచ్చటనె స్థిరనివాసమేర్పరచుకొనియుండును. అందుచే యాతని వృత్తాంత మాతనికిఁ బిమ్మట ౧౦౦ సంవత్సరములలోనివాఁడగుసరస్వతి సోమయాజికిఁ దెలియకపోయి యుండును. మామాతామహుఁడైన యనంతరామామాత్యుఁడు సరస్వతిసోమయాజికిఁ బిమ్మట 6 వ తరము వాఁడైనట్లు సరస్వతిసోమయాజి చారిత్రమున నిచ్చినవంశవృక్షమువలనఁ

తెలియఁగలదు. సోమనాథసోమయాజి వెలవలపల్లి నివాసియైనట్లు పరంపరగావచ్చు జనశ్రుతవలనఁ దెలియుచున్నది. వెలవలపల్లిలో పట్టమట్ట వారిపుడు నున్నారు.

సోమనాథసోమయాజి, నిజాంరాష్ట్రమునందు రెడ్డిప్రభువుల యనుగ్రహముచే వృత్తులను సంపాదించి స్థిరనివాసమేర్పరచుకొనినను, తనజన్మస్థానమును మరచిపోలేదు. సూతసంహితయందు "రాజమహేంద్రదుర్గస్థలోభయగౌతమీరాజ్యాభిరామధామునఁడ" నని చెప్పుకొనినాఁడు. గోదావరిమండలమునజన్మించి నిజాంరాష్ట్రమున నివాసమేర్పరచుకొనినవారిలో మడికి సింగనయు, నీపట్టమట్ట సోమనాథసోమయాజియు ముఖ్యులు.

సోమనాథకవి, తానురచించిన సూతసంహితయొక్క ప్రాశస్త్యము నీక్రిందివచనములోఁ జెప్పియున్నాఁడు.

"అది గావున మహాపురాణం బగుస్కాందపురాణంబున శివమాహాత్మ్యఖండ జ్ఞానయోగఖండ ముక్తిఖండ యజ్ఞవైభవఖండంబులననాలుగుఖండంబులుఁ జతుర్విధపురుషార్థంబులం బొసంగు శ్రీసిద్ధరామేశ్వరుకరుణాకటాక్షవీక్షయుం బోలె నవఘళించుచున్న పురాణంబునందలి సనత్కుమార శాంకర వైష్ణవ బ్రహ్మసౌరసంహితలలోన షడృతుకదంబంబునడుమ వసంతంబునుంబోలెఁ జెన్నొందుచు సకలలోకాభిహిత యగునాసూతసంహిత యాంధ్రకవిత గృతియొనర్చి సిద్ధరామేశుఁ గృతికర్తఁ జేయవలయు"

ఈసూతసంహితకు వేదభాష్యకర్త యగువిద్యారణ్యస్వామి టీక యొనర్చినట్లును దానిననుసరించి తానీకావ్యమును రచించినట్లును యీ క్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

గీ. అట్టి దగుసూతసంహిత యాకలించి
ప్రణుతమతి వేదవేదాంతభాష్యకర్త
యతిఘనుండు విద్యారణ్యయతి యొనర్చె
నాది తాత్పర్యదీపిక యనెడుటీక.

శా. ఆచందం బగుసూతసంహిత విశిష్టాంధ్రోక్తిఁ గావ్యంబుగాఁ
దూచాతప్పక యుండఁ జెప్పఁగఁ గవీంద్రుం డెవ్వఁ డర్హుం డొకో
నాచిత్తంబున సోమశేఖరుఁడె పూనంజాలు సత్సూక్తిచే
నాచంద్రార్కముగాఁగ నిట్టికృతి కావ్యం బంచుఁ దోఁచుం గడున్

సీ. అస్మద్గురుస్వామి యైనలింగారాధ్య
సార్వభౌముప్రసాదసౌష్ఠవంబు
నత్యాప్తుఁడు సతీర్థ్యుఁ డైనకామారెడ్డి
పట్టభద్రుని ధర్మపాటవంబు
తత్సభాసదులైనధన్యవిద్వాంసుల
సంతతసల్లాపసమ్మతంబు
ఘనుఁడు విద్యారణ్యముని యేర్పరించిన
తాత్పర్యదీపిక దారికలిమి

గీ. కారణంబులుగా నిరాఘాటచాటు
శుద్ధపద్ధతిఁ దెనుఁగున సూతసంహి
తాచతుర్విధఖండసందర్భ మెల్లఁ
గావ్య మొనరింతు లోకవిఖ్యాతముగను

ఈకవి రచించిన బ్రహ్మోత్తరఖండముకూడ స్కాందపురాణాంతర్భాగమే. అం దనేకఖండములు కలవు. బ్రహ్మఖండమం దొకటి. అది రెండుభాగములు. పూర్వభాగము విష్ణుకథలను ఉత్తరఖండము శివకథలను దెలుపును. ఉత్తరఖండము నీకవి యాంధ్రీకరించెను. కృతిపతియైన ఎల్లారెడ్డి, యీఖండము నాంధ్రీకరించి తనకుఁ గృతినొసంగుమని చెప్పినభాగము నీక్రిందియైదుపద్యములలోఁ జెప్పియున్నాఁడు. గ్రంథవిస్తరభీతియున్నను, కవిసామర్థ్యాదులను దెల్పువిషయము లుండుటచే నాపద్యముల నిట వ్రాయుచున్నాఁడను. ఈతనికవిత్వము నీక్రిందిపద్యములోఁ గల్పతరువును బోల్చియున్నాఁడు.

సీ. ఆదిభవానీశ్వరానుగ్రహము బీజ
మఖిలశాస్త్రపరిచయంబు మూల

మాఘచిత్రశ్లేషహారిధారలు శాఖ
లుపశాఖికలు రీతి యుక్తి వృత్తు
లంచద్ధ్వని ప్రౌఢి మించు నిద్దపుచాయ
సగుణనిర్దోషముల్ చిగురుటాకు
లభినవాలంకారవిభవముల్ పూగుత్తు
లలరసస్థితిమరందాంబుధార
గీ. గాఁగఁ దగునీకవితోక్తి కల్పతరువు
హితవహీంవల్లభాభీష్టతతి ఫలించు
శుభమతి సనాథశివబోధసోమనాథ
సోమయాజీంద్ర! సద్యశస్స్ఫూర్తిసాంద్ర!

ఉ. స్కాంధమహాపురాణమున జ్ఞానమయుం బగుసూతసంహితన్
బొందుగ నాంధ్రకావ్యముగఁ బూని వచించి జగత్ప్రసిద్ధిగా
నందలముల్ హయాదికములంది మదగ్రజుఁ గామిరెడ్డి భ
ర్తం దగఁ బ్రీతుఁ జేసితివి తత్కృతి శంభునకిచ్చి మెచ్చఁగన్.

మ. అకలంకక్రియఁ గావ్యముల్ నుడివి భూస్వర్గంబు లార్జించి చం
ద్రకళామౌళికి నర్పితంబుగ జగత్ప్రఖ్యాతిగా యజ్ఞముల్
సుకృతఖ్యాతులు మాకునుం గలుగఁ దజ్ఞుల్ మెచ్చఁగాఁ జేయవే
సుకవీంద్రాగ్రణి! సోమశేఖర కృపాసిద్ధుండవే యన్నిఁటన్.

సీ. సకలవిద్యలును భాషాయోగ్యమైతోల్చు
భాషావిశేషముల్ బుద్ధిఁదలఁప
నందుఁ బురాణంబు లఖిలముల్ కంఠాభ
రణములు వానిలో రమ్యపతక
మరయమహాస్కాంధ మందొప్పు నేఁబది
ఖండముల్ నవరత్నఖండములుగ
అందులోపలను నాయకరత్నరాజంబు
కరణి బ్రహ్మోత్తరఖండ మొప్పు
నమ్మహాఖండరత్నంబు నాంధ్రకావ్య
కవిత కవితారసంబునఁ బలుకడగిన

మేలు మెరుఁగెక్కి జగమెల్ల మించుఁగాదె
చారుతర నైషధీకావ్యసరణి మహిమ

శా. గద్యం బించుక చెప్పినంతటనె చక్కన్ బాణు నిన్ మెచ్చఁడో
పద్యం బొక్కటి చెప్పినంతటనె యొప్పన్ మల్హణుల్ మెచ్చఁడో
ఉద్యుక్తిన్ నినుమెచ్చకుండెడినె చంద్రోత్తంసుఁ డాపద్యముల్
గద్యంబుం దగు కావ్య మంకితముగాఁ గల్పింపుమా మెచ్చుగన్.

ఈకవి హూణశకము పదునాల్గవశతాబ్దియం దుత్తరార్ధమునం దున్నవాఁడు. ఈకవిరచించిన గ్రంథమునకుఁ గృతిభర్తయైన ఎల్లారెడ్డి కవియగుటచే నాతనిచారిత్రమున నాతనినిగూర్చియు, నాతనియగ్రజుఁడగు కామారెడ్డినిగూర్చియు వ్రాయఁదలఁచి యిటవిడచితిని.

సోమనాథకవికవిత్వము ప్రౌఢమై నిర్దుష్టమై సహృదయులకానందదాయకముగ నున్నది. సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించుటలో స్వేచ్ఛనువహింపక మూలానుసారముగ రచించినమూలమున గొన్నితావులలో నీతనికవితాధారయం దొక్కింత మంద మేర్పడినట్లు గన్పట్టుచున్నదిగాని లేనిచో నీతనికవిత్వము నదీప్రవాహమువలె యనర్గళధారతో శోభిల్లుచుండును. కవితావిలాసమున నీతఁడు శ్రీనాథునితో తులతూఁగుచుండునని నాయభిప్రాయము. శైలి తెలియుటకై నీతని గ్రంథములనుండి పద్యముల నుదాహరించుచున్నాఁడను.

సూతసంహిత:—

మ. జగదుత్పత్తిముఖంబు లేరివలనన్ సంధిల్లునో యంచు వే
దగతిన్ వారు పరస్పరంబును గడున్ దర్కించి తర్కించి యా
త్మగరీయోవిచికిత్సయూని యిదమిత్థం బంచుసిద్ధాంతమై
తగ నేర్పాటొనరింపలేక తపమత్యంతోగ్రనిష్ఠాధృతిన్ ౧౭

చ. అనశనుఁడైనఁ దూలు నధికాశనుఁడైనను యోగవృత్తిమై
దనరఁగరాదు కావున హితంబుగ ధార్మికబృంద గేహవ
ర్తనముగ నొక్కచోనయిన చక్కగ మాధుకరం బొనర్చియై
నను బరహంసుఁ డన్నముఁ గొనందగు నిశ్చలపూర్ణచిత్తుఁడై ౧౮

సీ. ఆదిఁ బుట్టిననాఁడె యంటిపై మొల్చు నే
వెడజన్నిదంబులు ప్రేలిశిఖయు
బ్రాహ్మణాంగముఁ గోయ పా లుప్పవించునే
యందరమై నెత్తు రట్లకాక
సంధ్యావార్చకయున్న జంకించి యొకవేల్పు
పఱతెంచి పైఁబడి పట్టుకొనునె
వేదముల్ చదివిన విమలత్వ మొందినఁ
బొక్కునే నోరు నిప్పుల్ యటన్న
దానధర్మంబులనుచుఁ దీక్షంబు లనుచు
వెట్టి లంగీకరింతురు గొట్టిదాటు
నిజమెఱుంగ రటఁచు నారజము హెచ్చి
బ్రాహ్మణత్వంబు విడిచె నా భ్రష్టతముఁడు ౩ ఆ

శా. బాలత్వంబునఁ బ్రేతభూతగణసంబాధల్ బహువ్యాధితం
ద్రాళుత్వంబు పిపీలికాదివరిభేదంబుల్ పిపాసాక్షుధా
త్వాలస్యంబులు మున్నుగాఁ గలుగునత్యుపీడలన్ బొక్కుచుల్
జాలింబొందుట గాక దేహి కకటా! సౌఖ్యంబునుం గల్గునే ౪ ఆ

మ. శివలింగంబు లటంచు సెవ్వి పలుకల్ జెల్లెల్ జడంబుల్ కరం
బవి లింగంబు లనంగ నెట్లు దగు సమ్యగ్జ్ఞానమే లింగ మ
ట్లవుటం చ త్రదుపాధికుం డయి చిదంశాకారుఁడై యుంచు నా
శివుఁడే లింగముగా నెఱుంగఁగఁదగుల్ సిద్ధాంత మూహింపఁగన్ ౫ ఆ

గీ. అద్దములనైన జలములనైనఁ బరుల
చక్షువులనైన రహితమ స్తకుని గాఁగఁ
దను విలోకించెనేని యమ్మనుజుఁ డొక్క-
నెలకు నెక్కువ బ్రతుకండు నిక్కువంబు ౬ ఆ

మ. అతిభాగ్యాఢ్యులు బ్రహ్మవేదులు వినుం డత్యంతగుహ్యంబు శా
శ్వత మామ్నాయసుసమ్మతంబు నగువిజ్ఞానంబు వాక్రుత్తు న

ద్వితీయుం డద్వయుఁ డాత్మసిద్ధుఁ డఖిలావిష్టుండు విశ్వేశ్వరుం
డతిసచ్చిత్సుకమూర్తి పాశుపతి రూపాతీతుఁడొప్పుగ్ గడున్ ౭ ఆ

బ్రహ్మోత్తరఖండము:—

శా. స్వామీ!మీకరుణాకటాక్షమహిమన్ సర్వంబు కల్యాణమే
భూమీభారముమాని మొక్కరుఁడనై భుగ్నాంతరంగంబుతో
నీమార్గంబునఁ బూని రాకఁ గతంబేమంచు వాత్రుచ్చుమీ
శ్రీమత్పాదపయోజయుగ్మము కడన్ సిగ్గయ్యెడిం జెప్పఁగన్ ౧ ఆ

ఉ. అంత వసంత మెంతయు వనాంతరతాంతలతాంతసంతత
ప్రాంతదురంతరాంతరనిరంతరరంతుమదాళి కాంత కా
తాంతగరున్నిరంతమరుదంతరయంతఁ గఁగంతుదంతిసా
మంతమునంతయంతరుచిమంతము బొల్చెవసంతకాంతిమై ౨ ఆ

చ. అదనున సోమవారమున నందుఁ బ్రదోషమునన్ విశిష్టదు
ర్మదనవిరోధిపూజలసమం బగుభక్తిని సేయువారలై
నదృఢమనీషశంభుభజనం బొనరించిన భక్తకోటికిం
బిదుకును గామధేనువయి పేర్మిఁ జతుర్విధపూరుషార్థముల్ ౩ ఆ

గీ. భక్తుఁడైనను గాక యభక్తుఁడైన
నీచుడైనను గేవలనీచుఁడైన
నెఱిఁగి రుద్రాక్షములుదాల్పు నెవ్వఁడేని
నతఁ డఘంబులఁ బాసి సద్గతిఁదనర్పు ౪ ఆ

మ. అని పౌరాణికుఁ డీగతిం దెలుపుబల్కాలించి యక్కాంత యా
తనితో నేకత మొప్ప నిట్లనియె నోధన్యాత్మ!యీపావ
త్రన మాత్మ్యం బరికింప నేను మదినిం దర్పంబునం దర్పకుం
డనుసంధించుట దుష్టజారసురతవ్యాసక్తి వర్తించితిన్ ౫ ఆ

ఈతఁడు రచించిన బ్రహ్మోత్తరఖండమునందు కామిరెడ్డిని వర్ణించుసందర్భమున నాతనియాస్థానమునందలి పండితులు వర్తమాన శకాబ్దములతో సరిపోయి యుండిరని యీక్రిందిపద్యములో వర్ణించి యున్నాఁడు.

సీ. ఆంధ్రోళి కాఘోట కాతపశ్రీల చే
నిండు వేడ్కల మీఱి యుండువారు
ఆహితాగ్నులు సోమయాజులు నై పూది
శ్రౌతతంత్రంబులు జరుపువారు
సతతాన్నదానదీక్షాధురంధరతమై
విఖ్యాతసత్కీర్తి వెలయువారు
ఘనరనాప స్తంబమును యాజ్ఞవల్క్యుల
పగిది ధర్మంబు తేర్పరుచువారు

గీ. కలరు బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమివిభు నాశ్రయించిన బుధులు నిజము
శాలివాహనశకవర్షసంఖ్య పదియు
నైదునూర్లైన వర్తమానాబ్దములను

బ్రహ్మోత్తరఖండ ముద్రితప్రతిలో పైపద్యమునందలి "పదియు నైదు" అనుశబ్దములకు బదులుగా "వెలయునేడు" అనియున్నది. కాని అదిపొరపాటు. అర్ధరహితము. ఈపద్యమునుబట్టి బ్రహ్మోత్తరఖండము శా. శ. ౧౫౦౦ అనఁగా క్రీ. శ. 1578 వ సంవత్సరమున రచింపఁబడి నట్లు తెలియుచున్నది. సూతసంహిత యంతకుపూర్వము రచించినది కావున నది క్రీ. శ. ౧౫౭౦ సంవత్సరప్రాంతమున రచియింపఁబడినట్లు దలంపవచ్చును. సూతసంహిత రచనాకాలమునాటికి కామారెడ్డి కిరువురు తనయు లున్నారని యీక్రిందిపద్యములో చెప్పఁబడినది.

శా. కామారెడ్డివసుంధరాధిపునకున్ గళ్యాణిలింగాంబకున్
శ్రీమంతుల్ తనయు ల్సదాశివధరిత్రీనాయకుండుం గళా
గ్రామస్థేమపటుప్రచారనిధి లింగారెడ్డియు న్సద్గుణ
స్తోముల్మించిరి కశ్యపాదితుల కింద్రోపేంద్రుల ల్తేపునన్.

ఈపద్యమునుబట్టి యీకుమారులిద్దరును యుక్తవయసు రాని వారుగాఁ గన్పట్టుచున్నారు. బ్రహ్మోత్తరఖండమునందీ యిరువురను,

వర్ణించిన యీక్రిందిపద్యములనుబట్టి యుక్తవయసు వచ్చినవారివలె గ్రహింపఁదగియున్నది.

మ. అరబీ పారసి ద్రావిడంబును దెనుంగాద్యంబునన్ మున్నగా
వరభాషాలిపిభేదముల్ తెలిసిసర్వజ్ఞత్వమొప్పన్ సుధా
కరరేఖామయనిష్కళంకకళ చక్కం దాల్చుచున్ నిర్జిత
స్మరుఁడై మించె సదాశివుండచలధర్మక్రీడఁ జెన్నొందుచున్.

శా. కామారెడ్డిధరాధినాయకునిలింగారెడ్డి కెందున్గురు
స్వామిశ్రీచరణాబ్జసేవయు మహేశధ్యానమున్ దానమున్
సామీచీన్యము సర్వలోకహితకృత్సౌజన్యమున్ సత్యసం
ధామాహాత్మ్యము శిష్టధర్మగుణముల్ స్వాభావికంబుల్గదా!

ఈయిరువురుకుమారులను వర్ణించినమఱికొన్నిపద్యములు కలవుగాని గ్రంథవిస్తరభీతిచే నిందుదాహరింపలేదు. సూతసంహితరచనాకాలము అనగా క్రీ.శ 1578 వ సంవత్సరమునాటి కీయిరువురును క్రమముగా ౨౫-౨౦ సంవత్సరములవయసు కలవారని యూహింపఁదగియున్నది వీరల జనకుఁడైన కామారెడ్డికప్పటికి 50-55 సంవత్సరములవయసుండునని చెప్పవచ్చును. అనగా నీతనిజననము క్రీ. శ. ౧౫-౩౦ ప్రాంతమై యుండును.

బిక్కనవోలుసంస్థానాధిపతి యగునీకామిరెడ్డి గోలకొండ మహమ్మదీయప్రభువులకు సామంతుఁడగుటచే నీతనికాలమున గోలకొండను బరిపాలించిన మహమ్మదీయ ప్రభువులెవ్వరో తెలిసికొనుట యావశ్యకము కాకపోదు. ఈగోలకొండరాజ్యము క్రీ. శ. ౧౮౨౨ లో బహుమనీరాజులు స్వాధీనము చేసికొనిరి. అప్పటినుండియు బహుమనీ రాజులరాజ్యములోని తూర్పుభాగమునకది రాజధానియై యుండెను. అనిమహమ్మదీయ మహాయుగచరిత్రమున వ్రాయఁబడినది. ఆచరిత్రము ననుసరించి గోలకొండరాజ్యమును బరిపాలించిన మహమ్మదీయ ప్రభువులు.

| | |
|---|---|
| కులీకుతబ్‌షాహి | క్రీ.శ ౧౫౧౧-౧౫౪౩ |
| జంషిర్ కుతుబ్‌షాహి | ౧౫౪౩-౧౫౫౦ |
| ఇబ్రహీంకుతుబ్‌షాహి ఇతని నేమల్కిభరామ్ అందురు | ౧౫౫౦-౧౫౮౦ |
| మహమ్మద్ కులీకుతుబ్‌షాహి | ౧౫౮౦-౧౬౧౧ |
| అబ్దుల్లహుసేన్‌కుతుబ్‌షాహి | ౧౬౧౧-౧౬౫౮ |

దీనినిబట్టి కామారెడ్డి. మల్కిభరామ్. మహమ్మద్ కులీకుతుబ్ షాహిల కాలములో నున్నవాఁడని తెలుచున్నది. మల్లారెడ్డి రచించిన శివధర్మోత్తరమునందలి యీక్రిందిపద్యములవలన గామారెడ్డి, మహమ్మదుషాదుషాహి కాలములో నున్నవాఁడని స్పష్టమగుచున్నది.

గీ. భవ్యసులతానుమహమ్మదుపాదుషాహ
లబ్ధభూషణలలితపల్యంకి కాంత
పత్రచామరసామ్రాజ్యభరితవిభవ
రమ్యగుణశాలి శ్రీకామరెడ్డిమౌళి.

శా. శ్రీరాజ త్సులతానుమహమ్మదు ధరిత్రీభృన్నిజాంశాదరా
స్ఫారా డెదులఖానరా డగబరుత్సామ్రపాలసింహాసనో
దారాక్రాంతనితాంతసన్నుతచరిత్రప్రాభవోద్దామకా
మారెడ్డిక్షితినాథ......

కామారెడ్డి, మల్కిభరామ్ కాలములోఁగూడ నున్నవాఁడే యైనను, శివధర్మోత్తరము రచించువాటికి మల్కిభరాము కాలధర్మము నొందుటచే గోలకొండరాజ్యము మహమ్మదుకుతుబ్‌షాహి పాలనములోనికి వచ్చినందున నప్పటిప్రభు వగుమహమ్మదుషాహి నే మల్లారెడ్డి పైపద్యములోఁ బేర్కొనియున్నాఁడు.

దీనినిబట్టి సోమనాథసోమయాజి, అద్దంకి గంగాధరకవి, పొన్నికంటి తెలగనార్యులతో నించుమించుగ సమకాలికుఁడనియు క్రీ. శ. ౧౫౫౦-౧౬౦౦ మధ్యనున్నవాఁ డనియునిశ్చయముగాఁ జెప్పవచ్చును. కామారెడ్డి క్రీ. శ. ౧౫౩౦ సంవత్సరప్రాంతమున జన్మించి,

౧౬౦౦ సంవత్సరమువఱకు జీవించియున్నాఁడని తలంపవచ్చును. మల్లారెడ్డి పద్మపురాణమును రచించునప్పటి కీతఁడు జీవించియున్నాఁడనుట నిశ్చయము.

పై శార్దూలవృత్తములో చెప్పఁబడిన "అక్బరుతుస్మేపాలుఁడు" ఢిల్లీ సామ్రాజ్యమును బరిపాలించిన అక్బరు చక్రవర్తియేనా? లేక తన్నామధారుఁడగు మఱియొకఁడా యనిసంశయము కలుగుచున్నది. ఢిల్లీ చక్రవర్తియని యనుకొన్నను నాతఁడు క్రీ శ ౧౫౫౬-౧౬౦౫ మధ్యవాఁడగుటచే నీకాలము సరిపోవుచున్నది. అపద్యములోఁ జెప్పఁబడిన ఏదులాఖా నెవ్వఁడో నిశ్చయింపలేదు. ఆపేరులుగలవారిద్దరు ముగ్గురున్నారు. ఎట్లయినను. కామారెడ్డి పరాక్రమమును సుగుణములును, గోలకొండ ప్రభువులనే కాకుండ, ఆకాలపు మహమ్మదీయ పరిపాలకులగు మఱికొందరినికూడ నాకర్షించినవని చెప్పవచ్చును. సూతసంహితలోనుండి యుదాహరింపఁబడిన యొక పద్యములో "బలుపూనికముగ్గురు పాదుశాహులున్ బొగడఁగఁగామిరెడ్డి నృపపుంగవుఁడెన్నమనుష్యమాత్రుఁడే" యని చెప్పఁబడిన ముగ్గురు పాదషాలను పై పద్యములోచెప్పఁబడిన మహమ్మదు కుతుబ్‌షా, ఏదులఖాను, అక్బరులై యుందురని తలంపవలసియున్నది.

ఉమాపత్యభ్యుదయమునందుఁ గామిరెడ్డికి, అబ్దుల్లా హుసేన్ కుతుబ్‌షాహా, హిజరీ ౧౦౫౫ సంవత్సరమున గ్రామములనిచ్చిన ట్లీక్రింది పద్యములో వ్రాసియుంచెనని సూతసంహిత పీఠికకారులు వ్రాసియున్నారు.

మ. సదయుం డబ్దులుషా కుతుబ్షు హిజరీశాబ్దము౦దేవునన్
బదినూటేబదియేను వర్షమునఁ గామారెడ్డికిన్ గౌరవా
స్పదచిహ్నంబులతోఁడ నూళ్లొసఁగుచున్ సర్వాధికారంపుస
న్నదు నీరీతి యొసంగెఁ దన్నృపుని ప్రజ్ఞాశక్తిఁ గీర్తింపుచుఁ.

హిజరీ ౧౦౫౫ అనగా క్రీ. శ. ౧౬౩౬ అగుచున్నది. ఈపద్యమందు చెప్పఁబడిన కామారెడ్డియు, సూతసంహితను గృతినందిన

కామారెడ్డియు నొక్కరే యనిపీఠికాకారు లనుచున్నారు. అదివాస్తవము కాదనితోఁచుచున్నది. అదినిజమైనచోఁ గామారెడ్డి నూఱేండ్లు దాఁటి జీవించినవాఁ డనిచెప్పవలసివచ్చును. ఈపద్యములోఁ నుదాహృతుఁడైన కామారెడ్డి. ఎల్లారెడ్డి కుమారుఁడగు చినకామారెడ్డి యైయుండును.

---

# 231 కామినేని ఎల్లారెడ్డి

ప్రభువై, పండితుఁడై, కవియై, కృతిపతియై, కీర్తికాయుఁడైన యిమ్మహనీయుని చారిత్రము వ్రాయుట కీతఁడు రచించిన గ్రంథములు నామమాత్రావశిష్టములైనందున, నితరాధారములమీఁద నాధారపడవలసివచ్చినది. ముందుగనా యాధారములనిటఁ జెప్పి పిదప నీతనివంశవృక్షమునిచ్చి యీతనిచరిత్రమును వ్రాయుదును. పట్టమట్ట సోమనాథసోమయాజికృత సూతసంహితను గృతినందిన కామిరెడ్డి యీతనికగ్రజుఁడు. పద్మపురాణాదిగ్రంథములను రచించి పేరుగనిని మల్లారెడ్డి యీతనికవరజుఁడు. సోమనాథసోమయాజికృత బ్రహ్మోత్తరఖండమును గృతినందినదీ యెల్లారెడ్డియే. ఈతనివంశవృక్ష మిది.

కామినేని చౌదరి (రాచుళ్ళ గోత్రీయులు)






ఈవంశవృక్షమునకు మూలపురుషుఁడైన కామినేనిచౌదరిని బట్టియే యీవంశమునకు 'కామినేని' యనుగృహనామ మేర్పడినట్లు సూతసంహితయందలి యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

మ. అరిభేదంబొనరించుచుం గువలయాహ్లాదంబు గల్పించుచుం
వరదుర్గాధిప మౌళిరత్నమనఁ గన్ జైవాతృకుండై తగన్
సిరితోఁబుట్టు కళావిశేషములకున్ శ్రీకామినేఁడన్న చం
దురుఁడౌ రాచుళగోత్రవార్ధిఁ దగుకీర్తుల్పిండికల్ గాయఁగన్.

క. భరతునిపేరిట భారత
వరవంశము భంగి నాత్మవంశము తనపే
రరహిం వహింపఁగ మించెను
ధరణిన్ శ్రీకామినేనిఁ దగఁ బొగడొందన్.

నెల్లూరుమండలమందలి చుండి సంస్థానాధిపతులగృహనామము కామినేనియే కానివారును వీరును సంబంధబాంధవ్యములను గలిగినవారు కారు. రెడ్లలో పంటరెడ్లు, పాకనాటిరెడ్లు, మోటాదరెడ్లు, భూమంచిరెడ్లు లోనగు శాఖాభేదములున్నవి. ఈకామినేనివారు పాకనాటిరెడ్లు. వీరు సూర్యవంశపు క్షత్రియజాతివారైనట్లు సూతసంహిత యందలి యీక్రిందిరెండు పద్యములలోఁ జెప్పఁబడియున్నది.

సీ. అఖిలాండకోటిబ్రహ్మాండాదికారణ
హరిదక్షిణసునేత్రమయ్యె నెవ్వఁ
డనవద్యహృద్యపథ్యామ్నాయ లావణ్య
కవితగాత్రుండయి వెలఁగె నెవ్వఁ
డమలినచ్ఛాయా మహాదేవిచిత్తప
ద్మాచ్ఛమరందాళియయ్యె నెవ్వఁ
డవనీచరాచరనివహావృద్ధిక్షయా
త్యంతనిదానుఁడై యలరె నెవ్వఁ

గీ. డట్టిరవినుండి యుదయించెనలఘుదళిత
దుర్మదారాతివితతియస్తోకసుగుణ
నీతిభూసురపాలననియతిసుగతి
దనరుక్షత్రియజాతియుదారరీతి

గీ. పరమపావనమైనతద్బాహుజన్మ
జాతిశాఖోపశాఖల జగతినిండె
నందు శ్రీపాకనాటిరెడ్డ్యన్వయంబు
చాలఁజెలువొందు విరులలోజాజిభంగి

గీ. ఆపాకనాటికులమున
రూపింపఁగ మేలుబంతిరూఢికాధర్మ
వ్యాపారనిర్మలంబై
యేపునరాచుళ్ళగోత్రమెన్నికగాంచెన్.

పాకనాటిరెడ్లను, సూర్యవంశపు క్షత్రియులనియు, బాహుజన్ములనియు, ద్వితీయజాతియనియు, పైపద్యములలో వర్ణించిన యీ సోమనాథసోమయాజియే, తనబ్రహ్మోత్తరఖండమునందు పాకనాటి రెడ్లనే నాలవజాతియని యీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. ప్రణుత నానాసుపర్వకిరీటఘర్షణ
కిణములోయనగుచ్ఛమణులు దనర
సంతతసంసక్తసనకాదిమునిహృద్రి
రాగమోయనగళరక్తిమదగ

భజనశీలత మోవిభంగదీయౌదత్తు
చంద్రులో యన నఖాంచలములమర
లావణ్యసింధుసమావిష్కవక్త్రవా
ళ్లలతలో యనఁగ వంగుళులుదనర
గీ. నందమగునాదిపూరుషు నంఘ్రియుగళి
దొడరియుదయించిమించుఁ జతుర్థజాతి
సమధికస్ఫూర్తి నవనవాంచద్విభూతి
సర్వలోకైకరక్షాప్రసన్నరీతి

మ. తగునానాల్గవజాతియందుఁ గడుపాత్రింబావ్రిచారంబునన్
పొగడం మించుచుఁ బాకనాఁటికుల మఖ్యాభర్యస్య వాయంబునం
దు గరీయస్ఫుటి విక్రిమక్రిమకళాదోర్వీర్యని స్తుల్య దా
నగుణప్రౌఢిమవాసిగాఁగ వెలయుఁ రాచుళ్ళగోత్రింబునాఁ

ఒక గ్రంథమున ద్వితీయజాతియనియు, వేఱొక పుస్తకమున, నాల్గవజాతియనియు వర్ణించుటఁచూడ, కామిరెడ్డిని బీరితునింజేయుటకై మొదట సూర్యవంశపుక్షత్రియులని వర్ణించియుండెననియు, నంతకంటెఁబండితుఁడును గవియునైన యెల్లారెడ్డి, తమకులమును మార్చుకొనిక్షత్రియులమని చెప్పుకొనుట కిష్టము లేనివాఁడగుటను, క్షత్రియులమని చెప్పుకొనినంతమాత్రమున గొప్పతనముగాని, భగవంతుని పాదములయందు జన్మించినజాతియని చెప్పుకొనుటచే నీచత్వముగాని రాదనియుఁ దలంచువాఁడగుటను గాఁబోలు రెండవగ్రంథమున నాల్గవజాతియనియు సోమనాథసోమయాజి రచియించియుండవలయును. రెండుగ్రంథములయందును రెండువిధములుగా వ్రాయుట కింతకంటె వేఱుకారణముండునని తోఁచదు. ఎల్లారెడ్డిసోదరుఁడును, సోమనాథ సోమయాజితో సతీర్థ్యుఁడు నగు మల్లారెడ్డి తనశివధర్మోత్తరములో

సీ. అక్షుద్రరుచిసముద్యద్గ్రహానక్షత్ర
తారకల్ కుసుమసంతతులుగాఁగ
భూర్భువస్స్వర్మహర్భూరిచతుర్దశ
భువనముల్ సత్ఫలనివహములుగ

బ్రిబలకూలంకషాంభః ప్రపూరితసము
    ద్రంబులు మకరందరసఝరులుగ
నబ్జజాది పిపీలికాంత నానాజీవ
    గణములు విహగాదికములుగాఁగ

గీ. గరిమఁగన్పట్టు నలవిరాట్పురుషకల్ప
కంబుతత్పాదకమున నుర్విఖ్యాతిసరణి
నుదయమై మించె విబుధసమ్మదవిభూతి
నాలుగవజాతి పూర్ణసంతానరీతి

వ. తెలివిఁ బంజిలునట్టి నాలుగవజాతిఁ గోత్రసంఘంబులో
పలఁగల్గంగమలాన్వదంబగుచు శుంభద్వాహినీమండితో
జ్జ్వలనైతఁ ఘనులాశ్రయింపఁగను శేవఁ బాకనాడన్వయం
బలఘుస్ఫూర్తి యశంబునొందె భువిక్షీరాంబోధిచందంబునన్.

అను పద్యములోఁ బాకనాటిరెడ్లు నాల్గవజాతియని స్పష్టముగా జెప్పియుండుటగూడ పైయూహకుఁ బలమొసంగుచున్నది. వేమారెడ్డి మొదలుగాగల పంటరెడ్లనుగూడ ఎఱ్ఱాప్రెగ్గడ శ్రీనాథాదులు నాల్గవ జాతిగానే చెప్పియున్నారు. కాని ద్వితీయజాతియని చెప్పలేదు. అన వేమారెడ్డి కుమార్తెను సూర్యవంశపు చోళరాజయిన, భక్తిరాజుకొడుకగు భీమలింగమునకొసఁగి పరిణయము చేసియుండిరనియు, నందుచే నీరెడ్లను సూర్యవంశపుక్షత్రియులని భావింపవలసియుండు ననియుఁ గొందఱనుచున్నారు. కాని యదియంగీకరింపఁ దగినమాటకాదు. ఒక క్షత్రియప్రభువొక రెడ్డిప్రభుతనయను బరిణయమాడినంత మాత్రమున నీరెడ్లు సూర్యవంశపుక్షత్రియు లగుదురని తలంపవీలులేదు. రెడ్డికులచంద్రికలో, నీపాకనాటిరెడ్లు సూర్యవంశపు క్షత్రియులని నిర్ధారణ మొనర్చినట్లు చెప్పుచున్నారు. ఆవిషయమునంతయు నామూలాగ్రముగా విమర్శించుటకిట తావునుచాలదు. అప్రస్తుతప్రశంసయు నగును. రెడ్డికవులును, రెడ్డిప్రభువులును నాకాలములో తమజాతినిగూర్చి యెట్లుతలంచుచుండిరో పైనవ్రాసియుంటిని. పాఠకులాయా గ్రంథము

లను విమర్శించి చూచి తమ యభిప్రాయమును నిర్ణయించుకొందురు గాక !

సోమనాథకవియు, మల్లారెడ్డియు, కామినేనిచౌదరికి, కాచారెడ్డి కుమారుఁడనియు, భోగిరెడ్డి మనుమఁడనియుఁ జెప్పియుండలేదు. కామినేనివంశమున రెడ్డిప్రభువు జన్మించెననియు, ఆ రెడ్డికి, కాచారెడ్డి, మల్లారెడ్డి, బొమ్మారెడ్డి అనవారలు జన్మించిరనియు వ్రాసియున్నారు. పై వంశవృక్షములో నున్న భోగిరెడ్డినే పైగ్రంథములలో రెడ్డిప్రభువని చెప్పియున్నారు. సూతసంహితకు పీఠికవ్రాసినవారిచ్చిన వంశవృక్షమునుబట్టి నేను పై వంశవృక్షము నిచ్చియుంటిని. కానిగ్రంథములన్నిఁటిని బరిశీలించిచూడగా, మొదటికాచారెడ్డి, కామినేని చౌదరికిఁబుత్త్రుఁడు కాఁడనియు, నావంశమున జన్మించినవాఁడనియుఁ దేలినది. ఆతనికుమారుఁడు, రెడ్డిగాని, భోగిరెడ్డి కాఁడు. మల్లారెడ్డి రచించిన పద్మపురాణమునందీరెడ్డిప్రభువును వర్ణించిన యీక్రిందిపద్యములోని "శ్రీచిరభోగి" యనువాక్యమునందున్న భోగిశబ్దమును తరువాతనున్న రెడ్డిశబ్దముతోఁ జేర్చి పీఠికాకారులతనిని భోగిరెడ్డిగాఁ జేసియుందురని నేననుకొనుచున్నాఁడను.

ఉ. శ్రీచిరభోగి రెడ్డినృపశేఖరుఁడిద్ధమనోహరాకృతిన్
దేచమఁ బెండ్లియై కసిరెు ధీరులమువ్వుర సత్కుమారులం
గాచవిభుం గుమారసిభుఁ గంధిగభీరుని మల్లభూవరున్
ధీచతురాస్యు బొమ్మనృపతిన్ మునియత్రి త్రిమూర్తులంబలెన్.

ఈపద్యమునకుఁ బూర్వమందున్న యీక్రింది పద్యమునుబట్టి యీతనినామము రెడ్డియేగాని భోగిరెడ్డి కాఁడని స్పష్టమగుచున్నది.

శా. ఆకాచక్షితిభర్తగాంచెఁ దనయుం బ్రాగ్రాజరాజన్నయున్
లోకాలోక మహేంద్రముద్రిత మహాలోకైక విఖ్యాత సు
శ్లోకున్ భూరివివేకు రెడ్డినరపాలున్ ధర్మశీలున్ దయా
లోకానందితబాంధవోత్కరు సుధీలోకానుకంపాకరున్.

నాలుగైదుగ్రంథములలోను నీతనిని రెడ్డిభూవిభుఁడనియే చెప్పియున్నారు. కావుననీతనినామము భోగిరెడ్డి కాఁడనుట నిస్సంశయము.

ఈరెడ్డిభూపతికిఁ దండ్రియైన మొదటి కాచారెడ్డి కర్నాటరాజ్యములో నొకదుర్గాధిపతియై యుండగా నప్పటిసుల్తాను ఆతనిని దనదేశమునకు రప్పించి మెదకుమండలమునఁ గలి బిక్కనవోలు నాతనికిచ్చె ననియు నప్పటినుండియు నాబిక్కనవోలు రాజధానిగా నాపరిసరదేశము నీవంశీయులు పరిపాలించుచుండిరనియు, నీక్రిందిపద్యములవలన దెలియంగ నగుచున్నది.

మ. మును కర్ణాటక రాయదుర్గమును సమ్మోదంబు సంధిల్ల సా
రనయోదారత నేలి యంతట మహారాజైనసుల్తానుచే
ఘనసన్మానముఁ గాంచి యాంధ్రధరహిఁ బ్రఖ్యాతిం బ్రకాశించు బి
క్కనవోల్పట్టణ మేలుచుండె నలస్వర్గం బింద్రుచందంబునన్

పద్మపురాణము

మ. ఘనుఁడా కాచనృపాలశేఖరుఁడు మున్ గర్ణాటదేశంబునం
దున దుర్గాధిపతిత్వవైభవము దోడ్తో గాంచి సుల్తానుపి
ల్పునఁ గృష్ణానదిదాఁటి యామెదుకుబల్దుర్గంబుక్రిందన్ జిరం
తనమౌ బిక్కనవోల నుండె నది యాత్రస్థానరాజంబుగన్

శివధర్మోత్తరము.

గీ. ఇప్పుగిది కాచరెడ్డి భూమీశమౌళి
యెదురులేనిపరాక్రమ మెసఁగ మెసఁగ
నవని యేలంగ సుల్తానుమహమ్మదనెడు
హిందుపాదుష గోల్కొండ నేలుచుండె.

శా. ఆసుల్తా నొకనాఁడు కాచవిభుధైర్యస్థైర్యముల్ విన్నవాఁ
డై సైబాసని మంత్రులం బిలచి యల్లారే మహదా యెంతవా
డో సూడం గలకాచరెడ్డి మనకున్ యుద్ధంబులో నట్టివాఁ
డే సాయంబుగ నున్న నెమ్మెదురు వారెందుండురీ ధారుణిన్.

మ. ఇపుడే వ్రాయుడి శాశ్వతంబుగవు లాకేక్కమాటు గోల్కొండదే
శపుమధ్యంబున మెద్కుసీమ కడబాళం చిత్తు వే వచ్చియా

నృపు నేల్కొమ్మనుఁ డంపుఁడాతనికి సిర్భించాంకరాజార్హానూ
త్నపవిత్రోలఘురత్నభూష లనియాజ్ఞాపించినన్ వారునున్.

గీ. ఇట్లు సులతాను దయఁ జేసినట్టి కవులు
రాజబిరుదంబు నవరత్నరచితభూష
లల్ల నల్లనఁ జేరె కాచావనీశు
హస్తమును నాతఁ డవి శిరమందుఁ దాల్చి

శా. కాంతారంబులఁ గొట్టి దుష్టమృగసంఘాతంబు వేఁటాడి దు
ర్దాంతక్రూరనిశాటకర్మ మగుచోరవ్రాతముఁ జంపి య
భ్రాంతాత్యున్నతవప్రసంకలితహర్మ్యశ్రేణితోఁ గాచభూ
కాంతుం డచ్చటఁ గట్టెఁ జిత్రమలరంగ న్బిక్కనూలన్బురిన్

మ. అదిసుల్తానునసుజ్ఞచేఁ దనకు రాజాస్థానమైయొప్ప

ఉమాపత్యభ్యుదయము.

కర్ణాటకరాజ్యమునుండి కాచారెడ్డిని బిలిపించి బిక్కనవోలు సీమ నిచ్చినదొకసుల్తానని మాత్రమే పద్మపురాణమునందును శివధర్మోత్తరమునందును మల్లారెడ్డి చెప్పియున్నాఁడు కాని యాసుల్తానుపేరు చెప్పలేదు. ఉమాపత్యభ్యుదయములో నాసుల్తానుపేరు సుల్తానుమహమ్మదనియు నతఁడు గోల్కొండపరిపాలకుఁ డనియు వ్రాసియున్నాడు. ఈవిషయమునఁ గొంతవిమర్శన మావశ్యకమై యున్నది అందును గూర్చి ఉమాపత్యభ్యుదయకవిచరిత్రమున వ్రాయఁదలఁచి యిటవిడచితిని.

ఈబిక్కనవోలిపట్టణము గోదావరిమండలములోనిదని మల్లారెడ్డిచరిత్రమున బ్ర. శ్రీ. వీరేశలింగముపంతుగారు వ్రాసియున్నారు. కాని యది పొరపాటు. కవులచరిత్రముయొక్క రెండవభాగమును పునర్ముద్రిత మొనర్చుట తటస్థించియుండెనేని, యీపొరపాటు నాయనయే సవరించియుందురు. ఇఁక నావిషయమును చర్చింపఁ బనిలేదు. ఈరెడ్డిప్రభువులు పరిపాలించినది నైజామురాష్ట్రమందలి మెదక మండలములోని బిక్కనవోలేగాని గోదావరిమండలములోని బిక్కవోలు కాదనుట నిశ్చయము.

పైన చెప్పిన కాచారెడ్డికుమారుఁ డైన ఎల్లారెడ్డి మహాదాత యనియు, బాలభారతము, కిరాతార్జునీయమను రెండుగ్రంథములను గృతినందెననియు సూతసంహితయందలి యీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

శా. ప్రారంభం బొనరం దటాకవితతుల్ బ్రహ్మప్రతిష్ఠల్ ఘను
గ్రారామంబులు సత్కృతుల్ నిధులు పూర్ణావాసముల్ దేవతా
గారంబుల్ చెలువైనసంతతులు విఖ్యాతంబుగా నిల్పె శృం
గారాంభోనిధి యెల్లరెడ్డివరుఁ డాకల్పాంతరస్థాయిగన్.

మ. అమితప్రౌఢిమ బాలభారతము యోగ్యంబౌ కిరాతార్జునీ
యము నాసత్కృతులొంది దానఖచరుం డౌ నా ననన్ మించెఁ గా
చమహీపాలకు నెల్లరెడ్డివిభుఁ డాచంద్రార్కసంస్థాయికీ
ర్తిమరాళీనవమానసీకృతదిశాదేశాధిపాస్థానుఁ డై.

ఈబాలభారత కిరాతార్జునీయము లనురచించినకవి యెవ్వరో తెలియదు. ఆగ్రంథము లిప్పుడెచ్చటను లభింపలేదు. కాకుమానిగంగాధరకవికృత బాలభారత మొకటి నామమాత్రావశేషమై యున్నది. అది యిది యేమో యనుటకుఁగాల మాటంకము చేయదు. కాని యందుల కాధారము లభ్యము కాలేదు. ఈయెల్లారెడ్డికుమారుఁడైన మూఁడవ కాచారెడ్డిని యాతనిభార్య యైనతిప్పాంబికను పట్టమట్ట సోమనాథ సోమయాజికవియు, మల్లారెడ్డికవియుఁ దమతమగ్రంథములలో ననేక పద్యములలో వర్ణించియున్నారు గ్రంథవిస్తరభయముచే వానినన్నిటి నిటవ్రాయుట మాని సూతసంహితయందలి రెండుపద్యముల నుదాహరించి తృప్తి నొందెదను.

సీ. అఖిలధర్మవిధిజ్ఞుఁ డన నొప్పు ప్రాజ్ఞుండు
దుర్ద్యూతకేళికిఁ దొడఁగఁ డేని
రాజసూయమహాధ్వరం బొనర్చిన పెద్ద
బలముదక్కి విరాటుఁ గొలువఁ డేని
చర్చింపగ నజాతశత్రుసంజ్ఞ మహాత్ముఁ
డాత్మవంశజులపై నలుగఁ డేని

సత్యసంధాహరిశ్చంద్రుఁడై తగుమేటి
పూనిక గురునెడఁ బొంకఁడేని
గీ. యప్పు డాధర్మజుని సాటి యనఁగవచ్చు
నెల్లవిభుకాచరెడ్డిధాత్రీంద్రుతోడ
ధర్మగతి సంతతప్రభుత్వ ప్రశస్తి
శమదమంబుల సత్యభాషావిరూఢి.
సీ. ఇలవేల్పు సిద్ధరామేశ్వరు భజియించె
సంతతమ్ముష్టాన్నసత్రకలన
గౌతమీతటిముక్తికాశీశులకుఁ గూర్చె
నింతాభిషేకాంబునిర్ఝరంబు
కృష్ణామహాతరంగిణిఁ గుఱింకి షోడశ
దానము లూభుసురోత్తముల కొసఁగె
శ్రీశైలనాథు భజించెను దోసిళ్లఁ
బోసగించి బంగారుపుష్పములను
గీ. సకలధర్మంబు లెల్లను సంతరించె
నాఁ సత్పుత్రజనయిత్రి యైనఫలము
కాచరెడ్డీంద్రుతిప్పమగారిసాటి
గలరె సాధ్వులు మూఁడులోకములయందు.

ఈపుణ్య దంపతులకు నలుగురుకుమారులు. 1. జంగమరెడ్డి 2. కామిరెడ్డి 3 ఎల్లారెడ్డి 4. మల్లారెడ్డి. ఇందుఁ బ్రథమపుత్రుఁడైన జంగమరెడ్డిని సూతసంహితయందు వర్ణించినపద్యములలో నొకపద్యమును దాహరించెదను.

ఉ. కొంగుపసిండి యాశ్రితులకున్ హితబాంధవమిత్రపంక్తికిం
దంగెటిజున్ను ముంగిటనిధానము సత్కవివర్యకోటికిం
బంగరుకొండ భూమిప్రజపాలికిఁ గాచనృపాలవర్యుశ్రీ
జంగమరెడ్డిచంద్రునకు సాటియె యెవ్వరు నివ్వసుంధరన్.

రెండవపుత్రుఁడైన కామిరెడ్డియే సూతసంహితకృతి భర్త. ఇతఁడు దేవాలయములఁ బ్రతిష్ఠించియు, తటాకములు త్రవ్వించియు,

కవులను బండితులను బోషించియు శాశ్వతయశస్సు నార్జించిన పుణ్యపురుషుఁడు, శివభక్తుఁడు. ఈతనిని సోమనాథసోమయాజియు, మల్లారెడ్డియుఁ జాలపద్యములలోఁ గీర్తించియున్నారు. అందుఁ గొన్నిపద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

చ. తగవులు దీర్చికూర్చు సరదారులమేటివజీరు కోటివా
సిగఁ దృణమైన మేరువుగఁజేయును మేరువునైన నాతృణం
బున నొనరింపఁజాలు బలుపూనిక ముప్వురు పాదుశాహులన్
బొగడఁగఁ గామిరెడ్డికృపపుంగవుఁ డెన్నమనుష్యమాత్రుఁడే.

సీ. కొండవ్రలుగొట్టి కరపట్టణంబులు
గావించె శ్రీధాన్యకటకములుగ
జమ్మాకుమడఁచిన జలములబ్బనిత్రోవఁ
జెఱువులుత్రవ్వించె సింధువులన
బిట్టిచేరఁగనైనఁ జెట్టులేనెడ నిల్పె
ఫలవనుల్లంఘనప్రాయములుగఁ
గలనైనఁ జిన్నపైకము లెఱుంగనివారి
నిర్వహించి కుబేరనిభులఁ జేసె

గీ. నతఁడు కేవలమనుజుఁడే యబ్ధివలయు
తాష్టదిగ్దేశ రాజసభాంతరాళ
పిచ్ఛిలాచ్ఛయశశ్శాలి విక్రమాలి
కామిరెడ్డీంద్రుఁ డభినవాఖండలుండు...

సూతసంహిత

సీ. తన గురూత్తము పేర జనకుని పేరను
దనయన్న పేరను దనదు పేరఁ
దమ్ములపేరను దనయు పేరిటఁ దల్లి
పేరను సోదరి పేర భార్య
పేర మఱుఁదలి పేరను లింగాపు
రంబును గాచాపురంబు జంగ

మారెడ్డిపురము గామారెడ్డియును నెల్ల
రెడ్డిపేటయు మల్లరెడ్డి కామి
తే. రడిపేఁటలు దిప్పాపురంబు సిరులఁ
బొదలు లింగాపురంబును బోతసాని
పల్లెయునుమించఁ గట్టించె భవ్యకీర్తి
ప్రజలుమాయన్న శ్రీకామిరడ్డిఘనుఁడు.

శివధర్మోత్తరము.

పైని చెప్పిన నలుగురిలో మూఁడవవాఁడగు నెల్లారెడ్డియే యీచరిత్రకు నాయకుఁడు. ఇతఁడు పట్టమట్ట సోమనాథ సోమయాజి వలన బ్రహ్మాండోత్తర పురాణమును గృతినందియుండెను. మల్లారెడ్డి కృతమగు శివధర్మోత్తర మనుగ్రంథమునకు పీఠికవ్రాసిన దోమకొండ సంస్థాన కవిశేఖరుఁడైన పెద్దమందడి వేంకటకృష్ణకవిగారు బాలభారతకిరాతార్జునీయములను గృతినందిన ఎల్లారెడ్డియు బ్రహ్మోత్తరఖండమును గృతినంది వాసిష్ఠలైంగధర్మములను రచించిన నెల్లారెడ్డియు నొక్కరే యని పీఠికలో వ్రాసియున్నారు. కాని యది పొరపాటు. బాలభారత కిరాతార్జునీయములను గృతినందినయాతఁడు తాతయెల్లా రెడ్డి బ్రహ్మోత్తరఖండమును గృతినందినయాతడు మనుమఁడైన యెల్లారెడ్డి. ఇద్దరు ఎల్లారెడ్లకును తండ్రులనామములు కాచారెడ్డులే. ఎల్లారెడ్డికును తాతపేరు మనుమని కెట్లుంచిరో కాచారెడ్డియును తాత పేరు మనుమనికి నట్లే యుంచిరి. అందుచే నీభ్రమ కలిగినది కాని వాస్తవముచేత వారిరువురును నొక్కరు కారు. భిన్నవ్యక్తులు.

శివధర్మోత్తరమునందు మల్లారెడ్డి తనసోదరుఁడైన యెల్లారెడ్డి నిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. స్వాంతధరాచక్రిమంతయువశముగాఁ
బాపకోపత్యణంబుఁబొలిదున్ని
జ్ఞానసుజ్ఞానబీజంబులు వెదపెట్టి
సద్గురుకరుణారసంబు నించి

యన్నృతాళివర్గంబు లనెడుకలుపు దీసి
వరగుణజనులఁ గావలులఁ బెట్టి
సిద్ధరామేశప్రసిద్ధపూజ ఫలింప
సుకృతధాన్యంబు రాసులుగఁ జేసె
తే. సౌర బిక్కనవోలి పురాధినాథ
కాచవిభునెల్లరెడ్డి భూకాంతుఁ డేమి
భవ్యసుల్తాన్ మహమ్మదు పాదుశాహి
కలములోపలఁ గన నింత కాఁపు గలఁడె ?

ఈయెల్లారెడ్డిభార్య పోచమాంబ. ఈయెల్లారెడ్డి బాలభారత కిరాతార్జునీయములను గృతినందినట్లు చెప్పలేదుసరికదా తమతాతయైన యెల్లారెడ్డి యాగ్రంథములఁ గృతినందె ననియు, నాతనిభార్య మల్లాంబయనియు నీక్రిందిపద్యములలోఁ వేరుగాఁ జెప్పియుండెను.

"ఎల్లరెడ్డి యందె హెచ్చనంగఁ బదార్థ
సృష్టిపాకరీతి వృత్తులలర
బాలభారతప్రబంధ కిరాతార్జు
నీయకృతులు కీర్తి నివ్వటిల్ల
క. ఎల్లారెడ్డి మహీంద్రుఁడు
సల్లలితగుణంబులందు శచియనఁదగు నా
మల్లాంబఁ బెండ్లియై తా
ముల్లోకము లెఱుఁగ విభవముల విలసిల్లెన్.

శివధర్మోత్తరకృత్యాది."

కావున బాలభారతకిరాతార్జునీయ కృతిపతిని నిర్ణయించుటలో శివధర్మోత్తరపీఠికాకారులు పొరపాటు పడిరని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఇంతేకాదు ఆపీఠికాకారులే ఆకృతిపతియైన యెల్లారెడ్డితల్లి మాచాంబయని బ్రహ్మాండోత్తర ఖండమునందలి యీక్రింది పద్యములో నున్నదని పీఠికలో నుదాహరించియున్నారు.

సీ. అందె నెవ్వఁడు కిరాతార్జునీయము బాలభారతంబనెడి ప్రబంధ
యుగళి...

గీ. అతఁడు మదవద్విరోధిగర్వాంధకార
భంజనప్రక్రియాలోకబాంధవుండు
కాచవిభుమాచమాంబికాగర్భజలధి
చంద్రుఁడగు నెల్లరెడ్డి ధాత్రీంద్రమౌళి.

ఈతనిమనుమఁడైన యెల్లారెడ్డితల్లి తిప్పాంబిక. తండ్రిపేర్లిరువురు యెల్లారెడ్డులును కాచారెడ్డియేయైనను, తాతయెల్లారెడ్డి తల్లి మాచాంబికయనియు మనుమఁడు యెల్లారెడ్డితల్లి తిప్పాంబికయనియు వారిగ్రంథములలోనే స్పష్టముగా నున్నది. పైని చెప్పిన పీఠికాకారులీభేదమును గ్రహించియు, "మాచాంబయనుపేరు నామాంతరమై యుండనోవు" అనివ్రాసి సమాధానపడిరి మాచాంబకు తిప్పాంబయని నామాంతరమున్నదనుటకంటె యెల్లారెడ్డులు భిన్నవ్యక్తులనుటయే సమంజసము. అదియే సత్యమని ఋజువగుచున్నది. కావున నెల్లారెడ్డి నామధేయులిరువురు గలరనియు, నందుఁ మొదటి యెల్లారెడ్డి కిరాతార్జునీయ బాలభారత కృతిపతియనియు రెండవయెల్లారెడ్డి యీచారిత్ర నాయకుఁడనియు నిర్ణయింతము.

ఈమనుమఁడు యెల్లారెడ్డి, సుల్తాను మహమ్మదీ పాదుషాకాల మునందున్నాఁడని శివధర్మోత్తరము చెప్పుచున్నదికావున, 1550-1600 నడుమనున్న వాఁడనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఇంతియేకాదు పైనిచెప్పిన వెంకటకృష్ణకవిగారే సూతసంహిత పీఠికలో కిరాతార్జునీయ బాలభారత కృతిపతి కామినేనివారిలో ఆదిపురుషుఁడని యంగీకరించియున్నారు. కాని, యీతనిమనుమఁడైన కామిరెడ్డిని ఏడవతరమువాఁడని వ్రాసినారు. అదిమాత్రము పొరపాటు. కామిరెడ్డియు నీయెల్లారెడ్డియు సోదరులు - ఎనిమిదవ తరమువారు. ఈవిషయముకూడ యెల్లారెడ్డులు భిన్నులనియు, 6, 8 వ తరములలోని వారనియు ధృవపరచుచున్నది.

ఈవిషయమున నింక సాక్ష్యమక్కఱ లేదు. ఇంకను గావలయు నందురేని, సోమనాథసోమయాజికృత సూతసంహితకృత్యాది సాక్ష్యమీయఁగలదు గ్రంథవిస్తరభీతిచేతను, అనవసరమనియుఁ దలంచి,

యీపద్యముల నిట నుదాహరింపలేదు. ఈకవి రచించిన గ్రంథములు లభింపమి, కవిత్వశైలి రుచిచూపింపకయే యీతని చారిత్రమును ముగింపవలసివచ్చినది.

పట్టమట్ట సోమనాథసోమయాజి సూతసంహితలో కిరాతార్జునీయ బాలభారతములను గృతినందిన యెల్లారెడ్డిభార్య మలాంబిక యనియు, నాతని మనుమఁడైన, యీయెల్లారెడ్డిభార్య పోచమాంబ యనియు నీక్రిందిపద్యములలో వేరువేరుగా వర్ణించియున్నాఁడు.

మ. అమితప్రౌఢిమ బాలభారతము యోగ్యంబౌ కిరాతార్జునీ
యము నా సత్కృతు లొంది దానచరుఁడౌ నా నన్నింబెఁ గా
చమహీపాలకు నెల్లరెడ్డివిభుఁ డాచంద్రార్కసంస్థాయికీ
ర్తిమరాళీనవమానసీకృతదిశాదేశాధిపస్థానుఁడై

క. ఎల్లారెడ్డిక్షితిపతి
మల్లాంబిక నుద్వహించి మహిమ వహించెన్
గల్లోలమాలి గంగా
కల్లోలినిఁబరిణయించి గడువెలయుగతిన్

× × × × ×
× × ×

ఉ. ఎల్లయకాచిరెడ్డి ధరణీశ్వరుపుత్రకుఁ డెల్లరెడ్డిభూ
వల్లభమౌళి పాత్రనిరవద్యమహీసురకోటి కిచ్చిన
త్పుల్లసితాంతరంగమున నుత్కటపీనఘటోధ్నులన్ సము
ద్యల్లలితైకవత్సల సమగ్రపయస్వల నన్యధేనులన్

గీ. బలివిభేది లక్ష్మిఁ బరిణయించినభంగి
నెల్లరెడ్డి ధారుణీశ్వరుండు
కలిమి పోచమాంబఁ గళ్యాణమై మించు
మహితభోగభాగ్యమహిమఁ దనరి.

ఈయెల్లారెడ్డి నామధేయులు భిన్నులని నిర్ణయించుట కింత కంటె నెక్కువ సాక్ష్య మక్కఱ లేదు.

పాఠకులసౌకర్యము కొఱకు కామినేనివారి వంశవృక్షమును పైని నిచ్చియున్నాఁడను. దీనికాధారము సూతసంహిత, బ్రహ్మోత్తరఖండము, షట్చక్రవర్తిచరిత్రము మొదలగు గ్రంథములు.

---

## 232 కామినేని మల్లారెడ్డి



ఇతనియొక్కయు, నీతనిపూర్వుల యొక్కయుఁ జరిత్రమును కామినేని ఎల్లారెడ్డికవి చరిత్రమునందు వ్రాసియున్నాఁడను. పునరుక్తి భయమున నావిషయముల నిట మరల వ్రాయలేదు. ఈకవిరచించిన గ్రంథములనుగూర్చి యిచ్చట వ్రాయుచున్నాఁడను.

ఈతఁడు రచించిన షట్చక్రవర్తిచరిత్రము శివధర్మోత్తరము, పద్మపురాణము ముద్రితములై మనకు లభించుచున్నవి. ఈమూఁడు గ్రంథములును సిద్ధరామేశ్వరస్వామికిఁ గృతియొసంగఁబడినవి. ఈ స్వామి బిక్కనవోలు పట్టణమునందు నెలకొనియున్నవాఁడు. ఈమూఁడింటిలో మొదట షట్చక్రవర్తిచరిత్రమును, పిదప శివధర్మోత్తరమును తుదిని పద్మపురాణమును రచియించినాఁడు. ఈమూఁడు గ్రంథములను రచించునాటికిఁ గవి కగ్రజులైన కామిరెడ్డియు, నెల్లారెడ్డియుఁ గూడ జీవించియుండిరి.

షట్చక్రవర్తిచరిత్రమునం దవతరణిక లేదు. ముద్రితులకది లభింపలేదు కాఁబోలు. షష్ఠ్యంతములు మొదలుగా ముద్రింపఁబడినది. శివధర్మోత్తరమునందుఁ దనగురు వైనలింగనారాధ్యుని, ఆతనిముప్వురు కుమారుల నీక్రిందిపద్యములోఁ గవి వర్ణించియున్నాఁడు.

సీ. మానితవరధరామరకులతిలకంబు
గౌతమగోత్రాబ్ధి కల్పశాఖ
మల్లికార్జునపండితోల్లసద్వంశ్యుండు
గౌరనారాధ్య శేఖరసుతుండు

శ్రీమల్లమాగర్భసింధుశీతకరుండు
　　గంగమాంబామనః కంజహేళి
సకలాగమజ్ఞానసాంద్రధౌరేయుండు
　　పరవాది దుర్మత భంజనుండు
తే. సంగగురు, దక్షిణామూర్తి సద్గురులను
గౌరనాహ్వయుదేశికుఁ గన్నతండ్రి
బ్రవిమలాస్మత్కులోద్భవారాధ్యుఁ బుణ్య
రమ్యగుణసాధ్యు లింగనారాధ్యుఁ దలఁతు.

చ. అనితరసాధ్యధర్మము సమగ్రవిభూతియు సర్వమంగళా
తనుతను వైభవంబు విబుధస్తవనీయ కుమార గౌరవం
బును దగఁగా నహీనగుణభూషణుఁడై ద్విజరాజమౌళి నా
నౌనరుచు లింగనాథగురుఁ డొప్పు సదాశివతుల్యమూర్తియై

ఈపద్యములలో నిరువురు గౌరనలున్నారు. ఇందెవరైన, హరిశ్చంద్రోపాఖ్యానమును ద్విపదగా రచియించిన గౌరనయై యుండునా యని చూడవలసియున్నది. ఈగౌరనలు ముప్వురును నారాధ్యబ్రాహ్మణులే. గౌతమగోత్రోద్భవులే. నిజాముదాష్ట్రనివాసులే. హరిశ్చంద్రోపాఖ్యానకర్త యగు గౌరనతండ్రి అయ్యలమంత్రి. తల్లిపోచాంబ. మల్లారెడ్డిగురుపుత్త్రుఁడైనగౌరనతలి గంగాంబ. తండ్రిలింగనారాధ్యుఁడు కావున నాగౌరనయు నీగౌరనయు నొకరు కారు. మల్లారెడ్డి గురువునకుజనకుఁడైనగౌరనతలిదండ్రు లెవరో మనకుఁ దెలియదు. మల్లారెడ్డి యాగౌరనను గవియని చెప్పలేదు. అందుచేత పైపద్యములోని మొదటిగౌరనయు, హరిశ్చందోపాఖ్యాన గౌరనయు నొకరగునో కాదో నిర్ణయింపఁజాలకున్నాము. ఈవిషయమింకను విచారణీయము.

మల్లారెడ్డి తన గ్రంథములయందుఁ గవిత్రయమును మాత్రమే స్తుతిచేసియున్నాఁడు. ఆపద్యముల నెండిఁటి నీక్రింద నిచ్చుచున్నాఁడను.

మ. ఒనరన్ నేర్చె సృజింపనాంధ్రకవితాప్రోద్యత్ప్రపంచం బొకం
డనువొందన్ సృజియింపఁ బ్రోవ నొకఁడత్యారూఢి నేర్చెన్ సృజిం
చను బోషింప గ్రహింప నేర్చె నొకఁ డిచ్ఛావృత్తిఁ దక్కంబొన
ర్చినమూర్తిత్రయమా కవిత్రయము పేర్మిం బ్రస్తుతిం జేసెదన్.
ఉ. ఎన్నఁగ బాదరాయణమునీంద్రవివర్ధితభారతేతిహా
సోన్నతకల్పభూరుహసముజ్జ్వలవాఙ్మయపుష్పసారముం
దిన్నఁగ నాంధ్రభాష నవనీస్థలిఁ దంగెటిజున్నొనర్చె నా
నన్నమనీషిఁ దిక్కమఖినాయకు నెఱ్ఱకవిం దలంచెదన్.

తనయన్నయగు కామిరెడ్డి యాస్థాన సభాసదులు శివధర్మోత్తరమును రచింపుమని తనను బ్రోత్సహించిన ట్లీక్రింది పద్యములలోఁ గవి చెప్పికొని యున్నాఁడు.

సీ. శంకరకవి సమంచద్భాతిరీతియు
గవిరాజ సత్కళా గౌరవంబు
శ్రీహర్ష సాత్త్విక స్థిరగుణ మహిమంబు
సుతధనంజయుని నిర్దోషతయును
శబ్దశాసన బహుచాతురీ వృత్తియు
సూరనార్యుని మహౌజానిరూఢి
యలవీరభద్రుని యారభటిధ్వని
యమరేశ్వరుని విభవానుభావ
తే. ములు విచిత్రంబులగుచు భాసిలె భవత్ప్ర
కల్పితోభయభాషాధిక ప్రబంధ
సంఘములయందుఁ గాచభూజానిమల్ల
రడ్డిసత్కవిరాజ సర్వజ్ఞభోజ.

ఈతనిగ్రంథములయందు రెడ్డిశబ్దమునకు బదులుగా 'రడ్డి' యని బహుళముగా నుపయోగించినాడు. పై పద్యములలో వర్ణింపఁబడిన శంకరకవి యెవ్వరో తెలియదు. హరిశ్చంద్రోపాఖ్యానమును రచించిన శంకరకవియని తోఁచుచున్నది. మల్లారెడ్డి షట్చక్రవర్తిచారిత్రమున హరిశ్చంద్రునికథలోఁ గొన్నిపద్యములయందు శంకరకవి ననుకరించి

యుండెను. శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తిగారు భారతి (16 సం. 2 భా. 665 పుట) లో శంకరకవి మల్లారెడ్డితో సమకాలికుఁడని వ్రాసియున్నారు. నేనాయభిప్రాయముతో నేకీభవింపఁజాలక శంకరకవి కాలము పదునాఱవశతాబ్ది పూర్వార్ధమని హేతుపూర్వకముగ వ్రాసియున్నాఁడను. కవిరాజు శ్రీనాథుఁడేమో! ధనంజయుఁడు సంస్కృతకవి యై యుండునని తోఁచుచున్నది. సూరనార్యుఁడు పింగళిసూరనార్యుఁడనియు, వీరభద్రుఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁ డనియుఁ దలంపవచ్చును.

సీ. మున్ను నీయన్న లబ్ధోన్నతస్థితిఁ గామి
రెడ్డివర్యుఁడు నెల్లరెడ్డిమౌళి
సూతసంహితయు నా యోకబ్రహ్మోత్తర
ఖండంబు లంది రఖండపటిమ
నంతట నెల్లభూకాంతుండు వాసిష్ఠ
లైంగధర్మము రామలింగమునకు
నంకితం బొనరించె నంతకన్నను మున్నె
నవరసాలంకారవివిధశబ్ద

తే. చాతురీధ్వని గుణపాకశయ్యలలర
వాసి కెక్కినషట్చక్రవర్తిసుకృతి
నర్థి శ్రీసిద్ధరామేశ్వరార్పణముగఁ
జేసినాఁడవు నిను నుతిఁ జేయవశమె.

ఈపద్యమునుబట్టి సూతసంహితయు, బ్రహ్మోత్తరఖండమును సోమనాథసోమయాజి రచించినపిమ్మట మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రమును రచించెననియు, పిమ్మట నెల్లారెడ్డి వాసిష్ఠలైంగధర్మమును రచించి, రామేశ్వరున కంకితము చేసెననియు, నటుపిమ్మట మల్లారెడ్డి శివధర్మోత్తరమును దరువాత పద్మపురాణమును విరచించెననియు స్పష్టమగుచున్నది. అందుచేతనే సూతసంహితలోగాని, బ్రహ్మోత్తరఖండములోగాని ఎల్లారెడ్డి మల్లారెడ్డిప్రభువులు రచించిన గ్రంథముల మాటలేకపోయినది. ఎల్లారెడ్డి రచించినది 'వాసిష్ఠలైంగధర్మము' అను

నొకగ్రంథమా! లేక వాసిష్ఠరామాయణము లింగపురాణము నను రెండుగ్రంథములా? యని సంశయము కలుగుచున్నది. వసిష్ఠునిచే జెప్పఁబడిన రామాయణమును వాసిష్ఠరామాయణ మనినట్లే వసిష్ఠునిచేఁ జెప్పఁబడిన లింగసంబంధమైన ధర్మములను దెల్పుగ్రంథమునకు వాసిష్ఠలైంగధర్మమని నుడివియుండెనని యనుకొనుచున్నాఁడను. ఒకానొక లాక్షణికుఁడు లక్ష్యము నిచ్చుటలో "వాసిష్ఠలైంగ్యే" అనివ్రాసి

క. శ్లేషకవి వీవుభాషా
శేషాహివి నీవు చంద్రశేఖరపూజా
భూషణుఁడ వీవు కవుల
న్పోషించిన సవతు నీకు నేరి ధాత్రిన్.

మ. శివసంభాషితసంస్కృతోజ్జ్వలవచః శ్రీగంధసందర్భమా
శివధర్మోత్తర మాంధ్రకావ్యముగ వైచిత్రిం బ్రసంగించి నాఁ
డవు మాయన్నకుఁ గామిరెడ్డికిని వేడ్కన్ మీఱఁగా నంకితం
బవున ట్లిప్పుడు సిద్ధరాజుపతికుద్యద్భంగినర్పింపుమా.

ఈమల్లారెడ్డికవి చాల గ్రంథములు రచియించెనందురు గాని యందు మూఁడుమాత్రమే యిప్పుడు లభించుచున్నవి. తక్కినవాని పేరులైనను దెలియలేదు. అందు:—

౧. షట్చక్రవర్తిచరిత్రము:— "హరిశ్చంద్రనలో రాజా పురుకుత్సః పురూరవః సగరః కార్తవీర్యశ్చ" అను నీయార్గురు చక్రవర్తుల చరిత్రములను నాఱాశ్వాసములలో క్లుప్తముగా వర్ణింపబడినవి. ఇందు హరిశ్చంద్రుని సత్యవ్రతకథయు, నలదమయంతుల పరిణయకథయుఁ గొంచెము విపులముగా నున్నవి. నలుని యరణ్యవాసాది యుత్తరకథ నిందుఁ జెప్పలేదు.

౨. శివధర్మోత్తరము:— షడక్షరీమాహాత్మ్యము, శివలింగార్చనావిధము శివప్రభావమును దెలుపుకథలును, రాజధర్మము, మానవధర్మము మొదలుగా ధర్మశాస్త్రవిషయములును, నెనిమిదాశ్వాసములలోఁ జెప్పఁబడినది. శివధర్మోత్తర మనునీపురాణమును గుమారస్వామి అగస్త్యమహర్షికిఁ జెప్పిన ట్లిందుఁ గలదు.

౩. పద్మపురాణము:— సంస్కృతమున నున్న పద్మపురాణమందలి యొక భాగమున కిది యాంధ్రీకరణము. ఇందీశ్వరుఁడు శంభుభట్టారకుఁడను విప్రవేషమును బూని యయోధ్యకువచ్చి శ్రీరామచంద్రునకుఁ బురాణములను వినిపించినకథ వర్ణిత మైనది. పురాణపఠనా విధానమును దత్ఫలమును, శివప్రభావమును దెలుపు కథోపకథలిందుఁ గలవు. ఈపద్మపురాణమును మల్లారెడ్డిచే రచింపఁజేయుమని గణేశకవి, కామిరెడ్డితోఁ జెప్పిన ట్లీక్రిందిపద్యములలో నున్నది. ఈ పద్యములలో గణేశకవియొక్కయు, మల్లారెడ్డియొక్కయు సామర్థ్యాదులు తెలుపఁబడియున్నందున నాయెనిమిది పద్యంబుల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

ఒకనాఁడు కామిరెడ్డి "ఎల్లరెడ్డినృపాలాగ్రగణ్యుఁడును మల్లిఖార్జుననామధేయుండు (మల్లారెడ్డి) నను సోదరులు మనోమోదంబుఁ గలిగింపఁ బద్మపురాణోపరిభాగ ప్రసిద్ధశివరాఘవ కథాశ్రవణహృదయుండైయుండి యాసమయంబున

ఉ. ధీనిధి సాహితీయుతుఁ బ్రతీతయశుం గుతుపావనీశ్వరా
స్థానమహాకవీంద్రు నిజవర్ణనకౌతుకవైభవాగతున్
శ్రీనరసింహపండితవరేణ్యకుమారు గణేశధీరు స
న్మానముతో నెదుర్కొని నమస్కృతిఁ జేసి వసింపఁ జేయుచున్.

వ. ఆతనిగుఱించి

ఉ. నీవు జగత్ప్రసిద్ధుఁడవు నిండుమతిం బరవాక్యమానవి
ద్యావిదు లారసజ్ఞమణు లౌనని మెచ్చఁగ సంస్కృతాంధ్రభా
షావరకావ్యకల్పనవిచక్షణతన్ గణనాథసత్కవీ!
దేవగవీపయోఘురసదృగ్వచనాప్తయశోహరచ్ఛవీ!

చ. సకలపురాణముల్ తెనుఁగుసత్కవు లాదిలొనర్చి రెవ్వరుం
బ్రకటితశంభువైభవము పద్మమునన్ శివరాఘవానులా

పకథ యొనర్చ్పరెరి ప్రతిభాగుణభాసురభాగ్యశాలి యే
సుకవిసమర్థుఁడో తెలిసిచూడుఁ డొనర్ప శివాంకితంబుగన్.

కం. అని తను నడిగినగిరిజా
తనయుఁడు గణనాథసుకవితాదృశుఁ డిలశీ
తనగమలయాంతరాళా
ధునికకవిప్రతతి నొకఁడుఁ దోపకయున్నన్

మ. మది నెంతేఁ బరికించి కించిదుదయన్మందస్మితాస్యంబుతో
నెదుటన్ న న్నని చూపుచుం బలికెనయ్యిందోప్రమంగూర్చి శ్రీ
మదుమాకాంతకృపాలతాఫలితసామ్రాజ్యోదయాయోనయా
హృదయా చౌదరిసార్వభౌమ వినుమా యే ని కెతింగించెదన్.

ఉ. కుంభినియందు నాంధ్రమును గొందఱు గొందఱు సంస్కృతంబు ను
జ్జృంభితశక్తియుక్తులను జెప్పఁగ నేర్తురు గాని రెంటికిన్
శంభుకృపన్ విచక్షణుఁడు శక్తుఁడు మల్లవిభుండు తత్పురా
ణాంచితశబ్దముల్ సరవియోజనజేసి రచింప నేర్చునన్.

చ. చొటచొట తేనియల్ వడయుసూక్తులు ప్రాక్తనజన్మపుణ్యసం
ఘటితములై కవీంద్రుల కఖండముదంబు హృదంబుజంబునం
ఘటమగఁజేయఁ గ్రమరసపూరము కామహితప్రబంధముల్
పటుమతి సల్పఁగాఁ దగినప్రాజ్ఞుఁడు మల్లనృపాలుఁ డెంతయున్.

ఉ. కావున నీసహోదరుఁడు కాచయమల్లనరేంద్రుఁ డీతఁడా
పావనపద్మమం దుపరిభాగమునన్ శివరాఘవోత్తమ
శ్రీవిలసత్కథం దెలుఁగుసేయ సమర్థుఁ డటంచుఁ దెల్పి ప్ర
జ్ఞావిభవాన్వితుండు గణనాథకవీంద్రుఁడు నన్నుఁ గాంచుచున్.

ఈపద్యములలో వర్ణింపఁబడిన గణేశకవీంద్రుఁ డెవ్వరో ఏగ్రంథములను రచించెనో తెలియదు. ఇతఁడు సంస్కృతమునను నాంధ్రమునను గూడఁ గావ్యములను రచించినట్లు కన్పట్టుచున్నది. ఈకవి "కుతుపావనీశ్వరాస్థానమహాకవీంద్రుఁ" డైనట్లు చెప్పియున్నాఁడు. ఈకుతు

టీషా క్రీ.శ. ౧౫౫౦ మొదలు ౧౫౮౦ వఱకు గోలకొండరాజ్యమును బరిపాలించి, అద్దంకి గంగాధరకవి, పొన్నిగంటి తెలగన్న మొదలగు వులను బోషించి, తపతీసంవరణోపాఖ్యానమును గృతినంది మల్కిభ రామని గ్రంథకర్తలచేఁ బేర్కొనఁబడిన ఇబ్రహీం కుతుబ్షాహాయే. పద్మపురాణమును రచించునాటికి ఇబ్రహీం కుతుబ్షాహా లేఁడనియు, నప్పటి కాతనికుమారుఁడైన మహమ్మద్ కులీకుతుబ్షా రాజ్యముచేయు చుండెననియుఁ దోచుచున్నది. గణేశకవి యీతనియాస్థానమునఁ గూడ నుండియుండవచ్చును. లేదా ఇబ్రహీంకుతుబ్షాహా యాస్థాన కవియను నర్థముతోడనే యీవాక్యము నుదాహరించి యుండవచ్చును. ఎల్లారెడ్డియు మల్లారెడ్డియు సంస్కృతపద్మపురాణము నగ్రజునకుఁ జదివి వినిపించుచుండి రమటవలన నీప్రభువులు పండితు లైనట్లు తెల్ల మగుచున్నది. మల్లారెడ్డి యుభయభాషాపండితుఁడై కవియై కవిపోష కుఁడై కీర్తిని గాంచియున్నాఁడు.

ఈతనికవిత్వము ప్రౌఢమై సలక్షణమై యనర్గళధారకలిగి కదళీ పాకమున రమణీయముగా నున్నది. శైలితెలియుటకై యీతనిమూఁడు గ్రంథములనుండియుఁ బద్యముల నుదాహరించుచున్నాఁడను. ఈకవి కాలము వంశచారిత్రమును, ఎల్లారెడ్డిచరిత్రమునఁ జూడనగును.

షట్చక్రవర్తిచరిత్రము:—

ఉ. తోరణగండ్ల కన్నుముల చొప్పుల నొయ్యన దూరి తావిచొ
క్కారసి చల్లి తత్పరిని యామినుల న్సరతాంతకాంత కాం
తారుచిరాంగఘర్మకణనవ్యవిచిత్రమణుల్ హరించుచుం
జోరులకైవడి న్మెలఁగుఁ జోద్యముగా మలయానిలౌఘముల్ ౧౮

ఉ. ఓయివసిష్ఠ! వల్వనిదురుక్తులు పూని సుధర్మనాథుఁగా
నాయమెనీకు? సర్వభువనంబులులోనుగ సంచరించుచుం
బాయకభూమిభృత్తతులపద్ధతు లెల్లనెఱింగినట్టివా
చ్యాయనవాలఖిల్యహరితాదిమునుల్ ఘను లూరకుండినన్ ౨౮

ఉ. భానుకులుండ నే భువనపాలనశాలిఁ ద్రిశంకుపుత్త్రుఁడన్
నే నిలయెల్ల మాని కిడి నిల్వక మత్సతి నమ్మఁజూపినా
నో నరులార! వచ్చి కొనరో ఘనులార యటంచు జిహ్వ పెం
పూనఁగఁ బల్కెఁ దైన్యరస ముట్టిపడన్ బురివాడవాడలన్ ౩౯

చ. కళలు పదారు నీ కజుఁడు కట్టడచేసి నిశాచరుండు గాఁ
గలఁ డని చూచి వానికిని గార్శ్యము సంఘటియించి పూర్తిగా
నెలకొకనాఁడు నిల్పె నటు నిల్పినయంత వియోగినీవ్యథ
ల్సలుపఁ గడంగినాఁడ వవి సంతతముంప జగంబుముంపవే ౪౯

శా. దీపంబుల్ తెలిచాయఁ బాఱె మఱి ప్రాగ్దేశంబు కెంపెక్కెనో
భూపాలాధిప! మేలుకొమ్మనుచు నేర్పుల్మీఱఁగాఁ బాఠకు
ల్భూపాలాదిదినాదిరాగముల నింపుల్ మింపగాఁ బాడ నీ
క్ష్మాపశ్రేష్ఠుఁడు లేచి తీర్చె శుచియై కాలోచితప్రక్రియల్ ౫౯

ఉ. దేహపటుత్వసంపదలు దేవుఁ డెఱుంగు నొయార మంటిమా
యూహ యొనర్పరాదు మొగమొప్పు దలంచినచో నమూల్య మా
హావుల చెల్వ మింత యని పల్కఁగ శక్యమె ధాత్రిమీఁదటన్
ద్రోహముగాదె యా చెలికిఁ దుల్యముగాఁ బరకాంత నెంచినన్ ౬౯

శా. దేవా మత్ప్రపితామహుల్ సగరధాత్రీనాథు సత్పుత్రకుల్
దేవాధీశపురంబు చేరుటకు నర్థిం గాథభంగార్భటుల్
ద్యావాభూమ్యుదరంబు నిండ ధృతిచేతన్ వచ్చు నవ్వాహినిం
బ్రావీణ్యంబునఁ దాల్పఁగావలయు భర్గా రాజచూడామణీ ౭౯

ఉ. ఇంటికి వచ్చినట్టి హృదయేశ్వరుచిహ్నము చూచి లేచి న
న్నంటకు మంచుఁ దిట్టి కలహాంతరితాకృతిఁ దాల్చి పొమ్మనన్
గెంటి యతండు పోవఁ దమకించుచు నుండిన నూరడింపఁగాఁ
గంటికి నిద్ర రాక యొకకామిని యుండెఁ బ్రకృష్టవేదనన్ ౮

శివధర్మోత్తరము:—

క. రాజే వర్మముఁ బూనిన
భూజనములు నట్ల నడువఁబూనుదురు యథా
రాజా తథా ప్రజా యను
ధీజనవాక్యములు జగతిఁ దేటపడంగన్ ౧ఆ

తే. శైవవిద్యారహస్యంబు సాంతముగను
దెలియ కెవఁడైన గురుఁడుప దేశమిడిన
యట్టియజ్ఞాని పాపాత్ముఁ డరయఁ బుణ్య
గతికిఁ బెడఁబాసియల యధోగతికి నరుగు ౨ఆ

చ. నదులు తటాకసీమలు వనంబులు నన్నియు సర్వదేవతా
సదనతలంబు గోష్ఠమును శైలతటంబు కుశస్థలంబులున్
మొదలగు పుణ్యభూములను మూత్రపురీషము లుల్లసిల్లుచున్
వదలెడు దుష్టమానవు లవశ్యమధోగతిఁ గాంతు రెంతయున్ ౩ఆ

సీ. కులకాంత ఋతువేళఁ గూడని గృహమేధి
వీర్యంబు లడఁపక విడుచుయతియు
బ్రహ్మచర్యము గుంటుపఱచుమాణవకుండు
పాటిదప్పినధరాపాలకుండు
ధవుఁడు చెప్పినమాటదాటుచుండువధూటి
యాచారవిరహితుండైనద్విజుఁడు
దీక్షావిధికిఁబాసిదీక్షనిచ్చుగురుండు
ప్రచ్ఛన్నముగఁ బొంకిపడయువనిత

తే. స్వామికార్యంబుఁ జెఱచినసచివవరుఁడు
విభుని రణభూమి దిగనాడి వెడలుభటుఁడు
వీరురౌరవముల నుండువారుసూవె
కాలుబాధలు నాబ్రహ్మకల్పమనఘ ౪ఆ

క. ఒరుయొద్దకేఁగి హైన్యక్షితు
పరికింపఁగ వేఁడి కొంచెపడియొడుకన్నన్

మరణంబుత్కృష్టంబని
యరయఁగవల దేశరీరియఖిలవిధములన్ ౫౯

శా. యుక్తాహారవిహారుఁడై స్వహితకర్మోపేతుడై యోగ్యుఁడై
యుక్తాపాదితనిద్రుఁడై సమయసంయుక్తప్రమోదాత్ముఁడై
యుక్తాభావవివర్జితాత్మకుఁడునై యుక్తక్షమాశాలియై
యుక్తాయుక్తములెంచి శ్రద్ధపటిమన్ యోగీంద్రుఁడుండందగున్ ౬౯

తే. దేవకార్యోపయోగ్యముల్ దినదినంబు
కరముచక్కఁగ నుదుకకావుశుద్ధి
యితరమైనట్టి వస్త్రంబులెవ్వడుమాయు
నవుడ యుతికింపవలయు శుద్ధ్యర్థమనఘ ౭౯

తే. బ్రాహ్మణుఁడుపూని దానంబుఁ బట్టియైనఁ
దెచ్చిమేఁతయుఁ దోయంబులిచ్చి దినము
నొక్కధేనువుఁ బోషించుచుండెనేని
నతఁడు శివలోకవాసియై యతిశయిల్లు ౮౯

పద్మపురాణము:—

చ. అతిహితమైన సత్యహితమైన నిజేచ్ఛఁబురాణపుస్తక
స్థితమును డాఁచియన్యము వచింపఁగరాదటు దైవలబ్ధమే
గతిమఱలింపవచ్చు నతిగాఢము దైవబలంబు దానుప
శ్రుతి యొడదాఁచి తెల్పెడు ద్విజుండపరాధముఁజెందు నెయ్యెడన్ ౧౯

చ. అనవిని రాఘవుండు సకలార్థనిధీ! మునుచిత్రగుప్తుచే
తనరులపాలపట్టికలఁ దథ్యముగాలిఖియింపఁబడ్డయ
ట్టినిరయమెట్టుదప్పును? ఘటిల్లెడువారల కెల్లగా శివా
ర్చనమున దోషనాశమును సత్యముగాన నశంభుఁడిట్లనున్ ౨౯

ఉ. ఎంతకృతార్థుఁ డీకపికులేంద్రుఁడు చంద్రకిరీట వేదవే
దాంత నితాంతదాంత చటులామర సంతతికైనఁ జెందన
త్యంతమశక్యమైన భవదంఘ్రియుగం బఖిలాంగసీమ వి
శ్రాంతివహించె నీఘనుని సాటి యిఁకెవ్వరజాండ మండలిన్ ౩౯

ఉ. పాత్రివు గౌతమీతటిని బాత్రిత( జేరి పవిత్రిపాణియై
గోత్రిపతింబ్రితిచ్ఛలిక( గుంకుమచిత్రికమర్కు(గూర్చియ
ష్టర్త్రయమిచ్చి విష్ణుమయగాత్రి( ద్రయీజనయిత్రి దేవిగా
యత్రిజపించిచేసె నుతులాత్మపురోధకు శంభుమానికిన్ ౨౯

మ. అటులైనన్ రవిజుండు వధ్యు(డకదా యవ్వాలి మున్వీక్రిమో
ద్భటు(డౌ దుందుభిదైత్యు భూధరగుహాంతర్దేశముం జొచ్చిగె
ల్పుటకైయుండ(గజూచి భానుసుతుడాలో నన్నురాజ్యంబును
త్కటరాగాంధతమై హరించెనితనిన్ దండింప(గా(జెల్లదే ౫౯

ఈకవి తనగ్రింథములను క్రీ.శ. ౧౫౮౦-౧౬౦౦ సంవత్సరము మధ్యరచించియున్నట్లు గన్పట్టుచున్నది పట్టమట్ట సోమనాథసోమయాజి సూతసంహితను రచించునాటికి మల్లారెడ్డి కిరువురు తనయు లున్నట్లీ క్రిందిపద్యములో వర్ణించియుండుటచే, మల్లారెడ్డి క్రీ.శ. ౧౫౨౦ సంవత్సరప్రాంతమున జన్మించియుండునని తలంపవచ్చును.

శా. మల్లారెడ్డివసుంధరాధిపతి శ్రీమల్లాంబయందున్ సుధీ
వాల్లభ్యాధికయోగ్యలక్షణకళావర్ధిష్ణు రామేశు ని
త్యోల్లాసప్రిదు( జంద్రిశేఖరసమాఖ్యున్ గాంచి చెన్నందు జా
బిల్లిం గల్పమహీజముం గనినయబ్ధిం బోలి యుప్పొంగుచున్.

ఈమల్లారెడ్డి యింకను మఱికొన్నికృతులనురచించినట్లు చెప్పుదురు కాని వానివివరములేమియు( దెలియవు.

—

## 233 పొన్నిగంటి తెలగనార్యుఁడు.



ఈకవి యయాతిచరిత్ర మను నైదాశ్వాసముల యచ్చతెలుఁగు ప్రబంధమును రచియించి, గోలకొండప్రభు వగుమల్కిబరామ్ కుతుబ్ శాహా యొద్ద నుద్యోగిగా నున్న యమీనుఖానునకుఁ గృతి యొసంగెను.

ఈకవి యాశ్వాసాంతగద్యములో నిట్లు వ్రాసికొనినాఁడు. "ఇది శ్రీమదనగోపాలమంత్రిప్రసాదలబ్ధసారస్వత సుకవిజనవర్ణనీయ వచోవిభవ భావనామాత్యతనూభవ పొన్నికంటివంశ్య తెలగనార్య ప్రణీతం బైన యచ్చతెనుఁగుకబ్బంబు"

తండ్రి కమాత్యశబ్దమును జేర్చుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డనుట నిశ్చయము. కవిచరిత్రకారులును గొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు నట్లె వ్రాసియున్నారు. మహమ్మదీయులకుఁ గృతు లొసంగిన యాంధ్రకవు లిరువురిలో నీతఁ డొకఁడు. అద్దంకి గంగాధర కవి వేఱొకఁడు. గంగాధరకవిచేఁ దపతీసంవరణోపాఖ్యానమును గృతినందిన మల్కిభరామ్ అనువాతఁడే, యీయయాతిచరిత్రమును గృతినందిన యమీన్ ఖానునకుఁ బ్రభువు. గంగాధరకవియుఁ దెలగనార్యుఁడును సమకాలికు లనిచెప్పవచ్చును. మల్కిభరామును జరిత్రకారులు ఇబ్రహీమ్ కుతుబ్ షాహా యని వ్రాయుచుందురు. గోలకొండ రాజ్యమును బరిపాలించిన కుతుబుషా వంశీయులలో నీతఁడు మూఁడవవాఁడు. ఇతఁడు క్రీ.శ. 1550 మొదలు 1580 వఱకు గోలకొండకు బరిపాలకుఁడుగా నుండెను. ఇతనియొద్ద నుద్యోగిగానున్న అమీనుఖానును నతనికిఁ గృతినిచ్చిన తెలగన్నకవియు నాకాలమున నున్నవారని నిశ్చయింపవచ్చును.

తెలగనార్యుఁ డచ్చతెలుఁగుప్రబంధములను రచించినవారిలో మొదటివాఁడు. ఈగ్రంథమునఁ బేరులను, బిరుదులును దప్పతక్కినశబ్ద

ములలో సంస్కృతశబ్దము లుండవని కవి యీక్రిందిపద్యములోఁ జెప్పి యున్నాఁడు.

క. తెనుఁగునను మాటలుపేర్కొడి
పెనచిన వినఁగూడ దనుచు బిరుదులు పేర్కొన్
మును వేల్పుబాస వెంబడి
నుని చెదఁ గాదనకుఁడయ్య యుల్లములందున్.

ఈకవికిఁ దఱువాత నచ్చతెలుగుపొత్తములను రచించిన కూచిమంచి తిమ్మకవి తనయచ్చతెనుఁగు రామాయణములో—

తే. ఒనరఁ బేరులు బిరుదలుఁ దెనుఁగు సేయఁ
బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావున గూరుపు మిదియు నన్ను

అని వ్రాసియున్నాఁడు. అచ్చతెలుఁగునఁ గావ్యమును వ్రాయుట కిదియే ప్రథమమైనను, కవి యీగ్రంథమును జక్కనిపదములకూర్పుతో మనోహరముగ రచించియున్నాఁడు. కూచిమంచి తిమ్మకవి యచ్చతెలుఁగు రామాయణముకంటె నీయయాతిచరిత్రమే మేలుగా నున్నదని బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు వ్రాసియున్నారు.

అమీనుఖాను తన కీగ్రంథమును గృతియిప్పింపు మని మఱింగంటి యప్పలాచార్యపండితునకు సూచింప నాతఁ డీకవి నందులకుఁ బ్రోత్సహించెనని యీక్రిందిరెండుపద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈయప్పలాచార్యుఁ డాకాలమున అశ్వపతి, గజపతి, నరపతులు మువ్వురిచేతను మ్రొక్కలను గొనుచు మహోన్నతపదవియం దుండె నని వారణాశి అచ్యుతరామకవి విరచిత సురతాణీపరిణయమునందును మఱింగంటివారి గ్రంథములయందును జెప్పఁబడియున్నది. ఈతఁడు మఱింగంటి సింగరాచార్యకవి కగ్రజుఁడు.

మ. తనకు న్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవారఁగాఁ జల్లచూ
పున నెల్లప్పుడుఁ జూచి మన్నఁగలపెంపొప్పెడ నమ్మఱింగంటియ
ప్పనగారి న్మదిలోనిమాట దెలియం బాటింపుచుం గాంచినన్
గని యామేటి తలంపెఱింగి పొసగంగా నన్ను మన్నింపుచున్

ఆ. పిలిచి పొన్నికంటితెలగన్న నీచేయు
నచ్చతెనుఁగుఁగబ్బ మన్నియెడల
మించి వెలయఁగా నమీనుఖానున కిచ్చి
పుడమిలోన సిరులఁ బొగడఁ గనుమ.

అచ్చతెలుఁగుగ్రంథమును వ్రాయుటలోఁ గలఘనత నీక్రింది రెండుపద్యములలో నప్పలాచార్యపండితుఁ డిట్లనుడివెనని కవి వ్రాసి కొనియున్నాఁడు.

క. మున్నెవ్వరు నుడువని
తెన్నిది కడమీఱి యచ్చతెనుగుం గబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలఁడె నెలతాల్పైనన్.

ఉ. అచ్చతెనుంగుపద్దె మొకటైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నుడువ నంకలిచంద వెలుంగువారు నిన్
మెచ్చరొ యబ్బురంబనరొ మేలనరో కొనియాడరో వినన్.

ఈగ్రంథమునఁ జంద్రవంశ్యుం డగు యయాతిమహారాజు శుక్రాచార్యునితనయ యగుదేవయానను బరిణయమైనకథ వర్ణింపఁబడినది. శుక్రాచార్యులు యయాతి కొసంగినశాపవృత్తాంతమును దద నంతరకథయు నిందుఁ జెప్పఁబడలేదు.

కృతిపతి యైనయమీనుఖాను అమీనుపురములో నొకచెఱువు త్రవ్వించినట్లును, సత్యచింతామణిపొల్లచెర్లలో నొకమసీదును గట్టించి నట్లును నీక్రిందిపద్యములవలనఁ దెలియవగును.

సీ. దురములో వేటారుతునుకలుగా వ్రేయు
నట్టిరౌతుల కెల్ల నాటపట్టు
తొడరి బెబ్బులి నైనఁ బెడకేలఁ బడఁద్రోయు
పూఁపుగల్గినబంట్ల పుట్టినిల్లు
వట్టిమ్రాఁకుల నిగుర్పొట్టెడుపాటలఁ
బాటిల్లు గాణలపట్టుఁగొమ్మ

పుట్టఁబుట్టినప్రౌఢ పొల్పునఁ జెప్పఁగాఁ
  గలుగుజాణలమొత్తములకు నెలవు
తే. నైన తనపేరఁ గల్గు నమీనుపురము
నందు మున్నీటిజోక చేయంగఁజాలు
చెఱువు త్రవ్వించె మిగుల నచ్చెరువు గాఁగ
నిండువేడ్క నమీనుఖానుండు మెఱసి.

ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కాసలనాఁట సత్యచిం
తామణి పొట్లచెర్లను సతంబగుచుండ నమీనుఖానుఁ డిం
పామతిలంగ నిల్పఁ బొడవై పెడఁగైనమసీదుఁ గాంచియం
ద్రేమను వెండికొండపయికేఁగ దలంపక జేసికంటియున్.

ఈయమీనుపురము, పొట్లచెర్లగ్రామములు గుంటూరు మండలములోనివి. యయాతిచరిత్రమును గృతినందునాఁటి కమీనుఖానుని కుమారులు పెద్దవారై తండ్రికి రాజ్యకార్యములలో సాహాయ్య మొనర్చుచు, ఇభరామ్‌కుతుబ్‌శాహి యొద్ద నుద్యోగములో నున్నట్లు కవి వారిని నుతించియున్నందున నప్పటికిఁ గృతిపతి డెబ్బదిసంవత్సరముల వయసు గలవాఁడని యూహింపఁదగియున్నది. ఆకుమారులనువర్ణించిన పద్యములలోఁ జారిత్రాంశము లున్నందునను, నప్పటి దేశకాలపరిస్థితులు తెలియుననునుద్దేశముతోడను, గ్రంథవిస్తరభీతియున్నను నాపద్యముల నీక్రిందవ్రాయుచున్నాఁడను. అమీనుఖాను కుమారులనామములు, గతాతఖాను, పాజిలుఖాను, అబ్దులుఅల్లీ, మేకిభరాము, అబ్దులకరీము అనునవి.

సీ. నెఱపల్కు నెఱవుల నే చాల మెప్పించి
  యక్బరుచే మెప్పు లందుకొనియొఁ
జని విశ్వనాథదేవుని చేత మస్తున
  వెలయు నేన్గులఁ దెచ్చె వేనవేలు
పూనికి నేదులాఖానువీటికి నేఁగి
  పలుమఱు మించుకష్టములు గొనియె

మాదనమల్కబరీదు నిజాంశాహుఁ
దనయేలికకుఁ బన్నుఁ బనుప నడఁచె
తే. మఱియు కన్నడరాజులు మెఱసి పొగడి
నెనరు దళుకొత్తఁ గ్రొత్తకానుకలు పనుప
మనిచె మల్కిభరాముమన్ననఁ గతాత
ఖానరాయఁడు రెండవకలువకేఁడు.
సీ. తలిదండ్రు లేమాట తన కానతిచ్చినఁ
దలమోచినడుచుఁ గతాతఖానుఁ
డిభరాముపాదుషా యేలెడుపుడమిలోఁ
దగవులరాజు గత్రాతఖానుఁ
డలచిన్నిపాయమునందు రాజులచేతఁ
దగునిమ్మపండు గతాతఖానుఁ
డేప్రొద్దుఁ గూరిమి హెచ్చఁ గర్తారునిఁ
దలఁపులో నిలువు గతాతఖానుఁ
తే. డరబి పారసి గుజరాతి యారె మచ్చ
తెనుఁగు కన్నోజి మొదలుగాఁ దెలిసి వ్రాయ
దారిగన్నట్టివాడు గతాతఖానుఁ
డహహ యతనికి నెవ్వరీ డరసిచూడ.
చ. కని తనరాజులెన్నుకొనఁగాఁ బెనుపోఁజులతో సిరంగరా
యనికడకేఁగి మాటలనె యాయనఁ దేఱిచి తెచ్చి మల్కుడున్
మనుకువ నంటిచేసి యొరిమం గడుమెచ్చులు గొన్నమేటి నే
మని పొగడంగవచ్చు నవు నౌనిఁక ఫాజిలుఖానరాయనిన్
సీ. మదిలోఁగి యన నిజామనమల్క పెట్టిన
పల్లకీ లొకవంక బాగుమీఱ
నుదిరి యేదులఖానుఁ డొసఁగిన పైగోవ
గుఱ్ఱముల్ బడివాఁగె గొల్చిరాఁగ
వేడుకతో నేడుమాజెలదొరలు కా
నుక లంపినట్టియేనుగులు బెరయ

కన్నడరాయఁడు మన్నించియంపిన
ముత్తేలపెట్టెలు హత్తిమెరయ
తే. నచ్చితెచ్చినసొమ్ములు మచ్చికలర
నిచ్చి యిభరామశౌహుచే మెచ్చుగనియె
నట్టిఫాజిలుఖానరాయనికి సాటి
గలరె నేర్పరు లెల్లజగంబులందు
సీ. తే. సొనరు నిభరామపాదుశా హుజూరునందు
బొందుగా వ్రాయ నేర్చినప్రోడ యైన
యబ్దులల్లీకి నీడెవ్వఁ డరసిచూడ
నహహ గోనములతనికి నతఁడె తగును.
క. అరబీ పారసి కన్నడ
మురుమీ కన్నోజి తెనుఁగు మొదలగుబాసల్
పరికించి కుతుబుశా తలఁ
పరయుచుఁ బొలుపొందు నబ్దులల్లీ పుడమిన్
తే. మించి యిభరామశౌహు మెప్పించి మేలు
తగటు దట్టీలు ఖాయీలు పొగరు మిగులు
గుఱ్ఱములు నందలమ్ములు గొడుగుఁ గాంచి
కలిమి పొగడొందెఁ బుడమి నబ్దులకరీము.
ఉ. ఇట్టి కొమాళ్లు రాసిరుల హెచ్చుగమించినప్రోడ యెలికై
పట్టపుఠేండ్లమొక్కఁ గని పాటిలు నాయిభరామశౌహుచే
పట్టి యనుంగుగా నడుపఁబొయక మూఁడుతరాలనుండి క
న్పట్టునమీను ఖానుఁడు దపంబుఃమించె నసంబు కల్మిచేన్.

పైపద్యములలో ఫాజిలుఖానుచే రాయబారమునకుఁ గొనిరాఁబడిన శ్రీరంగరాయలు అళియరామరాజునకుఁ దమ్ముఁడును వసుచరిత్ర కృతిపతియు నగుతిరుమలరాయనికిఁ గుమారుఁడై క్రీ. శ. 1574 మొదలు 1586 వఱకుఁ గర్ణాటరాజ్యమును బరిపాలించిన శ్రీరంగరాయలై యుండెను. ఆతనితో జరిగిన రాయబారవృత్తాంతము నిందు వ్రాసియుండుటచేఁ దెలగనార్యుఁడు యయాతిచారిత్రమును క్రీ. శ. 1580 సంవత్సరప్రాంతమున రచించియుండవచ్చునని తలంపవలసియున్నది.

ఈక్రింద చెప్పఁబడిన శాసనపద్యమువలన, నమీనుఖాను క్రీ. శ. 1592 వ సంవత్సరమువఱకు జీవించియున్నట్లు తెలియును. ఈపద్యము గుంటూరుమండలములోని సత్తెనపల్లితాలూకా అమీనుబాదా గ్రామమందు మూలాంకూరమ్మగుడి తూర్పుద్వారము కుడిప్రక్కను జెక్కఁబడియున్న శాసనములో నిమిడియున్నది. ఇది గోలకొండప్రభు వగు ఇభరాంషాదుషా సేనానాయకుఁడైనఅమీనుమల్కు శ. స. 1514 కు సరియైన నందన సం. వైశాఖ శు 3 గురువారమునాఁడు చెక్కించిన ప్రతాపధర్మశాసనమని యున్నది. ఇభరామ్‌షాదుషా కొండవీడురాజ్యమును సంపాదించినవిషయ మీపద్యములో నున్నది.

"మొదలను శాలివాహనశకవర్షంబులు 1502 అగు నేఁడు విక్రమసంవత్సర చైత్ర బ 14 ఖామవారంనాఁడు హజరత్ యిభరాహింషాదుశహావొడయలుంగారు తమనామజాదు అంపితేను.

ఉ. ధాటిగ నేగి పుద్దగిరి దార్కొని వెంకటరాజుఁ దోలి ముం
గోటలు లగ్గపట్టి వినుకొండయు బెల్లముకొండ తంగెడల్
పాటపరిక్ష హరించి మరిబల్మిని గైకొనె కొండవీడు క
ర్ణాటకరాజధాని యిభరాముఁడు బాహుబలంబు మీరుచున్.

ఈలాగు ప్రతాపాన కొండవీటిరాజ్యం పుచ్చుకొని రాజ్యం పరిపాలిస్తున్న వుండెను."

దీనినిబట్టి ఇభరామ్‌కుతుబ్‌షా కొండవీడును క్రి శ. 1580 సంవత్సరములో జయించినట్లును, అమీనుఖాను క్రీ. శ. 1592 వ సంవత్సరమున జీవించియుండె ననియు స్పష్టమగుచున్నది. ఇభరామ్‌షాదుషా క్రీ. శ. 1592. వఱకునుగూడ జీవించియుండెనేమో యనుసంశయము కలుగుచున్నది కాని, చరిత్రకారులు క్రీ. శ. 1580 మొదలు ఇభరామ్‌కుమారుఁడైనమహమ్మద్ కులీకుతుబ్‌షాహా రాజ్యమునకు వచ్చినట్లు వ్రాసియుండుటచే, నితరాధారములు లభించిననేతప్ప క్రీ. శ. 1592 వఱకు నిభరామ్‌జీవించియున్నాఁడని తలంపవీలులేదు. ఈపద్యశాసనము నమీనుఖాను తనప్రభువైన యిభరామ్‌షాదుషా పేరున నాతని యనంతరము వేయించి యుండవచ్చును.

ఈశాసన మున్న అమీనాబాదానగరమునందే అమీనాఖాను తటాకమును త్రవ్వించియుండవచ్చును. "తనపేరఁగల్గు నమీనుపుర" మని పైనవర్ణింపఁబడిన గ్రామమిదియే కానియీగ్రామ మీతనికాలమున గ్రొత్తగాఁగట్టఁబడిన దనియెంచుటకు వీలులేదు. ఈమూలాంకురమ్మ యాలయముపైని శా. శ. 1298 సంవత్సరపు శాసన మొకటియున్నది. కావున నీగ్రామ మదివరకేయున్నను, బూర్వపుపేరును మార్చి యమీను ఖానుపేరున నమీనాబాదని పిలువఁబడునట్లు చేసియుండవచ్చును. వెలిగందలను కరీమ్నగరమనియు, భాగానగరమును హైదరాబాదనియుఁ బిలుచుచున్నటు మనమెఱుంగుదుము కదా!

అమీనుఖాను నివాసము దీనినిబట్టి యమీనాబాదైయుండునని తోఁచుచున్నది. కొంతకాలమైన నీతఁ డిందుండియుండును. తెలగనార్యునినివాసముకూడ గుంటూరుమండలమై యుండును. గోలకొండ కవులపంచికలో నీకవినివాసము గోలకొండయని వ్రాసియున్నారు. ఇభరామ్షాహుషా గోలకొండప్రభువు కావున నాతనియొద్ద నుద్యోగిగానున్నయమీనుఖానును, యాతనికిఁ గృతి నొసంగినతెలగనార్యుఁడును గోలకొండయందే నివసించియుండురని తలంచి వారట్లు వ్రాసియుందురు. ఎట్లయిన నీవిషయ మింకను విచారణీయము.

కవిత్వశైలితెలియుటకై కొన్నిపద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

చ. అనికి నెదుర్పఁజాలుదొర నారసికానక యయ్యయాతి దాఁ
బెనఁకువ మేటిజన్నములు పెక్కులు చేసి బసిండిఁ బొఱులం
దనుపఁగ దాని నిచ్చునని దయ్యపుమూఁకలు పైఁడికొండపై
ననయము గాఁపురంబులుగ నన్నియుఁ గాచుచునుండు నెంతయున్

ఉ. మించిన యీము లేనుఁగుల మీఁదికిఁ జెంగున దాఁటి యాదలన్
చించిన గోళ్ళలోఁ దవిలిచిందిన ముత్తెము లెల్లఁ జట్లపై
మంచునఁ జేరి దాకొనిన మాటికి నమ్ముల దవ్విదవ్వి య
చ్చెంచు నెలంత లేఱుదురు సింగపుజాడ లెఱింగి యచ్చటన్ ౨౮

క. నిండుఁదలఁపునఁ దగ రా
పొండను గారవములేని పొరపొచ్చెమునం
గొండంత పసిఁడి యిచ్చిన
నుండంగాఁ దగునె వారియొద్దం దండ్రీ 3౯

ఉ. లచ్చియు రూపు వంగడము లావును రాచతికంబు గౌరవం
బెచ్చుగఁ గల్గి యిజ్జగము నేలెడు పెన్మిటిఁ జెంది తర్మిలిం
బిచ్చిలు సొంపుతోడ నినుఁ బెంచిన మచ్చికఁ బాయలేక కా
నొచ్చెము లేదుగా తలఁప నొక్కటియుం గన నీతెఱంగునన్ ౪౦

తే. మగువ యొన్నఁడు సిగ్గున మగనిజాఁడ
నట్టిగోల విన్ననగునె యైన
విదియనాఁ డేరుపడకున్నఁ దదియనాఁడు
కానఁబడియెడి పని కింత కనలనేల ?

అద్దంకి గంగాధరకవి వలెనే యీతఁడును కృతిపతు లైనమహ
మ్మదీయప్రభువులకు భారతీయదైవములు రక్షించున ట్లాశీర్వదించి
యున్నాడు. ఈగ్రంథము ముద్రితమై ప్రచారములో నున్నది.

విక్రమ సం॥ చైత్ర బ౧౩ భౌమవారము - క్రీ. శ. 1580

నందన సం॥ వైశాఖ శు 3 గురువారము - క్రీ. శ. 1592

# 234 రాయసము వెంకటపతి

ఇతఁడారువేలనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; వశిష్ఠగోత్రుఁడు; అక్కయామాత్యపుత్త్రుఁడు; విఠలార్యమంత్రి పౌత్రుఁడు; నరసయమంత్రికిఁ బ్రపౌత్రుఁడు శ్రీనివాసమంత్రియు, రామప్రధానియు, నీకవికి సోదరులు. ఈకవి లక్ష్మీవిలాస మను నైదాశ్వాసముల చిన్నపద్య కావ్యమును రచియించి శ్రీవేంకటేశ్వరున కంకితము చేసెను. అందుఁగవితనుగూర్చి యీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నాఁడు

శా. శ్రీల న్మించుసమగ్రధీకళలచేఁ జెన్నొందు నార్వేలవం
శాలంకారకరుల్ వశిష్ఠమునిగోత్రాంకుల్ బుధుల్ దీనర
క్షాలీలన్ బొగడొంది రందు వెలసెన్ సన్మానిభానప్పు ది
గ్జాలోద్వేలవిశాలకీర్తుల సుధీసందోహమందారుఁడై.

చ. ఆతనికి నుద్భవించె సుగుణాంబుధి తిమ్మయమంత్రిపుంగవుం
డతఁ డతివైభవున్ నరసయప్రభుఁ గాంచె నతం డుదారతా
యుతగతి విఠలార్యుఁ గనె నాఘనుఁ డక్కయమంత్రిశేఖరున్
సుతునిగఁ గాంచె నావరయశోనిధికిన్ మహి నేను గల్గితిన్.

క. మఱి శ్రీనివాసమంత్రియు
సిరులన్ రామప్రధానిశేఖరు లుదయిం
చిరి వారి కగ్రజుఁడనై
ధర దనరుచు నత్యుదారతాధికగరిమన్

ఉ. వ్రాయుదు రాజ్యవైభవధురంధరభూతిదలిర్పఁ గీర్తిధౌ
రేయు సిరంగరాయమహిభృన్మణి రాయస మగ్రహారం హే
మాయతరత్నభూషలు నృపార్హ్యములు వర్తన లీయ నుబ్బుచున్
వేయున నేమి రాయసము వెంకటమంత్రియనన్ యశస్వినై

క. ఈలీల నొసఁగి విభవా
వాలం బగువేంకటాద్రివల్లభుకరుణన్
శ్రీలం జెలువొందుచు ధర
నాలక్ష్మీరమణు గుణము లభివర్ణింతున్

ఈపద్యములను బట్టి యీకవి శ్రీరంగరాయలయొద్ద వ్రాయసకాఁడై యున్నట్లు కన్పట్టుచున్నది. శ్రీకృష్ణదేవరాయలయొద్ద రాజప్రతినిధిగనుండి గొప్పగౌరవమునుబడసి యనేకదానములను జేసినరాయసము కొండమరుసయ్య యీకవికిఁ బూర్వుఁ డేమో యని యనుకొంటిని కాని యాతఁడు హరితసగోత్రుఁడును యీతఁడు వశిష్ఠగోత్రుఁడునైనందున యాతనికి నీతనికిని సంబంధము లేదు. రాయసము గృహనామముగా గలవైదికబ్రాహ్మణులును గలరు. కాని వారు కాశ్యపగోత్రులైనట్లు తెలియుచున్నది.

ఈకవికిష్టదైవ మగు శ్రీవేంకటేశ్వరుఁడు స్వప్నమునఁ బ్రత్యక్షమై—

క. వరమతి నుదయించితి మ
ద్వరమున నటుగాన నీవు వర్ణించు కృతీ
శ్వరుఁడనయి వరము లొసఁగెద
గరిమన్ లక్ష్మీవిలాసకథఁ జెప్పుఁదగున్

అనియానతి చ్చెనఁట. ఈస్వప్నవృత్తాంతమును గవితనమిత్రులతోఁ జెప్పఁగావారు:—

క. సకలాధిపత్యనిర్వా
హకుఁ డని జనులెన్న వెలసితౌ ధరఁ గర్ణా
టకరాజసభల నిష్కం
టకముగ రాయసము వెంకటపతీ సుకృతీ!

మ. అలఘుప్రాభవగర్వభాక్కుతుపశాహామేయసైన్యంబున
గ్గలికం బంపులచేతఁ గెల్చి బిరుదుల్ గైకొన్న శ్రీరంగరా
యలచిత్తం చిగురింప రాయసము వ్రాయంజాలితౌ నౌ సుధీ
తిలకుం డక్కయమంత్రివేంకటపతీ దివ్యత్కళావాక్పతీ

క. ప్రతిపద్యశిరఃకంపము
ప్రతిపదచిత్రార్థగోచరము ప్రతివాక్య
స్థితిరసబంధురమై యు
న్నతిఁగాంచఁ బ్రబంధ మీవొనర్పుము హరికిన్

ఇందుఁ జెప్పఁబడిన శ్రీరంగరాయలు వసుచరిత్ర కృతిపతి యగు తిరుమలరాయలయొక్క రెండవకుమారుఁడు. ఇతఁడు తండ్రి జీవించియుండఁగనే రాజ్యభారమును వహించి క్రీ.శ. ౧౫౭౨ మొదలు ౧౫౮౧ వఱకును కర్ణాటరాజ్యపాలన మొనర్చినవాఁడు. ఇతఁడార్వీటి బుక్కరాజువంశములోనివాఁ డని వేఱుగఁ జెప్పనక్కరలేదు. తిరుమలరాయలయొక్కతండ్రికూడ శ్రీరంగరాయలే కాని యాతని కాలములో కర్ణాటరాజ్యలక్ష్మి తుళువవంశమునందే యున్నది. కానియార్వీటి వంశము నాశ్రయించలేదు. 'కర్ణాటక రాజసభల' నని పైపద్యమునందుండుటచే నీతఁడు తిరుమలరాయలతండ్రి శ్రీరంగరాయలని చెప్పవలనుపడదు.

పైపద్యములో చెప్పఁబడినకుతుబ్‌షాహా అద్దంకి గంగాధరకవి కాశ్రితుఁ డగు ఇబ్రహీమ్‌కుతుబ్‌షాహాయని యెంచదగియున్నది. ఇబ్రహీమ్‌కుతుబ్‌షాహా కుమారులలో నొకఁడు శ్రీరంగరాయలను మాటలతోనే స్వాధీనముచేసికొని తనతండ్రితో సఖ్యమొనగూర్చినాఁడని గంగాధరకవి చెప్పినపద్యము నాతనిచారిత్రమున నుదాహరించియున్నాఁడను. ఆశ్రీరంగరాయలే యితఁడు. ఇబ్రహీమ్‌కుతుబ్‌షాహాను 'మల్కిభరాము' అని కవులు వాడియున్నారు. అతఁడు క్రీ. శ. ౧౫౫౦ మొదలు ౧౫౮౧ వఱకు గోలకొండనవాబుగా నుండెను. కావున రాయసము వెంకటపతియును, అద్దంకి గంగాధరకవి, పొన్నికంటి తెలగన్న మొదలగువారితో సమకాలికుఁడై యుండెనని నిశ్చయింపవచ్చును. లక్ష్మీవిలాసము క్రీ. శ ౧౫౭౫-౧౫౮౧ సంవత్సరములమధ్య రచియింపబడెనో ననుట స్పష్టము.

రాయసశబ్దమునకు కార్యదర్శిపనియని యర్థము. ఆపనిని జేయువారు రాయసమువా రయినారు. లక్ష్మీవిలాసమున, దేవతలును రాక్షసులును పాలసముద్రమును మథించుటయు, కవ్వముగా నమర్పఁబడిన మంథరము సంద్రమున మునిఁగిపోవ శ్రీమహావిష్ణువు కూర్మావతారమున దాని నుద్ధరించుటయు, నందు హాలాహలాదులు జన్మించుటయు, మోహినీరూపమున శ్రీమహావిష్ణువ యమృతమును బంచి యిచ్చుటయు, పాలసముద్రమున జన్మించినలక్ష్మిని గైకొనుమని సముద్రుఁడు

శ్రీహరిని ప్రార్థించుటయు, శ్రీహరినిగోరి లక్ష్మి విరహార్తినొందుటయు, తుద కాతఁ డామెను వివాహమాడుటయు మొదలుగా భారతమున వర్ణింపఁబడినకథ వర్ణిత మయినది.

ఈ వెంకటపతి సంస్కృతాంధ్ర భాషలయందు మంచిపండితుఁడు. ఇతనికవిత్వము సంస్కృతాంధ్రపదసమాసమై నిర్దుష్టమై చక్కని వర్ణనాంశములతో మనోహరముగా నున్నది. ఇతనికి శబ్దాలంకారమునం దధిక ప్రీతి. ఆశ్వాసము లైదున్నను పద్యములు మొత్త మాఱువందలయేబది కంటె నెక్కువ లేవు. ఇతఁడు సంగీతవిద్యయందుఁగూడఁ బ్రవీణుఁడని గ్రంథాంతగద్యవలనఁ దెలియుచున్నది.

కవిత్వశైలి తెలియుటకై యయిదాశ్వాసములనుండియు నైదు పద్యముల నీక్రింద నుదాహరించుచున్నాడను.

మ. జలజాతాక్షుని పూలచప్పరము డాసల్లెల్ల నుప్పొత్తుగాఁ
దలలం బెట్టుక వచ్చుచందమున నాథమ్ముల్ గదాధారిదో
ర్బలముం దోడుగ నమ్మహానగముఁ బారావారతీరావనీ
తలమున్ జేరఁగఁ దెచ్చి నిశ్చలభుజాదర్పంబునన్ నాటినన్

చ. అమరులు మీరు తృప్తిఁ గనునట్లుగ నందఱ కేను విందుగా
నమృతముఁ బంచిపెట్టెద మహామహులార! మదీయవాక్యముల్
ప్రమదమునం గ్రహించి యటఁ బంక్తులు సాఁగి వసింపుఁ డంచిత
క్రమమున నంచు నెంచఁగల కైతవలీలలచే నటింపుచున్.

చ. నిరతము సాధ్వియైనగృహిణిన్ దలవాకిట నుంచి పుత్రి మం
దిరమున బుద్ధిఁ బెంచ కతినిం బలఁజివ్వలఁదిండిఁ జేసి తా
నురుతరసత్రభోక్తయయి యోగియు భోగియు గాని బ్రహ్మనే
వెరవున మెచ్చు రష్టురమువిప్రులు నీతికళాసమగ్రతన్ ౩ ఆ

ఉ. అన్నన మంచు రేయిఁ బగలా పగలాయెఁ బగాయె వెన్నెలల్
కన్నెగా! యేమియున్ వినవుగా యవుగా నవుగాదె నీకు నీ
కన్నులయాన చంద్రుఁడుడు కాదుడు కాఖిడు కాల మెట్టిదో
వెన్నకుఁ బండు వచ్చెఁ గదవే పదవే యదఁవేగ నింటికిన్ ౩ ఆ

చ. మఱిపెముతో సువాసినులు ముత్తెపుసేసఁబ్రాలు పైఁడిప
ళ్లెరములఁ దేర హస్తయుగళిన్ వడిముంచి శిరంబులన్ వధూ
వరులను నించిరొండొరులు వర్ణితకల్పలతాసురద్రుమో
గరయుగళత్తదీయకళికానికరంబులసొంపు నింపుచున్. ౫౮

ఈకవినివాసము, శ్రీరంగరాయలరాజధాని యైన పెనుగొండ యనియే యూహింపఁదగియున్నది.

---

## 235 తురగా రాజకవి అయ్యంకి బాలసరస్వతి



ఈయిరువురుకవులును స్కాందపురాణాంతర్గత నాగరఖండము నాంధ్రీకరించి, విశ్వకర్మకులజుఁ డగుధవశేశ్వరపు మార్కండేయునకుఁ గృతి నొసంగిరి. ఈక్రింది గద్య పద్యములవలన నీకవుల చారిత్రము కొంత తెలియఁగలదు.

క. అభినవవిశ్రుతకవితా
విభవుల నఖిలాగమాంతవిద శౌనకగో
త్రభవులము బుధవిధేయుల
మభవపదాంభోజబంభరాత్ములము మహిన్

క. రసికుఁడు తుర్కారాజన
యసమప్రతిభావిరాజి యయ్యాంకితబా
లసరస్వతి యనువారల
మసహిష్ణువ్రజవిదారణార్థులము మతిన్

గద్య:— ఇది శ్రీమద్దుర్గాదక్షిణామూర్తి వరప్రసాదఫలిత తుర్గారాజ
కవివరాయ్యంకిబాలసరస్వతీ నామధేయప్రణీతంబైన శ్రీస్కాందం
బను మహాపురాణంబునందు సనత్కుమారసంహిత యనునాగర
ఖండంబున......"

పై నిట్లు వ్రాసినగద్యపద్యములు తక్క కవులను గూర్చి తెలుపునట్టి వేమియు నీగ్రంథమున గానరాలేదు ముద్రితప్రతులలోను అముద్రిత ప్రతులలోను మొదటి గ్రంథకర్త నామము "తురగారాజకవి" అనియే యున్నది. ఆంధ్రకవులచరిత్రమున బ్ర. శ్రీ వీరేశలింగముపంతులుగారు రీతని తురగారామకవియని వ్రాసియున్నారు. "రామకవిబొబ్బ పిడుగుకంగి దెబ్బ" అనినట్టి కవులలోఁ బ్రసిద్ధిఁ గాంచినతురగారామకవి యొకఁడు కలఁడు. అతఁ డీతఁడే యనిపంతులుగారి యభిప్రాయము. పైని వ్రాసినగద్యపద్యములనుబట్టి యీకవు లేశాఖకుఁ జెందినబ్రాహ్మణులో యెచ్చటివారో యేమియుఁ దెలియలేదు. గోదావరిమండలమున తురగావారును అయ్యంకివారును నియోగిబ్రాహ్మణులలో నున్నారు. వారు శౌనకగోత్రులు. కావున నీకవులును నియోగిబ్రాహ్మణులే యని నిశ్చయింపవచ్చును. గోదావరిమండలమునందు "దుగ్గా" యను గృహనామము గలనియోగిబ్రాహ్మణు లున్నారు. కాని వారు శౌకనగోత్రులు గారు. భారద్వాజగోత్రులు. కవులనివాసముగాని, కవులతండ్రుల పేర్లుగాని తెలియరాలేదు. ముద్రితప్రతి పీఠికాకారులుగాని వ్యాఖ్యాతగాని కవులనుగూర్చి యేమియుఁ దెలుపలేదు. గ్రంథాంతమున నున్న యీక్రిందిపద్యమువలన నీగ్రంథరచనాకాలము శా. శ ౧౫౦౮ అనగా క్రీ. శ ౧౫౮౬ వ సంవత్సర మని తెలియుచున్నది.

సీ. శాలివాహనశకసంఖ్యాకములు నగు
పదియేనువందలపై నెనిమిది
వత్సరంబులలోన వసుధాస్థలంబున
ఖ్యాతుఁబుపాహీం నిజాం ఖ్యాతులనాధు
ప్రాభవవేళ మార్కండేయభూపతి
ధవళేశ్వరాన్వయభవుఁడు నగుచు
సకలదిశావ్యాప్తసాంద్రసుధాస్వచ్ఛ
కీర్తిపరంపరాస్ఫూర్తి నలరి
తే. సురుచిరం బైనపెందోటపురిని నిలచి
విశ్వకర్మాన్వయాంబుధి వెలయఁజేసి

స ప్తసంతానములఁ గాంచి సాధువృ త్తి
సుకవివర్యులు భళియని స్తుతులు సేయ
ధరణి పాలింపుచుండెను ధర్మనిరతి.

ఈపద్యము గ్రంథక ర్తృనామాదికమును దెలుపుగద్యకుఁ బిమ్మట నుండుటచేఁ గవులురచించినది కాదేమోయని సంశయముతోఁచుచు న్నది. ఎవరురచించినను నిందలి కాలము సరియైనదియే. కృతిపతి యైన మార్కండేయుఁడు గోలకొండనవాబయినమహమ్మదుకుతుబ్ షాహాకుఁ గుడిభుజముగానున్న ట్లీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

క. అతఁడు ప్రసిద్ధి వహించెఁ
క్షితి నరగజపతులఁ గెలిచి చెలఁగి జయశ్రీ
పతిఁ జేకొనినమహమ్మదు
కుతుపశహాచంద్రునకును గుడిభుజ మనఁగన్.

ఈమహమ్మద్ కుతుబ్ షాహా క్రీ. శ. ౧౫౮౦ సంవత్సరము మొదలు ౧౬౧౧ వ సంవత్సరమువఱకును రాజ్యమేలినవాఁడు. కావున పైపద్యమునందలి కాలము వా స్తవ మనుట నిశ్చయము.

కృతిపతి తమను గౌరవించి యీగ్రంథమును రచింపుమని కోరి నట్లు కవు లీక్రిందిపద్యములలోఁ జెప్పుకొనియున్నారు.

మ. మముఁ బిలిపించి చాల బహుమాన మొనర్చి కవీంద్రులార! స్కాం
దమున మహాప్రసిద్ధ మగునాగరఖండ మఖండవిశ్వక
ర్మమహిత వైభవాకరము మాకుఁ దెనుంగున నంకితంబుగా
రమణ ఘటింపఁగాఁ దగుపురాణవిధుల్ మది రాణ మెచ్చఁగన్.

చ. అని కనకాంబరాభరణహారపటీరసుగంధవీటికా
ద్యనుపమపారితోషికము లర్థి నొసంగఁ బొసంగఁ బొంగి కై
కొని కృతికంఠమాలికకు గొబ్బున నాయకరత్న మబ్బె ప్రా
క్తనసుకృతంబుచే ననుచు తత్కథఁ బూనితి మే మొనర్పఁగన్.

గోదావరిమండలమున దురగావారుండుటచేతను కృతిపతి గృహ నామ మయినధవళేశ్వరము గోదావరిమండలమున రాజమహేంద్రవర

ముకడ నుండుటవలనను, కృతిపతినివాసము గోదావరిమండల మేమో యని యూహ పొడముచున్నది. కాని కృతిపతినివాసము పెందోట యని యీక్రిందిపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

సీ. పెందోటపురవరమందుఁ గాపురముండు
విశ్వకర్మావనీవిబుధవరులు
శ్రీమారుకొండు ధరిత్రీవరాగ్రహ
గణ్యప్రవర్తవిఖ్యాతము లగు
నగ్రహారాదిసమగ్రసుస్వాస్థ్యాది
కములు గల్గుటచేతఁ గలిమి గాంచి
వేదశాస్త్రాదికవిద్యలుజదివి ది
వ్యజ్ఞానసంపత్తి నతిశయిల్లి
సకలయజ్ఞంబుల సరవితోఁ గావించి
నిరతాగ్నిహోత్రులై నెగడుచుండి
సురపితామహుని నిశితాధ్వరుని గురుని
ధిక్కరించియు నిరతవితీర్ణమహిమ
ధైర్యమున వారిదాద్రిల దలఁకునటుల
జేసి బ్రహ్మణ్యులైరి యాస్థిరసుస్థిరత

తే. గీ. పరమమగునట్టి పెందోటపురవరమున
కధిపతి శిరోవతంసమై యలరె సకల
కళల ధవళేశ్వరపురవిఖ్యాతుఁడైన
గురుతరయశోధనుండు మార్కండఘనుఁడు.

ఈపెందోటపుర మెచ్చటిదో యిప్పుడేపేరుతోనున్నదో తెలియరాలేదు. కృతిపతి యైనమార్కండేయుఁడు పేషిణీహనుమంతాది బిరుదములను గలిగియున్నట్లును శ్రీశైలమునందు పదకొండు శివలింగములను స్థాపించి యనేకగ్రామములలోఁ జెరువులు నూతులు త్రవ్వించి నట్లును నీక్రిందిపద్యములలోఁ గవులు గీర్తించియున్నారు.

క. జనితజననుత పేషిణీ
హనుమంతా కనకకుండలాభరణసనా

తన మేఘవాహనాదిమ
ఘనబిరుదాంకభవ పూజకద్విరతునకున్.

శా. పారావారము మేరగాఁ గలుగుభూభాగంబు పైనున్నయూ
రూరం గూపములుం దటాకములు రమ్యోద్యానపంక్తుల్ మఠా
గారంబుల్ నిరతాన్నసత్రములు నాకల్పంబుగా నిల్పె నౌ
రౌరా సోమయమారుకండు ఘనపుణ్యుం డెన్నఁగాశక్యమే.

క. విశదముగ నిల్పె నేకా
దశమార్కొండయ్యలింగధామములు నిరం
కుశవృత్తి శ్రీగిరిజ యా
శశితారార్కముగ వీరశైవాగ్రణియై.

ఈపద్యములలో సత్యుక్తివిశేషముగా నున్నట్లు తోఁచుచున్నది. పెంచోటపురాధిపతియని కృతిపతిని జెప్పుటవలనఁ నీతఁ డాగ్రామము నకు ప్రభువనియర్థము గన్పట్టుచున్నను, ఆగ్రామమునకుఁ గరణమే మో యనిసంశయముఁ కలుగుచున్నది. పూర్వము విశ్వకర్మకులజులు కొందరు కరణికమునుజేయు చుండెడివారని ప్రతీతికలదు. లేదా పెంచోట ముఖాసా కధిపతియైయుండును.

నాగరఖండ మయిదాశ్వాసములు కలది. ఇందు విశ్వకర్మప్రభా వముఁ వర్ణితమయినది. ఈకవులకవిత్వము ధారాశుద్ధికలిగి ద్రాక్షాపాక మున నున్నది. శైలి చూపుట కయిదుపద్యముల నుదాహరించుచు న్నాఁడను.

మ. అజుఁడై లోకములఁ సృజించు నవి దైత్యారాతియై పెంచు న
ట్టిజగంబుల్ హరుఁడై హరించును నితండే సుఖ్మి నానాత్మకుం
డజరుం డవ్యయుఁ డాదివిగ్రహుఁడు వేదాతీతుఁ డాధ్యుండు స
ర్వజనస్తుత్యుఁడు నిత్యుఁ డీశుఁడు పరబ్రహ్మంబు దా వర్తిలున్.

మ. తరణీంద్వాదినవగ్రహంబులును దత్తద్వాహనశ్రేణులున్
కరణవ్రాతముఁ శస్త్రసంఘములు రంగద్ధామముల్ విశ్వసం

చరణాబ్జోన్నతదివ్యమార్గములు సాకేత్రబ్రహ్మమా విశ్వక
ర్మ రచించెఁ శిఖివాహవారలకు సేమం బొప్పు నేతత్కృపన్ ౨ఆ

ఉ. పూర్వదిగంతరస్థలిని బుట్టినరావి యొసర్పు నెప్పుడున్
సర్వము దేవతామయము సారసగర్భుఁడు మూల మగ్రమా
శర్వుఁడు మధ్యమచ్యుతుఁడు చాలఁగఁ దత్తరుతల్లజంబు లోఁ
బర్విసభక్తి యుక్తి దలపం జుతిపాపము లుండ నేర్చునే ౩ఆ

చ. అంతట నంతకంతకుఁ బురాంతకు నుజ్జ్వలతేజ మాత్మగ
ర్భాంతరసీమఁ బూర్ణమయి యద్రిగురుత్వము జూపుచుండనా
యింతియు గర్భభారము సహింపఁగఁజాలక ఖిన్నచిత్తయై
కాంతుఁ బ్రభంజనుం దలఁచె గంధవహుండునువచ్చియయ్యెడన్ ౪ఆ

శా. కన్యారత్నము గౌరి పావని జగత్కల్యాణినీ పుత్రియై
ధన్యాకారత నుండ సర్వజగదాధారుండు నానామరు
న్మాన్యుం డీశ్వరుఁ డల్లుఁడై తనరఁగా శైలాధిపా ! సా
మాన్యంబే భవదీయపూర్వకృతధర్మం బెన్న లోకంబులన్ ౫ఆ

అయ్యంకి కృష్ణామండలములోనున్నది ఆమండలమున నయ్యంకి వారును తురగావారునుగూడఁ గలరు. పెందోట నిజాముగాష్ట్రమున నుండియుండును. కృష్ణామండలమునకు నిజామురాష్ట్రము సమీపమగు టచేఁ గవు లచ్చటకేఁగి యీగ్రంథమును గృతి యొసంగియుందురు.

కవులచారిత్రమున శ్రీవీరేశలింగముపంతులుగారు, తురగారామ కవిని గూర్చి యీతఁడు తిట్టుకవియనియు శాపానుగ్రహసమర్థుఁడ నియు, వ్రాయుచుఁ గొన్నికథలను వ్రాసియున్నారు. ఆకథలలో రెండు అడిదముసూరకవితోను, పెద్దాపురపుసంస్థానాధీశ్వరులైన వత్సవాయి తిమ్మజగపతి మహారాజుగారితోను సంబంధించినవి. కాలవ్యత్యాసముం డుటచేఁ గవినిగూర్చి చెప్పెడుకథలన్నియు నబద్ధములైనట్టు కనఁబడు చున్నదనికూడ శ్రీపంతులుగారే వ్రాసియున్నారు. కావున నాకథలను గూర్చి యిట నేమియు వ్రాయనక్కఱలేదు. ఆ తురగారామకవి యీ తనికంటెఁ భిన్నుఁ డనియే తలంపవలసియున్నది. ఇంతకును నాగరఖండ

కృతికర్త "రాజన" కాని రామకవి కాడు. రామకవి ప్రసిద్ధుఁ డగుటచే నీపే రాగ్రంథమున కతికించిరి. కాని యాగ్రంథకర్త రామకవియనుట కాధారములు లేవు.

గద్యయం దీతనియింటిపేరు తుర్కాఅనియున్నను, శౌనకగోత్రజు లైనసియోగిబ్రాహ్మణులలో "తుర్కా" వారున్నారని ఋజువగువఱకును నీతనియింటిపేరు "తురగా" యనియు, తుర్కా యనునది లేఖకప్రమాద మనియుఁ దలంతము.

ఈనాగరఖండమునకు శ్రీమతుకుమిల్లి కృష్ణశాస్త్రి గారుటీకవ్రాసియున్నారు. టీకతోఁగూడిన గ్రంథ మొకటియు, టీకారహిత గ్రంథ మొకటియు ముద్రితములై ప్రచారములో నున్నవి.

కృతిపతి మహామ్మదుకులీకుతుబ్ షాకడ, మంత్రిగను, దండాధిపతిగను నుండి కీర్తిగాంచి యుండెను. శ్రీశైలమునఁ బదునొకొండు మార్కండేయలింగములను స్థాపించియు, నగ్రహారాదికముల నొసంగియు శాశ్వతయశస్సును సంపాదించెను. ఈతని శాసనములకొఱకు వెదకితిని గాని కన్పడలేదు.

---

# 236 డిల్లి వెంకటాఖ్యకవి



ఇతఁడు జ్ఞానసూర్యోదయమను నొక వేదాంతద్విపద కావ్యమును రచియించి, తనగురు వగుమల్లనయోగి కంకితము చేసెను. ఈమల్లనయోగియే ముమ్మిడిమల్లనకవి ఈ మల్లనచారిత్రము నిదివరకు వ్రాసియున్నాడను. (10 సంపుటము ఆం. క. త. పుట 192.) , శ్రీరామచంద్రమూర్తి సీతాదేవికి బోధించిన ట్లీగ్రంథమును రచియించెను.

కవి తననుగూర్చి యిట్లుచెప్పుకొనియున్నాఁడు.

"నిరళయానందనిపుణతఁ గాంచి
యొకఁగింతు మద్వంశ మెట్లన్నవినుము

ఘనడిల్లితమ్మయఁగాయమ్మసుతుఁడు
వినుతసజ్జనుఁడు గోవిందయనరస
మాంబసుతుండు నాయన్నాన్యలక్ష్మ
మాంబసుతుండు నాశ్వలాయననామ
సూత్రఋగ్వేదభాసురుఁడ వసిష్ఠ
గోత్రుండ వెంకటాఖ్యోన్న తయశుఁడ
మునిజనహృదయాబ్జములు వికసింప
నొనరింతు జ్ఞానసూర్యోదయం బనెడు
ఘనకృతి ద్విపదగాఁ గావ్యులుమెచ్చ

దీనినిబట్టి కవి బ్రాహ్మణుఁడనియు ఋగ్వేదియనియు నాశ్వలాయనసూత్రుఁడనియు వసిష్ఠగోత్రుఁడనియు, గోవిందయ్యనరసమాంబలపౌత్రుఁడనియు, తమ్మయకాయమ్మల ప్రపౌత్రుఁడనియు, ఇంటిపేరు డిల్లివారనియు, పేరు వెంకటాఖ్యుఁడనియుఁ దెలియుచున్నది. ఈకవి ధేనువుకొండ తిమ్మయార్యుని శిష్యపరంలోనివాఁడు. ఇతఁడు తనగురు వైన ముమ్మడిమల్లన నిట్లుకొనియాడియున్నాఁడు.

"శ్రీకరు మోక్షలక్ష్మీమనోహరు
ప్రాకటనిజపరబ్రహ్మవతారు
నానాముముక్షుమానసరసత్తోరు
భానుకోటిప్రభాభాసురాకారు
గురుమతశాస్త్రానుకూలప్రసారు
వరరాఘవస్తవవాక్చమత్కారు
తత్త్వవాద్యుత్తన్మదంతకంఠీరు
తత్త్వమస్యర్థసాధకనిర్వికారు
పరమమంత్రార్థదర్పణవాక్యసారు
పరమసుషుమ్నాంతరప్రజ్ఞానవిహారు
తిమ్మార్యగురుసారతీర్థకాసారు
సత్యోన్మదహృదయనిశ్చలబోధధీరు
సురుచిరాపస్తంబసూత్రప్రచారు

సరసయజుర్వేదసమ్యగాచారు
గురుతరకౌండిన్యగోత్రప్రకారు
ధరణీసురాన్వయధర్మసృంగారు
తనరుకృష్ణానదీదక్షిణతీర
తెనుఁగుదేశమునఁ బొందికఁ గోరువారు
కులజనార్జితమైక కొప్పురావూరు
ఇలరాజధానిగా నేవృనమిాఋ
సతతముమ్మడిరాజసత్కులధీరు
ధృతిని గృష్ణయ రఘుపతెమ్మకుమారు
డగుమల్లయాచార్యు నాత్మ సుస్థైర్యు
నిగమోక్తిహృద్వీధి నిలిపి సేవించి
సుకవీంద్రవర్యుల సొరిదిఁగీర్తించి
సకలశాస్త్రవివేకసారంబు నెంచి.

ఈమల్లనకవిరచించిన "శ్రీగామస్తవనామము"ను గవి యిందు రాఘువస్తవవాక్చమత్కారుగాఁ జేర్కొనియున్నాఁడు. మల్లనకవి తత్త్వచంద్రోదయమను ద్విపదకావ్యమును రచియించి యందు ధేనువుకొండ తిమ్మయార్యుని పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడనియు ధేనువుకొండ నివాసుఁడనియు నీక్రిందిద్విపదలలోఁ జేర్కొనియున్నాఁడు.

శ్రీధాన్యకటకమై చెలువొందుచున్న
యాధేనుకొండాహ్వయగ్రామవర్తి
కరుణాకరుం డైనకరుణాకరుండు
కరుణగాంచినయట్టిఘనకుమారుండు
నాణెమైతగు పాకనాటిశేఖరుఁడు
రాణించుశ్రీతిమ్మరాజప్రధాని
సద్గుణాంభోరాశిచంద్రుఁ డైనట్టి
మద్గురుస్వామి తిమ్మయరాజయోగి

ఈ డిల్లి వెంకటాఖ్యకవి మల్లనయోగి శిష్యుఁడు కావున క్రీ. శ. 1550-1600 నడుమనున్నవాఁడని నిర్ణయింపవచ్చును.

ఈకవి గురువైనమల్లనయోగిని వర్ణించిన పై ద్విపదలలో నుదాహృతములైన తలిదండ్రుల నామములను గోత్రసూత్రాదులును ముమ్మడిమల్లనకవి చారిత్రమున (ఆం. క. త. సం. 10 పుట 190) నుదాహృతములైనవియు నొక్కరీతిగా నున్నవి. కావున నామల్లన కవియే యీమల్లనయోగియని నిర్ణయించుటకు సంశయ మక్కరలేదు.

# 237 మారేపల్లి వెంకటయోగి



ఇతఁడు వైదికబ్రాహ్మణుడు. "తత్త్వదీపికాప్రబోధము" అను ద్విపదకావ్యమును రచియించి, శ్రీఅలమేలుమంగాసహిత శ్రీవేంకటేశ్వరున కంకితముచేసెను

ఈకవినిగూర్చియు, నీతనిగ్రంథమునుగూర్చియు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక 13వ సంపుటము 866వ పుటలో వ్రాసియున్నారు.

ఈ వెంకటయోగి ముమ్మడిమల్లనయోగి శిష్యుఁడు. తనను గూర్చి కవి యిట్లుచెప్పుకొనినాడు.

"అనుచు శ్రీమల్లనాచార్యప్రసాద
ఘనతమారేపల్లికామార్యసుతుఁడు
సుతుఁడు వేంకటభట్టుసూనృతయశుఁడు
అతనికిల్లాలు నర్సాంబ వారలకు
గారాపుసుతుఁడు వేంకటయోగివరుఁడు
శౌరత వేంకటాచలపతిపేర
నారూఢుఁ డెంచగా నంకితంబైన
ధీరత నీతత్త్వదీపికాబోధ

ఇది యొకచిన్నద్విపదకావ్యము. ఈకవికాలము ముమ్మడిమల్లన నుబట్టి క్రీ. శ. 1550–1560 అనినిర్ణయింపవచ్చును. ఈకవి నివాసము తెలియదు. వెంకటభట్టు తండ్రి. నర్సాంబ తల్లి. తాత కామయ్య.

మచ్చునకు కొన్ని ద్విపదలు.

నిదురందుఁబ్రాజ్ఞుని నిర్వాసనాను
హృదయంబునను జీవుఁడుండును మఱియు
త్రిగుణభావత్రయత్రిపురందు నిగుడి
నిగుడుజీవుండును నీవు నేననుచు
కల్పితరాగాదికర్మంబు లెల్లఁ
గల్పితదేహివిగాఁగ నెఱుంగు
సరియవస్థాత్రయసాక్షియైనట్టి
యెఱుకస్వరూపంబు నెఱుఁగు మెట్లన్న
దేహేంద్రియప్రాణధీమనోచిత్త
మోహాదిగుణధర్మములునీవుగావు

---

# 238 మట్లి అనంతభూపాలుఁడు.

ఇతఁడు కకుత్స్థవిజయ మనునైదాశ్వాసముల యుత్తమప్రబంధమును రచియించి, తనతండ్రి యైన యెల్లభూపాలున కంకిత మొనర్చెను. ఈతఁడు సూర్యవంశక్షత్రియుఁడు; ఈతనితండ్రి యెల్లభూపాలుఁడు; ఎల్లభూపతికి నల్గురుభార్యలు. అందు గడసారిభార్యయైన రంగమయం దీకవి జన్మించెను. ఎల్లరాజుతండ్రి కోనరాజు. కోనరాజుతండ్రి తిమ్మరాజు. ఈతిమ్మరాజుతండ్రి బొమ్మరాజు. ఈబొమ్మరాజును మట్లి దేవచోడుఁడని నడిమింటివెంకటపతి యనుకవి తనయభిషిక్తరాఘవమునందుఁ జెప్పియున్నాఁడు ఈబొమ్మరాజునకు దేవచోడుఁడనినామాంతర మున్నది. ఈభేదముతప్ప కకుత్స్థవిజయములోని వంశావళియు, నంతవఱకభిషిక్తరాఘవవంశావళియు నొకదాని కొకటి సరిపోవుచున్నవి. అభిషిక్తరాఘవకృతిపతి యైనమట్లి వెంకటరామభూపాలుఁడీకవికి మనుమనిమనుమఁడు. ఈవంశమునకు మూలపురుషుని, దేవ

చోడుఁడని చెప్పుటచేత నీరాజులు, కరికాలచోడులు మొదలుగాఁ జోడులని చెప్పఁకొనఁబడు చోడవంశపురాజులయి యుందురని తలంప వలసియున్నది.

ఈకవికిఁ బెదతాతమనుమఁ డైనవరదరాజు, శ్రీకృష్ణదేవరాయల కల్లుఁడైన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. వనజదళాక్షశంకరులు వార్ధికి నద్రికిఁ బోలెఁ గృష్ణరా
యనికి ననుంగుటల్లుఁడటులై తనరు న్వరదక్షమాధవుం
డనిమిషవాహినీమునిగజాశ్వమహీరుహధేనుభీమవా
హనమకుటావతంసవసుధరాధరణాదికహేతుకీర్తియై.

ఈయనంతభూపాలకవి తండ్రియాస్థానమున "నంధ్రకవితాపితాపితామహాంకుండును, నుభయచ్ఛత్రచామరశంఖసంఘాతాంకుండును నగు నుప్పుగొండూరిపురి వేంకటకవి" యనునొకమహాకవి యుండెనఁట! ఈమహాకవి రచించినగ్రంథము లేవియో తెలియలేదు. ఆకవినిఁజూచి, ఎల్లరాజు శాశ్వతం బగుధర్మమేదియని యడిగినట్లును "సకలధర్మములలోఁ గృతియే ప్రధానమనియు, నీకుమారుఁ డైన యనంతభూపాలుఁడు చక్కనికవిత్వము చెప్పఁగలవాఁడు కావున నాతనిచే నొక కృతిని గ్రహింపు మనియు, నాకవి ప్రత్యుత్తర మొసంగినట్లును, నీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

ఉ. కోనయయెల్లవైరి నృపకుంజరభంజన కంజనాభసే
వానిరవద్యయాద్యజనవర్ణితదుర్లభ నీతిసార యా
రా నవఖండరాజరసనాంచలరంగము లన్నిటింపఁద
న్మానసగర్వపుం దెరదెర దెమల్చియయుర్విఁతికీర్తినర్తకిన్.

గీ. అమితచారిత్రపుణ్యమార్గములుగలవు
పెక్కులైననుసత్కీర్తి కెక్కు నిజము
సప్తసంతానముల నందు శాశ్వతంబు
కావ్యమందుము సత్కవికలిగె నీకు

క. మహి నీపుత్త్రుఁ డనంతుఁడు
బహుమహిమలఁ జెప్పనేర్చు భవహాళిధునీ

లహరీఘుమఘుమితవచో
మహితంబులు కృతులు స్వరస మాధురి నవురా !

ఈమట్లివారు బహుపరాక్రమ వంతులై, కర్ణాట ప్రభువుల కనేక యుద్ధములలోఁ దోడుపడుచు వారికి సామంతులై యున్నవారు. అనంత భూపాలకవి నివాసము కడపమండలములోని సిద్ధవటము. ఈసిద్ధవటము రాజధానిగా వీరొక చిన్నసంస్థానమును బరిపాలించియుండిరి. ఇతఁడు కకుత్స్థవిజయమును రచించునాఁటికి కుమారుఁడును ముగ్గురు మనుమలు నున్నట్లును వారు శూరులై మహమ్మదీయులతో యుద్ధమొనర్చినట్లును నీక్రింది పద్యములలో నున్నది. ఈపద్యములు కవివిరచితములే యైనను, తనను గూర్చి వ్రాసికొనుట యాత్మస్తుతి యగుననియుఁ దన కొడుకును గుఱించియుఁ మనుమలను గుఱించియు జెప్పఁగూడదనియుఁ నెంచి యీవాక్యములను బైనినుడివిన వెంకటకవి చెప్పినట్లు వ్రాసియున్నాఁడు. గ్రంథవిస్తరభీతియున్నను నాపద్యములలోఁ గొన్ని యిట నుదాహరించుచున్నాఁడను.

సీ. జడరాశిఁ జొరఁబాఱె బడబానలజ్వాల
చిద్రూపు హరుఁ జేరె శీతరోచి
యొకమూలఁ బడియుండె నొదిగి కృశానుండు
హాలాహలము మ్రింగె శూలపాణి
యాకసం బెగఁబ్రాఁకె నబ్జాతహితకారి
పాతాళమున కేఁగెఁ బాపఱేఁడు
కదలఁగా వెఱచె నక్కనకాచలేంద్రంబు
పారి కాంక్షితఁ గాంచె నారదుండు
నెవని విశ్రాంతి కీర్తియు నేఁచి తఱుమ
వానినుతయింపవశమె శేషాహికైన
నిఖిల రాజన్య కోటీర నిహితచరణు
మట్లనంత మహీనాథు మతిసనాథు.

ఈయనంతరాజే కృతికర్త-

సీ. ఫాలలోచను మౌళిఁ హాలాహలము మెచ్చు
శశిమౌళి రాహువు సన్నుతించు
శరదంబుదము చెంత జంఝానిలము నెంచుఁ
దుహినసంతతి చెంత మిహిరుఁ దలఁచు
నలినసంతతి చెంత నాగంబు స్తుతిసేయు
సురగవల్లభుపొంత గరుడు నొడువ
హరిదంతికడఁ గాలి కాశ్వముఁ గొనియాడు
భారతికడ వీణభామఁ బొగడు
మల్లతిరువెంగళనృపాలు మహితకీర్తి
యెంతగయ్యాళి రచ్చల కెల్ల నెక్కి
తత్తదుచితస్థలంబులఁ దవిలి తవిలి.

ఇందువర్ణింపఁబడిన తిరువెంగళ నృపాలుఁడు కృతికర్త కుమారుఁడు. ఈతిరువెంగళరాజునకు ముగ్గురు భార్యలు ఐదుగురు కుమాళ్లు (1) కుమార అనంతరాజు (2) ఎల్లరాజు (3) చిన్నఅనంతరాజు (4) రఘునాథరాజు (5) వెంకటాద్రి ప్రభువు. ఇందు మొదటి ముగ్గురను మాత్రమే కకుత్స్థవిజయమున నీక్రింది మూఁడుపద్యములలో వరుసగా వర్ణించినాఁడు. తక్కిన యిరువురు నీగ్రంథరచనమునాఁటికి జన్మింపలేదని తలంపవలసియున్నది.

సీ. కరుణాగరిష్ఠులు కమలాక్షుఁ డనియును
వీరాగ్రగణ్యులు విజయుఁ డనియు
దాతలందఱుఁ గల్పధరణీజ మనియును
సత్యశీలురు హరిశ్చంద్రుఁ డనియు
భోగసంపన్నులు పురుహూతుఁ డనియును
వైణికాగ్రేసరు ల్వాణియనియు
బుధులెల్లరును శేషభోగీంద్రుఁ డనియును
హరిభక్తులెల్లఁ బ్రహ్లాదుఁ డనియు
నొనరఁ గొనియాడఁ గాఁపురం బుండునే మొ
దయయు శౌర్యంబు నీగి సత్యవ్రతంబు

విభవసంగీతపాండిత్య విష్ణుభక్తు
లనఁగఁ దనరు గుమారుఁ డనంతవిభుఁడు.

సీ. శాత్రవాభ్రవాత జంఝానిలం బెవ్వఁ
డెవ్వాఁడు రిపుశమోహితకరుండు
కుటిలాసుహృద్వింధ్యకుంభోద్భవుం డెవ్వఁ
డెవ్వాఁడు రిపుభూభృదింద్రహేతి
వైరిభోగివాత్రవైన తేయుండెవ్వఁ
డెవ్వాఁడు రిపుహిమాహిమకరుండు
వాఁడు విలసిల్లు దశదిశావలభిసులభ
ధౌకమానానకాసదృగ్ధాన్వినాద
బధిరపరిపంథిసైంధవ ప్రబలమాద్య
దిభుఁడు తిరువేంగళనృపాలు నెల్లవిభుఁడు

సీ. వేయుమొగంబుల విభజనం బెడలించి
యానసం బొకఁడౌ ననంతుఁ డనఁగ
నెదమోచికొనియున్న యిందిర నేత్రంబు
జాసక్తఁ జేయు ననంతుఁ డనఁగ
సర్పరాజతమాని జనపతిత్వముఁ బూని
యఖిలోర్విదాల్పు ననంతుఁ డనఁగ
నలుగేలు నిరుగేలు నలువునఁ గొనకొని
యనుకంపఁ దాల్పుననంతుఁ డనఁగ
దినదినంబును జాల వర్ధిష్ణుఁడయ్యె
మట్లనంతుని గారాబుమనుమఁ డాప్త
పద్మహేళి యనంతనృపాలమౌళి
పుణ్యగుణభాసమానుఁ డగణ్యయశుఁడు.

ఈపై పద్యములలో నలంకారములు, వర్ణనాంశములే గాని చారిత్రోపయోగములైన విషయములు లేవు. ఈరాజులేరాజులను జయించిరో, ఎప్పటివారో తెలిసికొనుటకుఁ దగినసంగతు లీపద్యములలోఁ గానరావు. ఇంతకంటె నడిమింటి వెంకటపతికవి కృతాభిషిక్తరాఘవ

మున నీయనంతభూపాలునిఁ గూర్చియు, నతని తనయుఁడైన వెంగళ నాథజనపతినిగూర్చియు వ్రాసినపద్యములలోఁ జారిత్రకాంశములున్నం దున నాపద్యముల నీక్రింద నుదాహరించుచున్నాఁడను.

ఉ. గాయకు లశ్వరాయబలఖానులు మట్లయనంతరాజకౌ
తేయకధారఁ ద్రెవ్వి రనిచెప్పెడి దింతియ కాక షేలుపున్
రాయలసీమలోనఁ జతురంగ బలంబులతోడ వైరముల్
పాయకయున్నవారు సరిపాళెము వైచినయ ట్లజస్రమున్.

చ. విలసితశక్తి మట్లతిరువేంగళనాథకృపాణవల్లరీ
చలనహతాహితాన్వితవిజాపురిరాడ్బల మర్కమండలం
బళుకక వ్రక్కలింపు సమదాత్మనదశికులర్క (?) త్రుబుద్ధినిం
బిలెఁ జలమెట్టిదో కద సమంచితసద్గతి కేఁగువేళలన్.

సీ. దురుసుమోటుగలీబు కరకుబాసలు దెల్పఁ
బల్కుతోయ్యాలి కాసపడెడువారు
తమమీఁది మోహంబు తటిగిబో మందు లి
మ్మనియాశ్వసేయుల నడుగువారు
సమరాగ్రపతనభాగ్యము తురుష్కులకియ్య
వలదంచు నలువతోఁ దెలుపువారు
జరతాంగనావేషచతురలై యూఁతక
ఱ్ఱలుబల్మి ముంగిళ్ల నిలుచువారు
నైరివేల్పు వెలందు లుదారవీర
విక్రమాస్పదమట్లతి ర్వేంగళేంద్ర
ఖడ్గదోఃప్రేషితానుక్రౌర్యయవను
నిశ మతముక్రియలఁ దమ్ము నలఁచునపుడు.

సీ. గుత్తిదుర్గాసక్తిఁ గూడినమన్నీలఁ
బోఁకార్చి నేరాజు భంగపఱచె
వరసిబోవఁగఁ గొల్లలాడించె నేరాజు
పటుశక్తి నుదయాద్రి పట్టణంబు

సాధించె నేరాజు చలపట్టి భుజబలో
ద్వల్లీలఁ బోరిమాఖిల్లపురము
కామలాపురభయంకర వప్రి మేరాజు
విక్రమక్రియరూఢి నాక్రమించె
గీ. నతఁడు తగు బద్దెవోల్ పట్టణాభిధాన
మాతృనామైకలక్ష్మమాంబాతటాక
వేంకటేశప్రతిష్ఠాదివివిధసుకృత
శాలి తిరువేంగళక్షమాపాలమాళి...... చాటుధార

ఈపద్యములనుబట్టి కొన్నిచారిత్రాంశములు తెలియవచ్చుటచే, కవికాలనిర్ణయముచేయుట కనువగుచున్నది. ఇంతవఱకు వ్రాయునప్పటికి, అనంతభూపాలకవి దానశాసన మొకటి లభించినది. దానినిబట్టి యాతనికాలము సులభముగాఁ దెలియుచుండుటచేతను నది తెలుఁగు పద్యములో నుండుటవలనను నాపద్యము నీక్రింద వ్రాయుచున్నాఁడను.

స్వస్తి.
శాకేఽర్ధాంబక * బాణభూపరిమితే వర్షేచ విశ్వావసౌ
వాన్నత్యేన చిరాయుషాచ గుణభాజా చంద్రితారంభవి
గుస్యానంతనృపేణ తేనజనకే నైవోటుకూరీరణే
ప్రాప్తస్సిద్ధవటీయ ముజ్వలశిలాసాలో విశాలకృతః

సీ. శాలివాహనశకవర్షములు వేయు
నేనూఁటయిరువదియేడు చనిన
విశ్వావసువసంగ వెలయువత్సరమున
సకలహిందూరాజ్యసార్వభౌమ
వీరవెంకటరాయవిభుండు చంద్రగిరింద్రి
సీమసామ్రాజ్యంబు సేయుచుండ
జంబులమడకభూపంగామజయుశాలి
కటకపురీచూరకారహారి

* శాకేశాంబక అని మూలములోనున్నది.

నందేలకృష్ణమనరనాథభయదాన
దక్షదోర్దండవిచక్షణుండు
అఖిలకర్ణాట సింహాసనాధీశ్వర
దక్షిణబాహాభిధానధారి
విదళితకొండారాజు వెంకటాద్రివిభుండు
చెన్నూరిహరణసంపన్న గృహుండు
విబుధస్తుతకటుత్థవిజయప్రబంధాది
కావ్యనిబంధన గ్రంథకర్త
శ్రీమదెల్లమరాజు చెరువుపేర తటాక
ఘటనానుభావసంఘటితయశుఁడు
ద్రవిడభూమధురాదిధాటీచలక్రియ
బలరక్షణాక్షీణబాహుబలుఁడు
పెనుగొండసమరయావనపాదుషాగర్వ
ఖర్వీకరణచణాఖర్వభుజుఁడు
రంగమాంబాకుమారవతంసరత్నంబు
పరభీకర బిరుదుల భాయిబండి
విమతావనీశ్వర వేశ్యాభుజంగుండు
బల్లరగండాంకభాసురుండు
మన్నెహంవీరుండు మగలరాయండు రాచ
బెబ్బులి పరరాజభీకరుండు
మల్లితిర్వెంగళమానవాధిపరత్న
రత్నాకరుండనంతరాజశౌరి
తమతండ్రి యల్లభూరమణుండు...
తిరుపతి రాజుపైఁ బెరిగికొట్టి
తనకత్తి మొనఁ దెచ్చుకొనినసిద్ధవటంబు
చెలగంగ తనపేరఁ జెరువుసేసె
హృదయముప్పొంగ సిద్ధవటేశ్వరునకు
ఔపచారికమైన సాలాంతరముగ

పురము చుట్టును వరణమై పరిణమింప
ధాత్రిఁ గట్టించె నాచంద్రతారకముగ.

ఈపద్యములో "కకుత్స్థవిజయ ప్రబంధాది కావ్యనిబంధన గ్రంథకర్తయని" యుండుటచే నీశాసనకర్త అనంతభూపాలకవి యనుటకు సందేహము లేదు. ఈపద్యములో చెప్పఁబడిన వీరవెంకట రాయలును, సవరము చిననారాయణనాయక కృతకువలయాశ్వ చరిత్రమునందుఁ గృతిపతి కేలికయగు వీరవెంకటరాయలును నొకఁడేనా ? భిన్నులా ? కువలాయాశ్వ చరిత్రమున యనంతభూపాలుని ప్రశంసకూడ కలదు. ఆతఁడీయనంతభూపాలుఁడేనా ? మరియొక యనంతభూపాలుఁడా? యను విషయములలో భిన్నాభిప్రాయము కలదు. కువలయాశ్వ చరిత్ర కృత్యాదియం దుదాహృతుఁడైన యనంతభూపాలుఁ డీతఁడు కాఁడ నియు నీతనిమనుమఁడైన కుమారానంతభూపాలుఁ డనియు ఆచార్య నేలటూరి వేంకటరమణయ్య పంతులుగా రభిప్రాయ పడినారు*. కాని యదిసరి కాదు. ఈయనంతభూపాలుఁడే కువలయాశ్వ చరిత్ర కృత్యాదియందు "తనకీర్తి మట్లనంతభూపాలనృపాల ముఖ్యగోత్రామ రేంద్రులు గొనియాడికొనఁగ" అని చెప్పఁబడియున్నాఁడు.

పై సీసమాలిక 8 వ చరణములో నుదాహృతుఁడైన వీరవెంకట పతిరాయలు కర్ణాటకరాజధానిని జంద్రగిరికి మార్చిన యాతఁడు వసు చరిత్రకృతిపతి యగుతిరుమలరాయలకు నాల్గవపుత్త్రుఁడు. ఈతని రాజ్యకాలము క్రీ. శ. 1585 మొదలు 1614 వఱకునైయున్నది.

నంద్యాల కృష్ణమరాజు కళాపూర్ణోదయ కృతిపతి. ఇతనికిని మట్లివారికిని యుద్ధములు జరిగినవి. అందీమట్లివారు జయముగాం చిరి. వీరును వీరవెంకటపతిరాయలును ఒకేపక్షములోనుండి శత్రుజయ మునుగాంచిరని Further Sourses of Vizianagar history అను గ్రంథములో నుదాహృతములైన కైఫియ్యతులవలనఁ దెలియు చున్నది. అందుఁ గొన్నిటినీక్రింద నుదాహరించెదను.

* భారతిసం 23 భాగము 1. పుట.216

"శాలివాహనశకం ౧౫౨౦ హేవిళంబి సంవత్సరమందు నంద్యాలకోటలో నంద్యాల శ్రీకృష్ణమరాజుగారు ప్రభుత్వము చేస్తూ వుండగాను చంద్రగిరి దుర్గమునుంచి వీరవెంకటపతి దేవమహారాయలు సైన్యముతో వచ్చి........."

అలవకొండ కైఫీయతు.

"తరువాత వెంకటపతిరాయలు పెనగొండలోనున్ను చంద్రగిరిలోనున్ను సింహాసనారూఢుడై రాజ్యం చేయుచుండగాను మల్లయల్లమ రాజుగారు వెంకటపతిరాయలవారి పక్షమై జంబుల మడకవద్ద నంద్యాల కృష్ణమ్మరాజుగారితో యుద్ధంచేసి కృష్ణమరాజుకు అభయం యిచ్చి, సిద్ధవటం యేలుతూవున్న కొండారాజు తిరుపతిరాజుగారు యీవూటుకూరుగ్రామానవుండగాను యల్లమరాజుగారు వారితో యుద్ధముచేసి జయించి సిద్ధవటం తమస్వాధీనం చేసికొనిరి."

ఊటుకూరు కైఫీయతు.

"తరువాత వీరవెంకటపతిరాయలు చంద్రగిరి దుర్గమందు రాజ్యభారం చెయ్యుచుండగాను సూర్యవంశోద్భవుడైన వెంకటాద్రిమ రాజు అనేఅతడు చిట్టివేల సంస్థానీకులవంశస్థుడు ప్రబలుడై విద్యానగరంయొక్క రాయపీఠస్థులయిన వీరవెంకటపతిరాయలు వారిపక్షం కలిగి, నంద్యాల కిష్టమరాజుతో జంబులమడుగువద్ద యుద్ధముచేసి; వీరలక్ష్మిని గైకొని నంద్యాల కిష్టమరాజును పట్టుకొని అభయం యిచ్చినారు.

సదరు వెంకటపతిరాజు తట్టునుంచి కొండాజ్రిజు తిరుపతిరాజు అనేవారు వుభయులున్ను సిద్ధవటమందు ప్రభుత్వం చెయ్యుచుండగా, చిట్టివేలు సంస్థానీకుడైన మట్ల యల్లమరాజుగారు, సదరు సిద్ధవటముసీమ యేలుతూవుండే కొండ్రాజు తిరుపతిరాజుగారితో వూటుకూరు గ్రామమువద్ద యుద్ధముచేసి జయించి సిద్ధవటం స్వాధీనం చేస్కున్నారు.

సిద్ధవటము కైఫియ్యతు.

ఇట్టి శ్లేషోక్తులు మట్లివారితో సంబంధించినవి యింకను జాల గలవు. గ్రంథగౌరవభీతిచే నిట నీయలేదు. ఈయుద్ధములలో తండ్రి యైన యెల్లమరాజుతో నీయనంతభూపాలుఁడుకూడ నుండెనని తలంప వలసియున్నది. పై సీసమాలికలో నుదాహృతములైన యుద్ధములు మొద లగువిషయము లీశ్లేషోక్తులవలన విశదముగాఁ దెలియవచ్చినవి.

ఈకవికాలము శ్రమపడనక్కఱలేకుండ నీపద్యశాసనమువలనఁ దెలియుచున్నది. ఇతఁడు పదునాఱవ శతాబ్దియందుఁ దుదిపాదమున బదునేడవశతాబ్దియందుఁ బ్రథమపాదమునను నుండెననుట నిశ్చయము.

కువలయాశ్వచరిత్రమును బ్రకటించిన సరస్వతీ పత్రికాధిపతు లీకావ్యమునుగూర్చి పీఠికలో నిట్లు వ్రాసియున్నారు. "మొత్తము మీఁదఁ గవిత్వము మిగుల ప్రౌఢమయి సలక్షణమయి రసాస్పదమనుట కేమియు సందియము లేదు. ఈగ్రంథమందలి కథయంతయు వ్రాసిన మూఁడుమాట లగును. అట్టికథను వర్ణనాచమత్కారముతోడను గల్పనా చమత్కారముతోడను బెంచెను. తెలుఁగున నాటకము వ్రాయు నలవాటు లేకపోవుటచేఁ గూడదని కాఁబోలు నాకాలమువా రందఱును వ్రాసినగ్రంథములు తఱచునాటకశైలిగనే యున్నవి. ఇందు లకు దారిచూపినవాఁడు పింగళి సూరన్నకవి. ఈకవికి సంస్కృతభాష యందలి పాండిత్యము మిక్కుటమైనదని కొన్నిప్రయోగములవలనఁ దెలియవచ్చుచున్నది. మాటలు కూర్చుటలోఁ గూడ నీతఁడు మిక్కిలి తెలివిగలవాఁడు. చిననారాయణు కల్పన కించుమించుగ సమకాలికుఁ డగు నీతని కల్పనలే కారణమని తోఁచుచున్నది. కాని తగవాతివాఁ డగుటచేఁ గాఁబోలు దీనికంటె నదియే యందముగానున్నది."

కకుత్స్థ విజయమునకును గువలయాశ్వ చరిత్రమునకును జాల విషయములలోఁ బోలిక లున్నవి. రెండును దాదాపుగ నొకేకాల మున జన్మించినవి. రెండును నైదాశ్వాసముల కావ్యములే. రెండును దాదాపుగఁ దొమ్మిదివందల పద్యములు గలవియే. రెండును గ్రంథ కర్తల తండ్రులకుఁ గృతియీయఁబడినవే. ఇరువురు గ్రంథకర్తలును దమ

తంత్రుల యాస్థానములయందుండెడి పండితులచే గీర్తింపబడి ప్రోత్సాహింపఁబడినవారే. రెండుకావ్యములయందును కథాభాగ మత్యల్పమును వర్ణనాంశము లధికముగాను నుండియున్నవే. రెండు కావ్యములును సంస్కృతపదబాహుళ్యము కలవియే. ఇరువురి కవిత్వమును ప్రౌఢమయినదియే. మనోహరమైనదియే. భావములు నూతనములై రెండిటియందును సరసహృదయానురంజకముగా నుండును.

అనంతభూపాలుని కవిత్వశైలి తెలియుటకై యాశ్వాసమున కొకపద్యము నుదాహరించి యీకవి చరిత్రమును ముగించెదను.

ఉ. ఎన్నటిమాట నీవెఱుఁగుదే తుహినాచల మాట మేనకం
గన్నులఁజూపి యంపసెగఁ గ్రాచిన కాకకుఁ జల్లఁచల్లఁదా
ర్కొన్నవిరాళినాటి వలిగొజ్జఁగినీటఁ జుమయ్య ధాత్రికిం
బన్నినకోడెకొండ యెడబాటునఁ దాల్చెఁ దదంశ మిప్పుడున్. ౧అ.

చ. పుడమిని నీవు రాజవయి పుట్టితి వెన్నఁడు నాటనుండియున్
గొడవలు కట్టిపెట్టి నినుఁ గొల్చిరి రాజులు కన్నదోయియున్
బడలక మించి యేకలహపారణమున్ వికసించుఁ దద్వ్యథన్
దడవులఁ బట్టి చూడనికతంబున మాసెఁజుమయ్య కీణయున్ ౨అ.

ఉ. హాలహలంబు మ్రింగె శశి సౌదలఁ దాల్చెఁ బ్రిసూన బాణువిం
గాలుని ప్రోలి కంచెఁ జలిగాలి భుజంగమభూషకోరలం
గూలఁగఁ ద్రోచె నీశ్వరుఁ డకుంఠిత దివ్యవిభూతిపేర్మి నా
ఫాలవిలోచనుం దలఁపు పంకజలోచన నీవు నావుఁడున్ ౩అ.

ఉ. పయ్యెదఁ బాఱఁజేయఁ గరపంకరుహంబులఁ జన్నుదోయికిన్
బయ్యెదఁజేయుఁ బోకముడిపట్టు వదల్చిన నండవాసినం
దొయ్యలిమేను గానఁబడఁ దోడనడాయఁగ గౌఁగిలించి రా
జొయ్యనఁ గామతంత్రకలనోదధిఁ దెప్పఁగఁ దేల్చునయ్యెడన్.

చ. గిరింథమెక్కి తమ్మలిదుగ్రేవ గిరిద్వయమట్లు దప్పులం
దురమునఁ దేరులై యొదవఁ దోఁబడి వాగులవచ్చులీలరాఁ
గురియఁగఁ దేరిమీఁదిపురికోటల కేతలదండకోటులన్
జెరిగిననింగిమేన వడిసెం బయి పైవరరక్తపూరమున్. ౪అ.

# 239 కవి చౌడప్ప



"కవిచౌడప్పా" యనుమకుటముతో నించుమించుగ రెండువంద లపద్యములు గలయీశతకమును చౌడప్ప కవియే వేమనశతకము వలె నాత్మసంబోధనముగ రచియించెనని చెప్పుదురు. కొన్ని పద్యము లలో కుందవరపు కవిచౌడప్పాయని యుండుటచేత నీకవి యింటిపేరు కుందవరపువారని యూహింపదగియున్నది. ఇతఁడు నియోగిబ్రాహ్మ ణుఁడని ప్రతీతి కలదు.

ఈకవియు, ఘంటనయను నింకొకఁడును మట్లె యనంత భూపా లుని యాస్థానమున హాస్యకళాధురంధరులై యుండెడివారని యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

ఉ. అన్నిట మంచివారు విమలాత్ములు హాస్యకళాధురంధరుల్
సన్నుత నీతిపాలకులు జాణలు నైపుణు లెవ్వరంటిరా
పన్నుగ మట్లనంతనరపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కినట్టి గుణవంతులు ఘంటనచౌడగాండ్రురా?...

ఈక్రిందిపద్యములనుబట్టి యీతఁడు బ్రాహ్మణుఁడనియు, ధక్కా వాక్య గౌరవము గలవాఁడనియుఁ దెలియుచున్నది.

ఉ. ఆసలఁ జేరిదుర్గుణగణాఢ్యుని దాత యటంచు వేఁడినన్
మీసము దువ్వుచున్ దిశలమీదున జూచుచు దుర్మదాంధుఁడై
వీసము నియ్యలేని పలుబిత్తగులాముకు కీర్తి చేరునా
భూసురవర్య! కుందవరభూషణ! చౌడకవీశ్వరోత్తమా!

శా. చొక్కం బైన సుధారసంపుఘుటికల్ చోద్యంబు నీపద్యముల్
సుక్కల్ బోవని గోస్తనీ ఫలతతుల్ శుంఠద్ధ్వవత్కావ్యముల్
నిక్కం బన్నిట,జాణ వౌదు భళి నీకెల్లప్పుడుం జెల్లు నీ
ధక్కావాద్యపుపద్దు కుందవరచౌడ శ్రీకవీంద్రోత్తమా!

ఈక్రింది సీసపద్యమువలన నీతఁడు కుందవరపు వంశీయుఁడనియు నాగధీమణి పుత్త్రుఁడనియు హాస్యకవియనియు, గానకళాప్రవీణుఁడనియు నెఱుంగనగును.

సీ. లోభికి సొడ్డులోయని కేక వేసినా
బ్రహ్మాండభాండంబు పగిలిపోవు
గట్టిగా నొకసారి లొట్టలు వేసినా
కుంభకర్ణుండు మేల్కొనఁగవలయు
కూర్చుండి యొకసారి కూతలు వేసినా
కుంభిని వ్రక్కలై కెరలినీల్గు
వెడగులోభినిబట్టి ...జూసినా
వరుస నింద్రియము లేమఁకబోరు

గీ. ననెడు గాంగేయకుందవరాన్వవాయ
హాస్యకవిజాణ గానవిద్యాప్రవీణ
నాగధీమణి సత్పుత్త్ర నయచరిత్ర
సకలసౌభాగ్య గుణధుర్య చోడయార్య.

ఈకవి చెప్పిన పద్యములలో ౧౦—౧౨ పద్యములుదక్క దక్కిన వన్నియు కందపద్యములే ? కందపద్యములను జెప్పుటలో నితఁడుతిక్కన సోమయాజితో సమానుఁడనని, యీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. మూఁడుగ చనుదినములలో
కందమునకు సోమయాజి ఘనుఁడందురు నే
డందఱు నను ఘనుఁ డందురు
కందమునకుఁ గుందవరపుకవి చోడప్పా

క. కందమునీవలె చెప్పడి
యందము మతిగాన మెవరియందున గవిసం
క్రందన యశదృశ నూతన
కందర్పా కుందవరపు కవిచోడప్పా

క. కందముల ప్రాశగణయుతు
లందముగాఁ గవిత నెంద ఉల్లరు విను నీ
కందంబులు రసవన్మా
కందంబులు కుందవరపు కవిచౌడప్పా

క. కందము లితరములు జనా
నందంబులు గావు వినఁగ నవరసఘటనా
నందంబులు నీకవితా
కందంబులు కుందవరపుకవిచౌడప్పా!

ఈక్రింది పద్యములో పుల్లూరి పట్టణగోపాలుని నుతించి యుండుటచే నీతని నివాసము పుల్లూరియైయుండునని తోఁచుచున్నది. ఇది యేమండలములోనిదో తెలిసినదికాదు. కడప మండలములో నున్నట్లు శతకకవుల చరిత్రకారులు వ్రాసియున్నారు.

క. శ్రీపతి పుల్లురి పట్టణ
గోపాలుఁడు సదయుఁడగుచుఁ గుంతీసుతులన్
గాపాడినటుల మిమ్ములఁ
గాపాడును కుందవరపు కవిచౌడప్పా

క. ఉండగనిచ్చును నీపై
పాండవపక్షమునిమీఁది పక్షము గోపా
లుండగు పుల్లురివాసుఁడ
ఖండితయశ కుందవరపుకవిచౌడప్పా!

ఈశతకము నీతిబోధక మైనది. కాని యిందుఁ గొన్నిపద్యములలో నసభ్యము లైన బూతుమాటలు ప్రయోగింపఁబడి యున్నవి. బూతుమాటలుండినగాని హాస్యరస ముప్పతిల్లదని కవి యాక్రింది పద్యములలో నుడివియున్నాఁడు.

క. పదినీతులు పదిబూతులు
పదిశృంగారములు గల్గుపద్యము సభలన్
జదివినవాఁడే సుధికుఁడు
గదరప్పా కుందవరపు కవిచౌడప్పా!

క. నీతుల కేమి యెుకించుక
బూతాడక దొరకు నవ్వుబుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా! కుందవరపు కవిచౌడప్పా!

శబ్దములలో బూతులున్నను బద్యములలో నీతులు దప్పవని యీక్రింది పద్యములోఁ గవి వక్కాణించెను.

చ. శరనిధి మేరదప్పినను, శంకరుఁ డిచ్చువరంబు దప్పినన్
సురగురు నీతిదప్పినను సూర్యుఁడు చంద్రుఁడు త్రోవదప్పినన్
పరుసతనాన రాఘవునిబాణము తప్పిన హాస్యగాండ్లలో
సరసుఁడు జాణ కుందవరచౌడనిపద్యము నీతితప్పునే.

నీతులున్నను బూతులుగల పద్యములను సహృదయులు పఠింలేరు. వాని నుదాహరించుటకు నా లేఖినియు ముందునకు పోఁగలేదు. కవితాశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిట వ్రాయుచున్నాఁడను.

క. తనయునికిని బరదేశికిఁ
జెనిమిటికిని నొక్కరీతి భోజనమిడు నా
వనితయె పుణ్యాంగనయని
ఘనులందురు కుందవరపు కవిచౌడప్పా!

క. పెద్దనవలె కృతిఁ జెప్పిన
పెద్దనవలె నల్పకవిని పెద్దనవలెనా
యెద్దనవలె మొద్దనవలె
గ్రద్దనవలె కుందవరపు కవిచౌడప్పా!

క. పరవిత్తము గోమాంసము
పరసతి తనతల్లియనుచు భావించినయా
నరుఁడు నరుండా రెండవ
కరివరదుఁడె కుందవరపు కవిచౌడప్పా.

క. నానీతి వినని వానిని
భానుని కిరణములు మీఁదఁ బొరనివానిన్

వానను దడియని వానిని
గానను రా కుందవరపు కవిచౌడప్పా.

ఈకవి మట్ల అనంతభూపాలుని కాలములో నున్నట్లు పైపద్యములవలనఁ దెలియుచున్నది. కాని యీశతకమునందేకల యీక్రింద నుదాహరించిన రెండు పద్యములలో మట్ల కుమారయనంతుని నామము దాహరింపఁబడి యుండుటనుబట్టి చూడఁగా నీకవి కుమారఅనంతుని కాలములోనివాఁడైనట్లు కన్పట్టుచున్నాఁడు. కకుత్స్థ విజయ గ్రంథ కర్తయగు మట్ల అనంతభూపాలున కీకుమారయనంత భూపాలుఁడు మనుమఁడై యున్నాఁడు. పైపద్యములలో 'కుమార' శబ్దము విడచిపెట్టినట్లు తలంపవలసియున్నది. లేదా చౌడప్పకవి యిరువురి కాలములలోను గూడ నుండియుండును.

క. మట్లకుమారయనంతుని
పట్లను వినయంబులేని ప్రభువులు మహినే
పట్లను చెడిపోదురు చే
కట్లనుబడి కుందవరపు కవిచౌడప్పా!

క. మీరినపగతుల మట్లకు
మారానంతుఁడు విక్రమార్కునిరీతిఁ
మారుకొనినఁ బోనియ్యఁడు
గా రణమున కుందవరపు కవిచౌడప్పా!

ఈచౌడప్పకవి తంజావూరు పాలకుఁడగు రఘునాథరాయని కాలములోఁ గూడనున్నట్లీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. నేరుతునని మాటాడఁగ
వారిజభవునంతవానికి వశమా తంజా
వూరిరఘునాథరాయని
గారెఱుఁగఁగఁ గుందవరపుఁ గవిచౌడప్పా.

ఇతఁడు మట్లి యనంతభూపాలుని యాస్థానమునందున్నట్లు చెప్పుకొనినను, ఒక్కసంస్థానమునందుండక యనేకసంస్థానములకుఁ బోయి

ద్రవ్యసంపాదనము చేయువాఁ డైనట్లీక్రింది పద్యమువలన నెఱుంగ నగును.

గీ॰ వానిఁగానియెడ శేషునికైనఁ దరమె
విడని వ్యభిచారిముండల వేరువిత్తు
యాచకవరుండు కుందవరాన్వయుండు
సరసవచనుండు నాగయచౌడఘనుఁడు

సీ. పరకాంతపై మదిపారకుండఁగ నిల్చు
వాఁడొక దేవుఁ డివ్వసుధలోనఁ
దనద్రవ్యాలు తప్పైనఁ దప్పక నడచిన
వాఁడొక దేవుఁ డివ్వసుధలోన
నొరులకక్కఱకొద్ది నుపకారములు సేయు
వాఁడొకదేవుఁ డివ్వసుధలోనఁ
జలపట్టుముండల్ని చాడీలు వినసట్టి
వాఁడొకదేవుఁడివ్వసుధలోన
ననుచు బుధులెంచు వాక్యములు వినవె
రాజిలోపాయ కుందవరంబురాయ
హాస్యకవిజాణ గానవిద్యాప్రవీణ
నాగధీమణి సత్పుత్త్రి నయచరిత్ర.

కుమార అనంతభూపాలుఁడు క్రీ. శ. ౧౬౦౦ మొదలు ౧౬౫౬ వఱకు రాజ్యముచేసినవాఁడు కావున నీచౌడప్పకవియు నాకాలము వాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. రఘునాథరాయలు తంజావూరు రాజ్యమును, క్రీ. శ. 1614—1633 నడుమ పరిపాలించినవాఁడు. కవి చౌడప్ప 1580—1640 నడుమ నున్నవాఁడని నిర్ణయింపవచ్చును.

ఈకవి కవిత్వశైలి తెలియుటకుఁ బైని నుదాహరించిన పద్యములు చాలునని తలంచితిని. ఇతనితో జతగాఁడైన ఘంటన చారిత్రమేమియుఁ దెలిసినది కాదు.

---

# 240 ఉప్పుగుందూరి పెరియన్న కవి



ఈకవి మీనకేతనాభ్యుదయ మను నొక శృంగార ప్రబంధమును రచియించి యార్వీటి పెదవెంకటరాయల కంకితము చేసెను. ఇది ముద్రితము కాలేదు. అసంపూర్ణముగ నున్న రెండు వ్రాంతప్రతు లాంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమున నున్నవి. గ్రంథము మొత్త మెన్ని యాశ్వాసములో తెలియరాలేదు. ఈక్రింది గద్యమును బట్టి యీతఁడు వైదికబ్రాహ్మణుఁడనియు, వెంకటకవి సింగమలకుఁ బుత్త్రుఁ డనియు, సకలసత్కవి వేశ్యాభుజంగ బిరుదాంచితుఁడనియు, దెలియు చున్నది. ఈతని భార్యపేరు కోనాంబ.

"ఇది శ్రీమత్కామాక్షీపదాంభోజ పూజానుభావ ఫలిత సకల సత్కవి వేశ్యాభుజంగబిరుద ఉప్పుగుందూరి సింగమాంబా వేంకటకవి పుత్రి కోనాభిధాన కళత్ర పెరియన్న నామధేయకవి ప్రణీతం బయిన మీనకేతనాభ్యుదయంబు"

కామాక్షీభక్తుఁడనని చెప్పుటచేతను పెరియన్న యనుపేరును బట్టియు నీతఁడు కాంచీపురప్రాంతమువాఁ డనితోఁచుచున్నది. మట్లి యనంతభూపాలకవి యాస్థానమున నుప్పుగుందూరి వెంకటకవియున్న ట్లాతని కకుత్స్థ విజయమునుబట్టి తెలియుచున్నది. ఆతఁడీ కవికిఁ దండ్రియేయని తోఁచుచున్నది ఈకవితండ్రికూడఁ గవియగుటచే నీయి ద్దువురు వెంకటకవులును ఒక రేకావచ్చును.

ఇతఁ డీకావ్యము నార్వీటి పెదవెంకటరాయలకుఁ గృతియిచ్చె నని పైన వ్రాసియుంటిమి. ఈపెదవెంకటరాయలు అళియరామరాజుల మనుమఁడైనట్లే క్రింది పద్యములలో గవి చెప్పియున్నాఁడు.

చ. అనఘుఁడు కృష్ణరాయలకు నాత్మజయై తగు తిర్మలాంబుజా
ననకును నల్లురామనరనాథునకున్ జనియించి రాత్మజుల్
మనునయనై పుణీధనులు మానకళాకలనాసుయోధనుల్
ఘనుఁడు కుమారకృష్ణ మహీకాంతుఁడు తిమ్మధరాబిడౌజుఁడున్

చ. వరమునఁ గాంచె రామనృపవర్యుఁడు కొండమదేవియందు సు
స్థిరతరశౌర్యశౌరి యగుతమ్మనృపాలుని గొండమేదినీ
శ్వరమణి లక్ష్మమాంబయను జవ్వనియం దరవిందమందిరా
వరచరణాంబుజభ్రమరవల్లభుఁ జిన్నసిరంగభూవిభున్

చ. మనముల రామలక్ష్మణుల మాత్సవిభేదము నామభేదమున్
వినిచను నే యటంచుఁ బెదవేంకటరాయలు చిన్నవెంకటా
వనిపతి నా జనించి రనవద్యయశోవిజితాజరాజభో
జనులయి లక్ష్మమాంబ యనుసాధ్వికిఁ జిన్నసిరంగ శౌరికిన్.

ఈపెదవేంకట రాయలు పెనుగొండ యుద్ధమున జయముఁగాం దిన ట్లీక్రిందియాశ్వాసాంత పద్యమువలనఁ దెలియుచున్నది.

క. ఘనబలదుర్ధమరిపుమ
ర్ధన నగకోదండమూరురాయరగండా
పెనుగొండ సమరమొరుసక
తనుఖండనచండ బాహుదండోద్దండా!

అళియరామరాయల కయిదవ కుమారుఁ డైన శ్రీరంగరాయని కీపెదవెంకటరాయలు కుమారుఁ డగుటచే రామరాయలు చనిపోయిన క్రీ.శ. ౧౫౬౫ వ సంవత్సరమునాటి కీతఁడు జన్మించియుండెనని తలంచి నను పదేండ్లలోపు బాలుఁడై యుండును. కావున నీపెరియన్నకవి, ౧౬౦౦ ప్రాంతములో నీకావ్యమును రచియించియుండునని తలంప వచ్చును. మట్లే అనంతభూపాలునిఁ బట్టి చూచినను నీకాలము సరి యైనదిగనే కన్పట్టుచున్నది.

# 241 కంచి వీరశరభకవి

ఇతఁడు శివభక్తిపరాయణుఁడైననియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబ సూత్రుఁడు; కాశ్యపస గోత్రుఁడు; శోభనాద్రి గురవమాంబలకుఁ బుత్త్రుఁడు; వీరభద్రామాత్యునకుఁ బౌత్త్రుఁడు; శంకరామాత్యునకుఁ బ్రపౌత్త్రుఁడు; ఈవంశమునకుఁ మూలపురుషుఁడు తిమ్మయామాత్యుఁడు. వీరభద్రుఁడు, సూర్యమంత్రి, అయ్యనమంత్రి ననుమువ్వురీకవికి సోదరులు. ఈకవి హరిశ్చంద్రోపాఖ్యాన మను నైదాశ్వాసముల ప్రబంధమును రచియించి, శ్రీశైల మల్లికార్జునస్వామికిఁ గృతి యొసంగెను.

శ్రీపతి పండితారాధ్యుని వంశములోనివాఁడగువీరనారాధ్యుఁడు తనకు మాతామహుఁ డని యీక్రింది పద్యములోఁ గవిచెప్పియున్నాఁడు.

సీ. మహనీయబహుశైవమంత్రి సానారత్న
కవితపాదోధి సంకాశు లనఁగ
వివిధోగ్రతరదుర్వివేకభూరిధ్వాంత
చటులభాస్కరరుచిస్వాంతు లనఁగ
మదనారి పదపద్మమకరంద రసపాన
మానితమధుపాయమాను లనఁగ
వాదిసింహాసనాధ్యక్ష వైభవరూఢిఁ
దపనీయగిరిరాజధైర్యు లనఁగ

తే. నమరు శ్రీపతిపండితారాధ్యవంశ
మణిగణశ్రేష్ఠు ననవద్యగుణవరిష్ఠు
ధన్యమూర్తి మదీయ మాతామహునిని
వీరనారాధ్యుఁ బ్రణుతింతు వివిధగతుల.

ఈవీరనారాధ్యుఁడు ధర్మగుప్తాభ్యుదయము, భద్రాయుశ్చరిత్రము నమగ్రంథములను రచించిన కాశీనాధుని వీరారాధ్యుఁ డేమో

యని మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార సంపాదకులు వ్రాసి యున్నారు. అది సత్యమును కావచ్చును. కాని యాతఁడే యాతఁడనుటకుఁ దగిన యాధారములు దొరకలేదు. కాశీనాథుని వీరారాధ్యుఁడు, తాను శ్రీపతిపండితారాధ్యుని వంశములోనివాఁడనని చెప్పు కొనియున్నమాట వాస్తవము. కాని యంతమాత్రమున నీయిరువురు నొక్కరేయని నిశ్చయముగాఁ జెప్పలేము. వీరశరభకవి పైపద్యములోఁ దనమాతామహుఁడు కవియనిగాని గ్రంథరచన మొనర్చెనని గాని చెప్పియుండలేదు.

ఈకవి తనగురు వైన ఇవటూరి పర్వతారాధ్యుల నీక్రింది పద్యములో స్తుతించియున్నాఁడు.

తే. వరమశైవ ప్రభావసంపన్ను లగుచు
ధరణిఁ జెలువొందు మర్త్యుల గురువరేణ్యు
లనఘు లివటూరి పర్వతారాధ్యముఖ్యు
జనుల సేవింతు సద్భక్తి ననుదినంబు.

గౌరనమంత్రి ద్విపదకావ్యము ననుసరించి యీవీరశరభకవియు శంకరకవియును హరిశ్చంద్రోపాఖ్యానమును బద్యకావ్యములుగా రచియించియుండి రని గౌరనమంత్రి చారిత్రమున వ్రాసియున్నాఁడను. ఈకవులిరువురిలో నెవరు ప్రాచీనులో నెవరర్వాచీనులో చెప్పఁజాలము. కాని వీరశరభకవి వ్రాసిన యీక్రిందివాక్యములను జూచినచో శంకరకవియే మొదటనీగ్రంథమును రచియించినట్లు కన్పట్టుచున్నది.

"మున్ను ధరిత్రీమండలంబునఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన విధంబున భానువంశపయోధి సుధాకరుం డగు హరిశ్చంద్ర మహాసార్వభౌమోత్తము సద్గుణసంఘాతంబు లెక్కింప విధాతకైన శక్యంబు గాదని మనంబున గణియించి యందందుఁ గొందఱుఁ కవిజనోత్తము లందంబు వాటిల్ల రూపించి, తమమోపిన విధంబుతోడ ననవద్య గద్య పద్యాధిక ప్రబంధబంధురంబుగా రచియించిన తెలుంగుకంటె మెఱుంగు వెట్టినట్లు భవ్యం బగు నిమ్మహాకావ్యంబు నిర్విఘ్నకరంబుగా"

హరిశ్చంద్రకథ భారతారణ్య పర్వమునందును, మార్కండేయ పురాణమునందును బురాణశైలిలో వర్ణనాంశములు లేకుండఁ జెప్పఁబడి యున్నది. గౌరనమంత్రి ద్విపదగాఁ జెప్పియున్నాఁడు. కాని గద్య పద్యములలోఁ జెప్పలేదు. కావున పైని వ్రాసిన వచనములోని "గద్యపద్యాధిక ప్రబంధబంధురంబుగా" నను వాక్యములు శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునకే వర్తించునని తలంపవలసియున్నది. అందు "కొందఱు" అని చెప్పియుండుటచేత మార్కండేయ పురాణాదులకుఁ గూడ పైవాక్యములన్వయించునని చెప్పినను శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునకు తప్పక వర్తించునని యూహించుట సమంజసము. చంద్రమౌళి కవికూడ నిందుఁ జేరవచ్చును. కావున శంకరకవికంటె నీవీరశరభకవి నవీనుఁడని చెప్పఁదగియున్నది. ఈయూహ నిజమైనయెడల, శంకరకవి పదునాఱవ శతాబ్దియందలి వాఁడని చెప్పియున్నాము. కావున నీవీరశరభకవి పదునాఱవ శతాబ్దియందుఁ దుదిభాగముననో, పదునేడవ శతాబ్దియందుఁ బ్రథమార్థముననో ఉన్నవాఁడని తలంపవచ్చును. ఈతనిగురువైన ఇవటూరి పర్వతారాధ్యుఁడు బమ్మెర కేసకవి మల్లకవులకుఁగూడ గురువై యున్నాఁడు కావున నీశరభకవి యీకవులతో సమకాలికుఁడని నిశ్చయింపవచ్చును.

ఈకవి యెచ్చటివాఁడో తెలిసికొనుట కాధారము లేమియు దొరకలేదు. కవి తనవంశావళిని పదిపద్యములలోఁ జెప్పియున్నాఁడు. కాని యందు చారిత్రోపయోగములగు నంశములు లేవు. ఈతని గృహనామ మేదియో గ్రంథమునుబట్టి తెలియరాలేదు. కాని యీతనిని కంచి వీరశరభకవియని చిరకాలమునుండి వాడుచున్నారు. బ్రౌను పండితుఁడు "Veerasarabhakavi of kanchi" అని వ్రాసియుండుటచే నీతఁడు కంచినగరవాస్తవ్యుఁడేమో యని యూహకలుగుచున్నది.

అంతకుఁ బూర్వము రచించిన వారికంటె మెఱుంగు వెట్టినట్లు తా నీకావ్యమును రచించెదనని కవి చెప్పియున్నాడు. కాని శైలియందు శంకరకవి కవిత్వముకంటె నధిక మిందేమియుఁ గన్పట్టలేదు. ఈతని

కవిత్వశైలి తెలియుటకై హరిశ్చంద్రోపాఖ్యానము నందలి యైదాశ్వాసములనుండియు నైదుపద్యముల నిక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

చ. పురుషవరేణ్య మున్ను చనిపోయిన మానవనాథకోటిలో
గురుతర రాజ్యసంపదలు గోల్పడి ఘోరవిపత్పరంపరం
దిరిగి జగంబెఱుంగ ఘనదీనతలారడిఁ బోవఁ జేసి క
మ్మర ధరయేలినట్టి జనమాన్యుఁ డొకండు గలండె తెల్పుమా! ౧ఆ.

ఉ. ఆడఁగఁబోవు తీర్థమెదురైన తెఱంగున రంగు మీఱు నీ
జాడ సమీపమందు విలసత్ఫలబృంద తపోవనంబునం
దీడొకఁడైన జాలనిమునీంద్రుఁడు మద్గురుఁ డవ్వసిష్ఠుఁడు
న్నాఁడు తదీయ దివ్యచరణంబులకుం బ్రణమిల్లఁగాఁ దగున్. ౨ఆ.

మ. తలపన్నెన్నఁడుఁ బాసినంతనిమిషార్ధంబైనఁ బ్రాణంబులో
నిలువంజాలన నేకజన్మముల నిర్నిద్రక్రియారూఢి చే
విలసద్భక్తి వహింపఁ బెంపుగొన నీ వేభర్తగాఁ గోరిని
ర్మలచిత్తంబున నిమ్మహానలముఁ జేరంబోదు మున్మాటికిన్. ౩ఆ.

శా. స్వర్గారోహణసాధనంబఖిల భాస్వద్భూరికైవల్యస
న్మార్గంబద్భుతతీర్థసారమతులామ్నాయాంత విఖ్యాతమీ
భర్గాధీనము సిద్ధసేవ్యము మహాపాపౌఘఘోరాటవీ
వర్గస్ఫారకుఠారధారయగు నీవారాణసీక్షేత్రముల్. ౪ఆ.

ఉ. మానితపుణ్యసాధ్విగరిమంబున చంద్రమతీలతాంగి స
న్మానముమీఱ లోహితకుమారుని కేలొకచేతఁ బూనియా
మానవనాథు వెంట ననుమానముమాని పరిశ్రమార్తిదీ
నాననమేర్పరింపనడుగామడగా జనుచుండె నయ్యెడన్. ౩ఆ.

---

## 242 బమ్మెర కేసకవి - మల్లకవి

ఈకవులిరువురును సోదరులు; సుప్రసిద్ధకవిశేఖరుఁడై శ్రీమహాభాగవతమును రచించిన బమ్మెర పోతనామాత్యుని ప్రపౌత్రులు; మల్లయామాత్య పౌత్రులు: ప్రౌఢసరస్వతియొక్క తనయులు. ఈకవులు దాక్షాయణీ పరిణయమను ప్రబంధమును రచియించి, ఆచంట నివాసుఁడగు గురుజాల మల్లన సోమయాజికిఁ గృతినొసంగిరి. ఈగ్రంథము ముద్రణము నందలేదు. తాళపత్రప్రతియొకటి తమయొద్దనున్నదని శ్రీ వీరేశలింగముపంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రమున బమ్మెర పోతనామాత్యుని చరిత్రమునందు వ్రాయుచు నందలి కొన్ని పద్యముల నుదాహరించియున్నారు. ఈదాక్షాయణీ పరిణయమును జూడవలయునని నేనెంతయో ప్రయత్నించితిని కాని నాకది లభింపలేదు. ఈకవులు విష్ణుభజనానంద మనుమతియొక ప్రబంధమును రచియించి, పినుమెత్స నారభూపాలున కంకితము చేసియుండిరి. అదియు ముద్రితము కాలేదు కాని దానియముద్రిత ప్రతియొకటి మ.ప్రా.పు. భాండాగారమున నున్నది.

దాక్షాయణీ పరిణయమందలి యీక్రిందిపద్యమువలనఁ బోతనామాత్యున కీకవులు పౌత్రులయినట్లు కన్పట్టుచున్నది.

చ. నెరిగుణశీగల్గు నన్నయమనీషినిఁ దిక్కన శంభుదాసునిన్
బరువడి మత్పితామహుని బమ్మెరపోతన భాస్కరాహ్వయున్
వరకవి సార్వభౌముని నవారితభక్తి నుతింతు మెప్పుడున్
గురుకరుణాఢ్యు లంధ్రకవికుంజరులం దగభూతిశోభిలన్.

ఈపద్యమునందుఁ గవులు పోతనామాత్యునిఁ దమపితామహుఁడని చెప్పుకొనియున్నను, ఈక్రింది గద్యమునుబట్టి పోతనామాత్యునకుఁ బౌత్రులుగాక ప్రపౌత్రులని స్పష్టమగుచున్నది.

"ఇది శ్రీమద్భవానీశంకర పర్వతాలగురు ప్రసాదాసాదిత సారస్వత బమ్మెరకులపవిత్ర కౌండిన్యమునిగోత్ర పోతయామాత్యపౌత్ర యల్లయామాత్య పుత్త్రి సంస్కృతాంధ్రభాషా కవితాధురీణతాబుధ

విధేయ ప్రౌఢసరస్వతీ వరతనూభవ కేసకవిమల్లకవినామధేయ ప్రణీతం బైన విష్ణుభజనానందం బను మహాప్రబంధంబునందుఁ"

ఈ గద్యయందలి 'పోతయామాత్యపౌత్ర, యల్లయామాత్య పుత్త్ర'యను విశేషణములు కేసకవి,మల్లకవులతండ్రియైన 'ప్రౌఢసరస్వతి కన్వయింపవలసియున్నది. అట్లు చేసినచో నీకవులు పోతనామాత్యున కుఁ బ్రపౌత్త్రులని తేలుచున్నది. అట్లన్వయించుట కూడదనియు, 'ప్రౌఢసరస్వతి' యనుశబ్దము కేసకవికి బిరుదమనియు, గద్యయందలి "వరతనూభవ" యనుశబ్దము ప్రక్షిప్తమనియుఁ గొందఱు వాదించుచుఁ దమవాదమున కనుకూలముగ నున్నదని అగ్గరపు పేరయలింగకవి రచిత మైన యొడయనంబి విలాసకృత్యాదిలోని యీక్రింది పద్యము నుదాహరించుచున్నారు.

ఉ. బమ్మెరవంశమందునను బ్రౌఢసరస్వతిపద్దుఁ గాంచి తా
నెమ్మె దలిర్పఁ గేసనకవీశ్వరు లప్పమనావ పొందిగాఁ
దిమ్మహిఁ గూర్మిఁ గన్నసుత రెల్లమయందును బేరయాఖ్యుఁడ
న్నమ్మతిఁ గంటి వీరనరసమ్మను గంగనమంత్రియుగ్మముఁ.

ఈపద్యమునుబట్టి కేశవకవికిఁ బ్రౌఢసరస్వతిపద్దు (బిరుదము)న్నట్లును, అతనిభార్య అప్పమయనియు, ఆదంపతుల మాఁతురగు నెల్లమ్మను దాను పరిణయమై యామెయందు వీరనరసమ్మ అను తనయను గంగయనామధారు లగు నిరువురు తనయులను దాను గంటిననియుఁ బేరయలింగము చెప్పినట్లు తెలియుచున్నది. ఈపద్యము ప్రతిపక్షుల వాదమును సమర్థించుచున్నట్లు స్థూలదృష్టికిఁ గాన్పించును. ప్రౌఢసరస్వతియనుశబ్దము ఒకవ్యక్తియొక్క పేరుగా భావించుటకంటె నొకకవి కీయబడిన బిరుదముగా నెంచుట సమంజస మనుమాటకూడ సత్యమనియే యంగీకరింపక తప్పదు. ఇవియన్నియు నాలోచింపఁగా నీజంట కవులు పోతనామాత్యుని పౌత్త్రులనువాదమే బలవత్తరముగాఁ గన్పట్టుచున్నది.

ఆయినను నంతమాత్రమున నావాద మంగీకరింపదగినది కాదు. పైపద్యములోని కేసకవికిఁ బ్రౌఢసరస్వతి యను బిరుదమున్నదియని

యంగీకరింతము. కాని యీ కేసనకవి యొక్కరో ఆపద్యము చెప్పుట లేదు. కేసకవి యనునది నిజనామము. ప్రౌఢసరస్వతి బిరుదనామము. అనిమాత్రము దానివలన మనకుఁ దెలియుచున్నది. ఈజంటకవులు రచించిన విష్ణుభజనానందములోని యీక్రింది పద్యమువలన నాసంశయ మంతయు విడిపోవుచున్నది.

సీ. శ్రీరామలింగాంఘ్రిసేవాపరప్రౌఢిఁ
  కవితాచమత్కృతుల్ గాంచువారి
అప్పలమ్మయును వీరాంబయుఁ బ్రౌఢస
  రస్వతికిని గన్నప్రజ్ఞవారి
కౌండిన్యగోత్రవిఖ్యాత బమ్మెరవమ్య
  వంశాఢ్యులై నీతివరలువారి
ఇవటూరి ముక్తినాగేశసద్గురుభక్తి
  నాదిమశైవులై నట్టివారి
కేసకవి మల్లకవి నామకీర్తిపరుల
మమ్ముఁ బిలిపించి మన్నించి మదిగుణించి
ఘనతనుచితాసనంబుల నునిచి వేడ్క
వినయనయవాక్యములఁ జేత మెనయఁ బలికె.

ఈపద్యమువలన కేసకవి మల్లకవుల తండ్రిపేరు ప్రౌఢ సరస్వతి యనియు నాతనికిరువురు భార్యలనియు నందుఁ గేసకవితల్లి అప్పలమ్మ యనియు, మల్లకవితల్లి వీరాంబయనియు స్పష్టమగుచున్నది.

ప్రౌఢసరస్వతియొక్క నిజనామము కేసనకవియనియు, నాతని భార్య అప్పలమ్మయనియుఁ, అప్పలమ్మకూఁతురు యెల్లమ్మ తనభార్య యనియుఁ బైపద్యములోఁ బేరయలింగము మనకుఁ జెప్పియేయు న్నాఁడు. ఈజంటకవులు పైసీసపద్యములో దమతండ్రి నిజనామమును జెప్పక బిరుదనామమును మాత్రమే చెప్పిరని మన మూహింపఁ దగి యున్నది. కేసకవియను నామము తండ్రికిని కుమారునకును గూడ నుండునా ? యని సంశయింపనక్కరలేదు. అట్టివి చాలఁగలవు.

పోతనామాత్యుని కుమారుఁడు మల్లయ. అతనికుమారుఁడు ప్రౌఢసరస్వతియని బిరుదముగల కేసనకవి. అతనికుమారులు కేసకవి, మల్లకవి. వీరుపోతనామాత్యునకుఁ బ్రపౌత్రులగుదురు కాని పౌత్రులుకారు. తండ్రి కుమారుల నామము లొక్కటియే యగుటచే లోకమనేక విధముల భ్రమఁజెందినది.

ఈజంటకవులు తమతండ్రి ప్రౌఢసరస్వతియని మఱియొక పద్యములోఁ గూడఁ జెప్పియున్నారు. ఆపద్యము నీక్రింద నుదాహరించుచున్నాఁడను. గద్యయందలి "నరతనూభవ" శబ్దము ప్రక్షిప్తము కాదని యీరెండు పద్యములవలన స్పష్టమగుచున్నది.

ఉ. చెప్పెఁ గృతుల్ సుధారసము చిపిల్ప మీజనకుండు రూఢి చె
ల్వొప్పఁగ శబ్దశుద్ధిగ మహోన్నతిఁ బ్రౌఢసరస్వతీంద్రుఁ డా
చొప్పున మీరలున్ గృతులు చోద్యముగా రచియింపనేర్తు గా
యెప్పుడుఁ గేసనత్కవి సమిద్ధగుణాకర మల్లసత్కవీ!

ఈప్రౌఢసరస్వతి యేమయిన గ్రంథములను రచించెనేమో తెలియదు. పోతన కుమారుని పేరు యల్లయయని విష్ణుభజనానందమునందున్నది. మల్లయయని దాక్షాయణీ పరిణయమునందున్నది. మల్లయయని పూర్వమునుండియు జనశ్రుతి కలదు. ఆమల్లయపేరే ప్రౌఢసరస్వతి తనకుమారునకుఁ బెట్టియుండును.

పోతనామాత్యుని నివాసము నిజామురాష్ట్రములోని బమ్మెర. ఆతని కుమారుఁడో మనుమఁడో గోదావరి మండలమునకు వచ్చియుందురు. కేసకవి మల్లకవులు ఆచంట నివాసముగాఁ జేసికొని యుండవచ్చును. ప్రౌఢసరస్వతి తనకుమార్తెను అజ్జరము గ్రామనివాసుఁడైన పేరయలింగకవి కిచ్చియుండెను. కేసకవి మల్లకవులు గోదావరి మండలమునందలి తణుకుతాలూకాలోని రేలంగి వాస్తవ్యుఁడైనపెనుమత్స నారభూపతికి విష్ణుభజనానందము నంకితము చేసియుండిరి. ఆచంట, అజ్జరము, రేలంగి గ్రామములు ఒకదానికొకటి నాతిదూరస్థములై యున్నవి. రేలంగి గ్రామమున పెనుమెత్సవారు క్షత్రియులిప్పుడు నున్నారు. మదనగోపాలస్వామి యాలయము నున్నది. ఇది గోస్త

నీనదీతీరము, ఈతీరమున విశ్వామిత్రి యజ్ఞవాటిక కలదు. అందలి దక్షిణాగ్నిలో నొక దేవత యుదయించినదని చెప్పుదురు. ఆమెపేరు మంటలమ్మ.

కేసకవి మల్లకవులు శైవులయినట్లు పైపద్యములో నున్నది. వీరిగురువు పర్వతాలయినట్లు గద్యలో జెప్పఁబడినది. పైనివ్రాసిన సీసపద్యములో ఇవటూరి ముక్తినాగేశ్వరారాధ్యులైనట్లున్నది. విష్ణు భజనానందములోని యీక్రింది పద్యమువలన ఇవటూరి గుర్వారాధ్యులు గురువులైనట్లు చెప్పియున్నారు. మొత్తముమీఁద వీరుమువ్వురునుగూడ గురువులైయుందురు.

క. ఇవటూరి గుర్వగురవే
కవివరబుధబంధుశిష్య కల్పకతరవే
భవవత్త్రిలోకగురవే
శివదప్రభవే నమోద్విజేంద్రప్రభవే.

ఈకవులు శైవులమని చెప్పుకొనినను, వైష్ణవద్వేషములేనివారని విష్ణుభజనానందమే సాక్ష్యమిచ్చుచున్నది. ఈగ్రంథమున విష్ణుసేవామాహాత్మ్యము వర్ణింపబడినది. ఇది యాఱాశ్వాసముల గ్రంథమైనట్లు కన్పట్టుచున్నది. మదరాసు పుస్తకభాండాగారమున నాల్గాశ్వాసములును నైదవయాశ్వాసమునఁ గొంతవఱకును గలదు. ఈకవులు తిరుమల వెంగళాచార్యుని యీక్రిందిపద్యములోఁ గీర్తించియున్నారు. ఇతఁడు కూడ నీకవులకు గురువేమో!

సీ. శ్రీవెంకటేశరాజిత పాదరాజీవ
మానితానుధ్యాన మానసుండు
వేదశాస్త్రపురాణ విద్యానవద్యత
ద్రావిళగ్రంథసందర్భవర్తి
అతులితరామానుజాచార్య నిర్మిత
మతసముద్ధరణైక చతురమూర్తి
వర్ణితాష్టాక్షరీ ద్వయమంత్ర శిష్యోప
దేశప్రసిద్ధసుస్థిరయశుఁడు.

గీ. ద......ధాత్రి సకలవిద్వద్వరేణ్య
వినుతవిద్యామనీషావివేకశాలి
తిరుమల శ్రీనృసింహార్య వరసుతుండు
సరసగుణపాళి వెంగళాచార్యమౌళి.

విష్ణుభజనానందమునఁ గృతిపతి వంశవర్ణనము నించుమించుగ నూఱుపద్యములలోఁ జేసియున్నారు. కృతిపతి పూర్వులలో నొకఁడగు పెనుమత్స వెంకటాద్రి "ఇందుమతీ పరిణయమను ప్రబంధమును రచియించినట్టును, గోపరాజను నాతఁడు అంతర్వేదీ మాహాత్మ్యాది కృతులను రచియించినట్లును కవులు కృత్యాదియందు వర్ణించియున్నారు పెనుమెత్స అనంతరాజను నాతఁడు అంబరీషచరిత్రాదులను గృతినందిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నారు.

సీ. ర్యాలికేశవునకు ప్రాకారగృహగోపు
రములు కట్టించె నభ్రంకషముగ
గృతి నంబరీషచరిత్రాది గాఁగల్గు
కృతులందుకొనె చమత్కృతిచెలంగ
తీవిలోమ భయగోదావరీ మధ్యభూ
స్థలమున నారామసమితి నిలిపె ... ... ...

గీ. ననఁగ విలసిల్లె రామసింహాసనాది
సకలదిగ్దేశభూవరాస్థాన సభిక
నికరవచనౌఘపరిగణనీయధర్మ
సంతతవిహారి పెనుమెచ్చనంతశౌరి.

పెనుమెత్స బొడ్డువెంకటరాజు కుమారుఁడైన పెదఅప్ప భూపతి కుతుబ్ శాహావలన బహుమతులనందియున్న ట్లీక్రింది పద్యములోఁ గవివర్ణించియున్నాఁడు.

సీ. కుతుపశాహాభూపకుంజరుచేఁ దాళి
చౌకట్లు నాన్లగల్ సరవినందె.

గీ. కవితపెనుమెచ్చబొడ్డు వేంకటనృపాలు
పుత్త్రుఁడైనపెదప్పనభూవరుండు.

ఈపెదయప్ప భూపతి కృతిపతికి దూరవృదాయాది. గోలకొండ రాజ్యమును బరిపాలించిన కుతుబ్‌షా మహమ్మదీయ ప్రభువులలో మొదటివాఁడు కూలీకుతుబ్ శాహా. ఇతనివంశీయుల నామముల దుదను కుతుబ్ శాహా యని చేర్చుచుండుట ఆచారమగుటచే నీకుతుబ్ శాహా పదమునుబట్టి కవుల కాలనిర్ణయముచేయఁబూనుటలో ప్రమాదము కలుగవచ్చును. కవుల కాలమును దెలిసికొనుటకు వేఱొకయాధారము గన్పట్టుచున్నది.

దాక్షాయణీ పరిణయమును గృతినందిన గురుజాల మల్లనసోమయాజి యొక్క మనుమని మనుమఁడైన పేరయమంత్రికి బోదూరి పెద్దరామామాత్యుఁడు దాక్షాయణీ పరిణయమును తాళపత్రములపై వ్రాసియిచ్చిన ట్లీక్రిందిపద్యములో వ్రాసియున్నాఁడు.

సీ. ధాతాఖ్యయుజకృష్ణదశమీందువారంబు
వఱకు దాక్షాయణీపరిణయంబు
తత్కృతినాథుఁడై తనరిఁ గురుజాల
చినమల్లసోమయాజికిఁ దనూజుఁ
డగు లింగఘనసుతుఁ డైనట్టియజ్ఞస
త్ప్రభునకుఁ దనయుఁడౌ పార్వతీశ్వ
రునకుఁ దిమ్మమకుఁ బుత్రుఁడయి షోడశ
మహాదానముల్సప్తసంతానములును
జేసి వంశవర్ధనుఁడయి సిరుల వెలయు
పేరమంత్రీశ్వరునకుఁ బోదూరిపెద్ద
రాముఁ డెనుబదిసంవత్సరములనాటి
ప్రతి విమర్శించి వ్రాసిచ్చెఁ బత్త్రమునకు-

ఈపద్యములో శకసంఖ్య చెప్పియుండకపోవుటచే నిందుఁజెప్పఁబడిన ధాతసంవత్సర మెప్పటిదో యని సంశయము కలుగవచ్చును. ఈప్రతివిలేఖకుఁడు, శివరామాభ్యుదయద్వ్యర్థికావ్యకృతికర్త యైన పోదూరి పెదరామామాత్యుడే కాని అన్యుడు కాడు. కృతికర్త వంశీయుల నివాసము ఆచంట. పెదరామామాత్యుని నివాసము పోదూరు.

ఈరెండు గ్రామముల మధ్యదూరము క్రోశద్వయము. ఈపెదరామామాత్యుని చరిత్రము జదివినచో నీతని జీవితకాలములో వచ్చినధాత క్రీ.శ. ౧౮౫౬ వ సంవత్సరమైనట్లు స్పష్టపడును. అందుచే నీవక్యమందుఁ జెప్పఁబడినధాత ౧౬౭౬ గాని ౧౯౧౬ గాని కాఁజాలదు. దాక్షాయణీ పరిణయ కృతిపతియొక్క వంశము నీక్రిందనిచ్చుచున్నాఁడను.

చినమల్లనసోమయాజి - కృతిపతి.

|

లింగన్న

|

యజ్ఞన్న

|

పార్వతీశము

|

పేరమంత్రి

ప్రతివ్రాయించినవాఁడు.

పైసీసపద్యములో ఎనుబది సంవత్సరములనాటి ప్రతినివిమర్శించి వ్రాసి యిచ్చితినని చెప్పఁబడినది. అందుచే నీప్రతి, నీకవులు వ్రాసినది కాదు. దానినిబట్టి వ్రాయబడిన మఱియొక ప్రతియైయుండును. ఈప్రతిని వ్రాయించిన పేరమంత్రి షోడశమహాదానములు చేసినవాఁ డని చెప్పఁబడుటచే ప్రతిలేఖనాకాలమున కాతనికిరువదేండ్లుండునని తలంచుటలో బ్రమాదముండదు. అట్లయినచో నాతని జననము ౧౬౯౬ అగును. తరమునకు ముప్పదివంతున జూచినచో దీనిని బట్టి దాక్షాయణీపరిణయ కృతిపతియైన మల్లనసోమయాజి జననము ౧౫౮౬ వ సంవత్సరమై ఆగ్రంథరచనాకాలము ౧౬౦౦ సంవత్సరప్రాంతమని తేలుచున్నది.

దీనినిబట్టి కేసకవిమల్లకవుల కాలము ౧౫౫౦-౧౬౨౦ అని చెప్పవచ్చును. ఒడయనంబివిలాసమును రచించిన యజ్జరపు పేరయ

లింగకవి, యీ కేసకవికి భావమఱంది. అనఁగా కేసకవి సోదరిని పేర యలింగము పరిణయమైనాఁడు. అందుచే వీరిరువురును సమకాలికులు పేరయలింగకవి చారిత్రమున నాతఁడు ౧౬౦౦ ప్రాంతమువాఁడని వ్రాసియున్నాఁడను. దానినిబట్టి కూడ నీజంటకవుల కాలము పైని చెప్పినట్లు ౧౫౫౦–౧౬౨౦ అగుట నిశ్చయము.

దాక్షాయణీ పరిణయము లభించియున్నచో నీకవుల కాలనిర్ణ యమున కేసుయిన నధికముగఁ దోడుపడియుండు నేమో! అయినను, దాక్షాయణీపరిణయమునుజూచియుండిన శ్రీవీరేశలింగము పంతులుగారు పోతనామాత్యుని చారిత్రమున "పదునాఱవ శతాబ్దాంతమునందు బమ్మెర పౌఢసరస్వతీపుత్త్రుఁడు కేసన్న రచియించిన హైమవతీ వివా హావతారిక వలన" అనివ్రాసి కేసకవిమల్లకవులు పదునాఱవ శతాబ్దాం తమునందున్నవారని యంగీకరించియున్నారు. కావునఁ బైనిచెప్పిన కాలము సరియైనదనియే నానమ్మకము.

ఇవటూరివారి వంశవృక్షము లభించినను, కవుల కాలనిర్ణయ మునకుఁ గొంతసాహాయ్యము కలిగియుండును, పోతనామాత్యునకును ఈ కేసకవి మల్లకవులకును అజ్జరవు పేరయలింగకవికిని దాక్షాయణీ పరి ణయ ప్రతిని వ్రాయించిన గురజాల పేరమంత్రికినిగూడ యివటూరి వారేగురువులు. ఇవటూరివారు గురువులుగనున్న కవులు పెక్కురు కలరు.

(బ్ర. శ్రీ ఇవటూరి పాపయ్యశాస్త్రిగారు 1950 సం ఏప్రియలు 17 వ తేదీ త్రిలింగ పత్రికలో ఇవటూరివారి వంశవృక్షమును బ్రకటిం చియున్నారు. అందుఁ గాలముల నీయలేదు. మఱియు నందునాకుఁ గొన్ని సంశయములు కలిగినవి. శ్రీశాస్త్రిగారినడిగి యాసంశయముల దీర్చుకొనువఱకును దాని నాధారముగాఁగొని కవుల కాలనిర్ణయము చేయుట కవకాశయ లేదని తలంచి యూరకొంటిని.

ఈకవుల కవిత్వము రసవంతమై ద్రాక్షాపాకమున మనోహర ముగ నున్నది. శైలి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించు చున్నాఁడను.

విష్ణుభజనానందము:—

చ. కుదురుగ నభ్రచుంబిఘనగోపురశృంగ విటంక పాళిపై
ముదమున నిల్పినట్టి మణిపుత్రిక లొప్పెఁ బురస్థితోర్ధ్వసం
పద గనువిచ్చి చూచు సురభామలకై వడి దాల్చి కానిచో
విదితములౌనె వానికిని వీక్షణమం దనిమేషభావముల్. ౧౮.

ఉ. చేరిలతాంగికోరికలు చిత్తమునం జిగురింప భక్తితో
నూరువులందు నాపదము లొయ్యన చేర్చుక నేర్చు మీరశృం
గారరసంబులొల్కఁ దనగబ్బిచనుంగవయుబ్బ కంకణో
దారఝుళంఝుళన్నినద తాళవిశేషములొప్పనొత్తుచున్. ౨౮.

ఉ. ఊహయొనర్చ నభ్రమున నొప్పుగ నేగగ నిర్దయాత్ముఁడై
సాహసలీలలుబ్ధకుఁడు చంపిన హంసను హేమదివ్య స
ద్వాహన రూఢుచేసి తనవద్దకు దెమ్మని యాజ్ఞయిచ్చె నా
హా! హరిసత్కృపామహిమలన్నియుఁ జిత్రముగా వెలయించినన్ ౩౮.

ఉ. వానల నెండలన్మిగుల వంతలబొందగ నేల యున్కికిన్
మానిని యొక్క చోటుగనుమా యనఁ జూచిలతాంగిపల్కె శ్రీ
జానిగృహంబు చెంతనిదె చక్కగనున్నది సంతసంబునన్
దీనవసించియుండుదము తేకువతో డుతనంచుఁ బల్కుచున్. ౪౮.

ఉ. అంతటవాడునుం జని రయంబున నొక్కడు శౌరిమందిరా
భ్యంతరమెల్లనారసి ప్రియంబునఁ జుట్టిచరించిచూచియే
కాంతము నిర్మనుష్యమును నై దగియున్నదటంచు భూరజం
బంతయునూడ్చి రూఢినలరారఁగఁ జేసె ముదంబు సంధిలన్. ౫౮.

---

# 243 అజ్జరపు పేరయలింగము

ఇతఁడు శైవదీక్షాపరుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు పేరమంత్రి రామక్కలకుఁ బౌత్త్రుఁడు. కొండమంత్రి బాపమాంబలకుఁ బుత్త్రుఁడు

ఈకవి ఒడయనంబి విలాసమను నాల్గాశ్వాసముల శృంగారప్రబంధమును రచియించి, గోదావరి మండలమందలి ఆచంటయందు వెలసిన రామేశ్వర స్వామికిఁ గృతియొసంగెను. ఈకవి యింటిపేరు మొదట ముగ్గుళ్ళవారయినట్లును, ఈతని మూలపురుషుఁడైనకొండన యనునాతఁడు వేదశాస్త్రములచే మెప్పించి గజపతివలన అజ్జరమను గ్రామమును బడసినప్పటినుండియు వారజ్జరపువారైనారనియు నీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు. ఈగ్రామము గోదావరి మండలమున తణుకు తాలూకాలో తణుకునకు నాతిదూరమున నున్నది.

క. ధరనబ్భారద్వాజుని
గురుగోత్రమునందుఁ బుట్టె కొండనధైర్య
స్ఫురణాయువు సత్పుత్త్రము
కరముగ నున్నతియుఁ గగ్రాఘుసంగతుఁడై ॥ అతండు॥

శా. శ్రీరంజిల్లఁ జెలంగుచున్న గజరాట్సింహాసనాధ్యక్షునిన్
ధారాళంబుగ వేదశాస్త్రబహువిద్యారూఢి మెప్పించియా
వీరాగ్రేసరుఁ డయ్యెకొండన మహావిఖ్యాతగా గౌతమీ
తీరక్షోణిని నజ్జరంబనఁగఁ దాఁ దెచ్చెఁ మహాగ్రామమున్

చ. అతఁడు ముగుళ్ళవంశమున నర్థి జనించియు, రాజసత్తమై
క్షితిఁ జెలువొందు నజ్జరముఁ జేకొని పాలన మొప్పఁజేయు భా
పితగతి నజ్జరంపు కులసింధుసుధాకరుఁడై చెలంగె నా
శ్రితులును బాంధవుల్ హితులు శ్రీదనరారఁగఁ గొండమంత్రియున్

క. ధాత్రిని విద్వజ్జనములు
పాత్రత్వముచేతఁ గొండుభట్లన ఘనచా
రిత్రిన్ గంగమ జేకొని
పుత్త్రినిఁగనె మల్లమంత్రి పుంగవు నెలమిన్.

ఒడయ నంబివిలాసమున వర్ణించిన పద్యములనుబట్టి కవి వంశ వృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడను.




ఈవంశవృక్షమునుబట్టి కవి అజ్జరమును సంపాదించిన కొండన్నకు మనుమని, మనుమనికిఁ గుమారుఁడైనట్లు తెలియుచున్నది. ఒడయ నంబి విలాసమును రచించునాటికిఁ గవి మనుమలనెత్తి యుండుటచే నఱువదేండ్ల ప్రాయమున నీగ్రంథమును రచియించెనని తలఁపవచ్చును. కొండన్నకు గ్రామమునొసంగిన గజపతి నామమేదియో తెలియరా

లేదు. కృష్ణదేవరాయలచే జయింపఁబడిన వీరభద్ర గజపతియై యుండు నని పైపద్యములోని "వీరాగ్రేసరు" అనుపదమునుబట్టి బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగా రూహించియున్నారు. అది నిజమైన గావచ్చును. లేదా అంతకు పూర్వ మీప్రాంతములను బరిపాలించిన పురుషోత్తమ గజపతియో కపిలేశ్వరగజపతియో యైన నయియుండవచ్చును. ఎట్లయినను బదునైదవ శతాబ్దియం దీదానము జరిగియుండును.

కవి ఇవటూరి పెదరామారాధ్యుని శిష్యుఁడ నని యీక్రింది పద ములోఁ జెప్పకొని యున్నాఁడు.

సీ. శ్రీశంభుపదపద్మసేవచే నాదిమ
శివభక్తిరూఢిచేఁ జెలఁగువాఁడ
పెంపొంద నివటూరి పెదరామగురువర్య
దత్తమంత్రిస్ఫూర్తిఁ దనరినాఁడ
మహితభారద్వాజ మౌనిసద్గోత్రాంబు
రాశి చంద్రుండనఁ బ్రబలినాఁడ
వరసాధ్వి బావమాంబకుఁ గొండమంత్రికి
బుత్త్రరత్నంబనఁ బొదలినాఁడ
సరసనెల్లాఖ్యకాసతీసదయహృదయ
పదపద్మాప్తమూర్తినై బరగినాఁడ
నజ్జరపు భవ్యవంశజుండనుచు బుధులు
మెప్పుగా నెంచఁ బేరయలింగకవిని...

ఈగ్రంథముద్రితప్రతికిఁ బీఠికవ్రాసిన ఆచంట సూర్యనారాయణరాజుగా రీకవి బమ్మెర పోతరాజునకు భావమఱఁది యనివ్రాసి యున్నారు. కాని యది పొరపాటు. పేరయలింగకవి భార్య బమ్మెర వారి యాఁడుబడుచనుమాట నిశ్చయము. కాని యామె పోతనకు సోదరి కాదు. తనభార్యనుగూర్చి కవివ్రాసిన పద్యమా ముద్రిత ప్రతిలో నిట్లున్నది.

ఉ. బమ్మెరవంశమందునను బ్రౌఢిసరస్వతిపద్దుఁ గాంచిదా
నెమ్మదలిర్ప కేసుకవీశ్వరు లప్పుడు నాథు సాధ్వియం

దిమ్మహిఁకూర్మిఁగన్నసుత యెల్లమయందున పేరయాఖ్యుడన్
సమ్మతిఁగంటి వీరనరసమ్మను గంగను మంత్రియుగ్మముల్.

ఈపద్యమిట్లున్నచో సరిగా నర్థము కాదు సరికదా! అపార్థద్యోతకముగూడ నగుచున్నది. ఆంధ్రకవుల చరిత్రమునం దీపద్య మిట్లు సవరింపఁబడి యుదాహరింపఁబడినది.

ఉ. బమ్మెరవంశమందునను బ్రోధసరస్వతి పద్దుగాంచి తా
నెమ్మదలిర్పఁ గేసనకవీశ్వరు లప్పమనామసాధ్వియం
దిమ్మహిఁ గూర్మిఁ గన్నసుత యెల్లమయందును బేరయాఖ్యుఁడ
న్సమ్మతిఁ గంటి వీరనరసమ్మను గంగనమంత్రియుగ్మమున్.

బమ్మెర పోతనతండ్రియగు కేసనయే, యీపద్యమందలి కేసనయని భ్రమనొంది పేరయకవి పోతనకు భావమఱఁదియని వీరికాకారు లట్లు వ్రాసియుందురు. పోతనతండ్రి కేసనామాత్యుఁడు, కవియైనట్లెచ్చటను గానరాదు. పేరయకవి తనకుఁ బోతనకవి భావమఱఁదియైనచోఁ దనగ్రంథమున నాతనిని స్మరింపకపోఁడు. పోతనతల్లి లక్కమ కాని యప్పమ కాదు. ఈమూఁడు కారణములనుబట్టి పేరయలింగకవి పోతనామాత్యునకు భావమఱఁది కాఁడని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. దాక్షాయణీ పరిణయ, విష్ణుభజనానందాది కావ్యములను రచించిన కేసకవి మల్లకవు లిరువురిలోఁ గేసకవి యీ పేరయలింగకవికి భావమఱఁది యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. కేసకవులమల్లకవుల చరిత్రమున నీవిషయమునుగూర్చి కొంత వ్రాసియున్నాఁడను. ఈసందర్భమున దానినిగూడఁ జదువవలయును. కేసకవి మల్లకవులు పదునాఱవ శతాబ్దివారని వారి చరిత్రమున వ్రాసియుంటిని కేసకవికి, భావమఱఁదియైన పేరయలింగకవియు నాకాలమున నుండినవాఁడని చెప్పవచ్చును. కొండుభల్లి గజపతివలన క్రీ.శ. ౧౪౫౦ ప్రాంతమున నగ్రహారమును బడసెనని యనుకొంటిమేని, నాతని మనుమఁడైన హరిమంత్రి ౧౫౧౦ ప్రాంతమునను, ఆతని మనుమఁడైన కొండయ దండనాయకుఁడు ౧౫౮౦ ప్రాంతమునను, ఆతని కుమారుఁడైన పేరయగకవి ౧౬౦౦ సంవత్సర ప్రాంతమునను నున్నాఁడనినచో నందు

విరోధమేమియు లేదు. కపిలేంద్రగజపతి క్రీ. శ. ౧౪౩౫ మొదలు ౧౪౬౬ వఱకును రాజ్యము చేసియుండెను. ఆంధ్రదేశము నీతడు జయించి బహుపరాక్రమములను చేసినవాఁడు. ఈతని కాలములోనే ౧౪౫౦ ప్రాంతమున కొండుభట్లు, అగ్రహారమును బడసెని నిశ్చయముగా జెప్పవచ్చును.

బ్రి. శ్రీ. వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రమున "నీకవి క్రీ. శ ౧౭౫౦ ప్రాంతమువాఁడయియుండునని యీ క్రింది వాక్యములలో వ్రాసియున్నారు. అని మనుచరిత్రమునందు కృష్ణరాయనిచే నోడింపబడినట్లు చెప్పఁబడిన వీరరుద్రగజపతియే మో యని యూహ పుట్టుచున్నది. ఆయూహయే నిజమయినచోఁ గవివంశమునకు మూలపురుషుఁడయిన కొండన పదునాలవశతాబ్దియందుండి యుండవలెను. కవి కొండన కేడవపురుషుఁడయినందున నొక్కొక పురుషునికి మప్పదేసి సంవత్సరముల చొప్పునఁ జూచినచో నీపేరయకవి ౧౭౫౦ సంవత్సర ప్రాంతముఁ లయం దుండియుండును".

కొండనకుఁ గవి యాఱవపురుషుఁడు కాని పంతులుగారనిన యేడవ పురుషుఁడు కాఁడు. వీరభద్రగజపతిని కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౫ వ సంవత్సరమున జయించెను. కావున కొండనకు దానమిచ్చినవాఁడు వీరభద్రగజపతియని యెంచినను, దానము ౧౫౧౦ ప్రాంతమున జరిగినదనియు నప్పటికి కొండనకు నలువదయేండ్లు వయసుండుననియుఁ దలంచితిమేని, కొండన జన్మకాలము ౧౪౮౦ అనియు మల్లమంత్రి ౧౫౦౦ సంవత్సరమునను హరిమంత్రి ౧౫౩౦ లోను, పేరన ౧౫౬౦ లోను కొండయ దండనాయకుఁడు ౧౫౭౦ లోను, మన పేరయలింగకవి ౧౬౨౦ లోను జన్మించి, అరువదేండ్ల ప్రాయమున నన(గా క్రి. శ. ౧౬౮౦ ప్రాంతమున నీయొడయనంబి విలాసమును రచయించియుండుననియు తేలుచున్నది. అజ్జరపు దానకాలము నేననినట్లు క్రీ. శ. ౧౪౫౦ ప్రాంతమని తలంచితిమేని, ఒడయనంబి విలాస రచనాకాలము ౧౬౨౦ ప్రాంతమే యగును. ఎట్లయినను పంతులుగారు వ్రాసినట్లు ౧౭౫౦ మాత్రము కాఁజాలదు. ఈతని చరి

త్రమును వ్రాయువాటికి పంతులుగారికి దాక్షాయణీ పరిణయప్రతి లభింప లేదు. అందుచే వారట్లు వ్రాసియుండిరి.

బమ్మెర కేసకవి మల్లకవుల చరిత్రమున వ్రాసియున్న సంగతులనుబట్టి చూచినచో నీపేరయలింగకవి క్రీ. శ. ౧౫౮౦ ప్రాంతమున నీయొడయనంబి విలాసమును రచియించియుండెనని కూడ జెప్పవచ్చును. దీనికి విరోధముగాఁ గన్పట్టునది అజ్జరపు దాన శాసన కాలముదక్క మఱియొకటి లేదు. అజ్జరపు దానశాసన కాలమును నిర్ణయించుటకు దగిన యాధారములులేవు. దానిని క్రీ. శ. ౧౪౪౦ వఱకు వెనుకకు గొంటినను గొంటవచ్చును. ఎట్లయిన నీకవిని పదునాఱవశతాబ్దియందుత్తరార్థమున నున్నవానినిగా నిశ్చయింపవచ్చును. శ్రీవీరేశలింగము పంతులుగారు కవులచరిత్ర ద్వితీయముద్రణమున బమ్మెర పోతనామాత్యుని చారిత్రమునందు అజ్జరపు పేరయలింగము ౧౬౩౬ ప్రాంతమునందుండినట్లు వ్రాసియున్నారు. అందుఁగూడ నొక పొరబాటు కలదు. దాక్షాయణీ పరిణయ కృతికర్తయైన కేసకవి కీపేరయలింగమల్లుఁడని యనుకొని యట్లువ్రాసియుండిరి. ఆకేసకవికి భావము అఁది యనుకొనినచో నీతఁడు ౧౬౦౦ ప్రాంతమువాఁడని వ్రాసియుందురు.

ఇప్పటివలెగాక పదునైదవ శతాబ్దినాటి యాంధ్ర నియోగి బ్రాహ్మణులు 'భట్ట'శబ్దమును వహించి వేదశాస్త్రాభ్యాసమొనర్చి ప్రభువులను మెప్పించి గౌరవము నందెడి వారని యీకవి పూర్వుఁడగు కొండుభట్టునుబట్టి దెలియుచున్నది. ఈకవి తనగురువైన ఇవటూరి పెదరామనాథుని, ఈక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. బంగారు ధాన్యంబు పటుభూతి పండించు
పాలంకి విశ్వేశపండితునకు
కనకపత్రిక శివుం డనిపిన బొందితో
ధృతి నేగునవ్విశ్వదేశికునకు
తనయందలము భూతతతి మోయఁగాఁజాల
భాసిల్లు శ్రీవీరభద్రునకును

కాశ్యపగోత్రుఁడై ఘనహోమగుండంబు
నిలఁబొచ్చు సోమధేశునకును.
పౌత్రిపౌత్రాఖ్యుఁడగు వీరభద్రసుతుఁడు
ధన్యపినరామసుపర్వతాలుఁ గన్న
సూరమాంబకుఁ బార్వతీ సుందరికిని
నాథుఁడివటూరి పెదరామనాథగురుఁడు
మద్గురుస్వామి గావున మదిఁదలఁతు.

పైపద్యములోఁ గవి తనగురు వైన యివటూరి పెదరామనారాధ్యుని పూర్వుఁడగు విశ్వేశ్వర పండితుఁడు బంగారు ధాన్యమును బండించినట్లు వర్ణించియున్నాఁడు. దీనితో సంబంధించి యాంధ్రదేశమునఁ బ్రచారములో నున్న యొకకథకలదు. తపోనిష్ఠాగరిష్ఠుఁ డగు బ్రాహ్మణుఁ డొకఁడు తనకుమారునితో "మనభూమిలో విత్తనములు చల్లుటకు ముహూర్తముంచితిని. నిర్ణీతకాలమునకు గురుతుగా నేనిట శంఖమూఁదెదను. అప్పుడు నీవు బీజావాపనము చేయవలయును"నని చెప్పెనఁట. ఆదారిని బోవు కాఁపువాఁ డొకఁ డామాటలను విని తానుగూడ ఆముహూర్తముననే విత్తనములు జల్లుటకై సంకల్పించుకొని మడిదున్ని బాగుచేసి, బీజావాపనముహూర్తమున కెదురుచూచుచుండెనఁట ఇంతలోశంఖారావము వినవచ్చెను. కాఁపు విత్తనములను జల్లెను. బ్రాహ్మణ కుమారుఁ డాముహూర్తమున నెడ్లను నాగలికిఁ గట్టి దున్న నారంభించి పిమ్మట విత్తనములను జల్లెనఁట. ఇరువురి సస్యములును బాగుగాఁ బెరిగినవి. బ్రాహ్మణకుమారుని సస్యము పెద్దపెద్ద వెన్నుల నీని కన్నుల పండువుగా నుండెను. కావువాని సస్యమీననే లేదు. ఆతఁడు బ్రాహ్మణునియొద్ద కేఁగి తానుచేసిన క్రమమును బ్రాహ్మణకుమారుఁడు చేసినక్రమమును దెలిపి తన సస్యము ఫలింపలేదని మిగుల విచారించెను. ఆభూమీసురుఁడు తన కుమారుని భూమిలోని పంటను కాఁపునకిప్పించి కాఁపువాని భూమిలోని సస్యమునుతనకుమారుఁడు పుచ్చుకొనునటు చేసెను. వారిరువురును సస్యమును గోసికొనిరి. బ్రాహ్మణబాలుని భూమియందా కాఁపువానికి విశేషముగ ధాన్యము లభించెను. కాఁపువాని పొలమునఁబండిన ధాన్యము బంగారుధాన్యము.

ఆబంగారురాశియందు విప్రుఁడు కొంచము మాత్రమేతీసికొని మిగిలినది భూస్థాపితము చేసెను. ఆనిక్షేపము నెవ్వరు గ్రహింపలేకపోయిరనియు నమరావతిని బరిపాలించిన వాసిరెడ్డి వెంకటాద్రినాయని కదిలభించెన నియుఁ జెప్పెదరు. ఆబ్రాహ్మణుఁడే యివటూరి విశ్వేశపండితుండై యుండును. ఆబంగారవు ధాన్యముపండినభూమి పైడిమొలక (పైడిము క్కల) యనుపేరుతో నివటూరి వారివంశీయుల కగ్రహారముగా నీయఁబడి చాలకాలము వారివంశీయులకు జరిగినదఁట

ఒడయనంబియను శివభక్తుని కథయిందు వర్ణితమయినది. ఒడయనంబి, పరమనాచి యను వేశ్యనుగూడి సంచరించుచు ధనమును గోల్పోయి వేశ్యమాతచేఁ దిట్టువడి చింతాక్రాంతుఁడగుచునుండ నీశ్వరుఁడాతనికి సహాయ్యము చేయుచుఁ దుదకు వారికి ముక్తినిచ్చుకథ యిందు వర్ణితము. కవి గోదావరి మండలమువాఁడగుట, ఒడయ నంబిని పరమనాచిని నామండలమునకుఁ దీసికొనివచ్చి వారిమాహాత్మ్య ముల వెల్లడించి, తుదకు ఆచంటయందలి రామేశ్వరునిచే వారికి ముక్తి నిప్పించెను. రామేశ్వరునకు నిలయమైన గ్రామమున కాచంట యని పేరువచ్చుట కాధారముగ నొక కథను గ్రంథస్థముచేసెను.

ఒడయనంబి యొకనాఁడు పరమనాచికడ నుండగా శివపూజకు సమయమయ్యెనఁట. అప్పు డాతఁడు స్వామియాలయమునకుఁ బోవుట కవధిచాలక నిద్రాపరవశ యైయున్న పరమనాచి స్తనమునందే యీశ్వ రుఁడున్నట్లు సంకల్పించుకొని నిర్మలోదక గంధపుష్పాక్షతలచే నా స్తన మును బూజించుచుండుటఁ గాంచి మేల్కని పరమనాచి యిదేమని యాతని నడుగ "ఈశ్వరపూజకు వేళయైనది. ఈశ్వరునిందు సంకల్పించు కొని పూజచేసితిని. మరేమియు లేదు." అని ప్రత్యుత్తర మిచ్చెనఁట పరమనాచి నవ్వుచు "ఎవ్వరైన వినినవ్విపోవుదురు. ఇవి కాముకచర్యలు గాని ఈశ్వరుఁ డిందున్నాఁడా?" అని యధిక్షేపించెనఁట. ఒడయ నంబి యొక్కింతసేవు ధ్యానపరాయణుండై "ఈశ్వరా! నీవిందు లేవా? ఉన్నచోఁ బలుకుము అని ప్రార్థింప

క. రావోయి యొడయనంబీ
నవనీతకుచంబులోన నిశ్చయముగ నీ
భావమునఁ దలఁచినట్లే
శ్రీవెలయఁగ నున్నవాఁడ సిద్ధముగాఁగన్

కం. ఉన్నాఁడను ఉన్నాఁడను
ఉన్నాఁడ నటంచుపల్కి హాహో యనుచున్
విన్న మహాత్ములు మెచ్చఁగ
జన్నున రామేశ్వరుండు సంభవమొందెన్.

గీ. అట్టి మార్తాండ పురమున కరుగుదెంచి
భక్తితోడ నొడయనంబి పరమనాచి
చన్నుఁబూజింప శంభుఁ డాచంద మెఱిఁగి
చంటఁ బలుకంగ గ్రామమాచంటయయ్యె.

ఈతని కవిత్వము లలితమై సరసజన హృదయంగముగానున్నది. కవిత్వశైలికై యిదివఱ కుదాహృతము లైన పద్యములు చాలును. అయినను మరిరెండు మూఁడుపద్యముల నుదాహరించెదను.

సీ. కుచము లంతంతకు గొప్పలై మీఱెను
కురులు గొప్పునకంది కొమరుచెందె
అధరంబు ననుపెక్కి యమృతబిందువు లూరె
ముఖము సముజ్జ్వలాంబుజము మీఱె
నూరువుల్ బల్జిగి యొనరిన బిగిమించె
కటిభాగ మరువుగాఁ గానుపించె
బాహుమూలంబులఁ బైడినిగ్గులు దేరె
కరములు నున్ననై కాంతిచేరె
పాదయుగ్మంబునకు వింతబలుపు ప్రాలె
నఖములనురక్తిచేత నెన్నంగఁ జారె
దేహ మొకకొంత మదమున దివిచె లీల
యౌవనము భామకుఁ బ్రాప్తమయిన వేళ.

ఉ. పోఁకలికిఁ గ్రిందికట్టుఁ బరిపూర్ణములైన కుచద్వయంబునున్
చిక్కని కప్పుకొప్పులును చేరలమీఱు విశాలనేత్రముల్
చక్కని హస్తపద్మములు సౌఖ్యము లిచ్చెడు దేహవల్లులున్
మక్కువగల్గు కాంతలను మానిని చూడు కళింగధారుణిన్.

ఉ. లింగము లాత్మమధ్యముల లెస్సనటింపఁగఁ గంచుకంబుతోఁ
పొంగెడు గబ్బిగుబ్బలును పూర్ణశశాంకునిఁ బోలు మోము లు
త్తుంగకటీతటంబులును దోయజగంధము లొప్పుచున్న యా
జంగమకాంతలం గసిరి సంభ్రమ మొప్పఁగ శ్రీగిరిస్థలిన్.

---

## 245 బిజ్జల తిమ్మభూపాలుఁడు



ఇతఁడు మొటవాడ రెడ్డికులజుఁడు. వెన్నాళ్ళ గోత్రుఁడు కృష్ణభూపాల నందనుఁడు. ఇతని తల్లి బచ్చాంబిక.

సంస్కృతమున బాలవాల్మీకి బిరుదాంచితుఁ డగు మురారికవి రచించిన యనర్ఘ రాఘవ మను ప్రశస్తనాటకమును ఆంధ్రమున నాపేరనే ఎనిమిదాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి, ప్రాకటూరునందలి రామేశ్వరస్వామికిఁ గృతియిచ్చెను. కృతిపతిని నుతించుచుఁ గవి గ్రంథాదిని వ్రాసిన పద్య మిది:—

శా. శ్రీఁజెన్నౌ నెలవంక నిబ్బరపుఁ జన్గ్రేవ న్విలోకించి యా
లేజాబిల్లి యిటేల వచ్చెనని హాళిం దాల్పఁ బో రామి నెం
తే జాగూన్పు భవానిఁ గాంచి నగుచున్ "నీవెంత బిగ్గోలవే
రాజాస్యా" యనుప్రాకటూరు నగరీరామేశుఁ డిచ్చున్ సిరుల్.

ఈ ప్రాకటూరు ఆంధ్రమండలములలోఁ గన్పట్టలేదు. కృష్ణానదీ తీరమని కవి వ్రాసినాఁడు. నిజామురాష్ట్రములోఁ గృష్ణానదీ పరిసరముల నుండియుండును.

రెడ్లలో పంటరెడ్లు, భూమంచి రెడ్లు, పాకనాటి రెడ్లు, మోటాడ రెడ్లు, మొదలుగాఁ బెక్కు శాఖలున్నవి. ఆందీకవి మోటవాడ రెడ్డిననియు, నాలవ జాతివాఁడననియు, నీక్రింది పద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

సీ. ఏసరిత్తిలకంబు హేమాంబరుని పాద
రాజీవమునకు మకరందధార
యేనదీతల్లజం బీశానమస్తక
సీమకుఁ బాండుగోష్ణీషశాటి
యేవాహినీదేవి హిమవద్ధరాధర
శృంగాంతరంబులఁ గ్రీడసల్పు
నేధునీకాంత పాదోధిమూర్ధన్యున
కగ్రభార్యామణియై రహించు

గీ. నట్టిగంగకు దోఁబుట్టు వగుచతుర్థ
జాతియందు నితాంత విఖ్యాతిఁదనరు
చున్న మొటవాడ కులమున నొప్పుమీఱెఁ
జాఁ బిజ్జల నారభూపాలమౌళి.

ఈకవి తనతండ్రి యాస్థాన విద్వాంసులు చెప్పినట్లుగా తన వంశమును దాదాపు ౧౩౦ పద్యములలో ఆంధ్రానర్ఘరాఘవ కృత్యాదిని వర్ణించియున్నాఁడు. కాని యందు కవినివాసముగాని కాలముగాని పాలితప్రదేశముగాని తెలుపు నంశములు లేవు. కవికిఁ బితామహుఁడైన పెదతిమ్మభూపాలుని వర్ణించిన యీక్రింది పద్యమునందు:—

సీ. కమనీయ దక్షిణకాశికాక్షేత్రంబు
రహిమించ నెవ్వని రాజధాని
తుంగాఖ్యగంగాతరంగ రంగన్మౌళి
బ్రహ్మేశుఁ డెవ్వని పాలివేల్పు
పాదుశాదత్త శుంభద్దంతిహయముఖ్య
వస్తువెవ్వనియింట విస్తరిల్లు

ధరవంతు కెక్కు కందనవోలిదేశంబు
గణుతింపనెవ్వని కాణయాణి

గీ. సిరులనొప్పు నలంపూరిసీమ కెల్ల
నాడగౌడును దేశాయినాడ కరణ
మనెడు విఖ్యాతి యెవ్వాని కలరె నతఁడు
వొల్పె బిజ్జలపెదతిమ్మ భూవిభుండు ౧౪.౭౭

అని చెప్పియుండుటచే, నీకవి నివాసము కర్నూలు మండలము లోని అలంపూరు సీమయని చెప్పనొప్పును. ఆసీమకితఁడు ప్రభువయి యుండును. ఈపెదతిమ్మ భూపాలుఁడు "గండభేరుండ రాయవేశ్యా భుజంగాది బిరుదములు గలవాఁడఁట! ఈతనిభార్య కామాంబిక. ఈదంపతులకు జనియించినవాఁడు కవితండ్రియగు కృష్ణభూపాలుఁడు. ఇతఁడు జనుపల్లి వెంకటాద్రిపుని తనయయైన బచ్చాంబికను బెండ్లియాడెను. వీరి తనూజాతుఁడే కవి. ఇతఁడు మసూదుఖానును జయించిన ట్లీక్రింది పద్యములోఁ గలదు.

ఉ. భూరనఁ గృష్ణరాయ నృపపుంగవు తిమ్మనృపాల! నీశితో
దారకరాశి డాసి యసిలాసి క్రియన్ నటియించుఁ గానిచో
జోరు మసూదుఖాన రణశూరుని ప్రాణసమీరణంబులన్
బారణసేయునే నిమిషమాత్రములోననె శ్రీసమగ్రిమై

ఈమసూదుఖా నెవ్వరో నాకు దెలియ లేదు. మఱియు నీకవి చంద్రుఁడు పికిలి చెన్నభూపాలుని రాజ్యలక్ష్మిని హరించినట్లు రెండు సీసపద్యములలోఁ జెప్పుకొని యుండెను.

సీ. గీ. నాఁ తమకెంత యుపకారి యనుచు మెచ్చు
మోహమున నిన్ను నాహవోన్మాలితాగ్ర
పికిలి చెన్నక్షమాపాల వీరసమితి
దివిని శుభరూప! బిజ్జలతిమ్మభూప! ౧౪.౭౮

సీ. గీ. వసపతాకాఫలంబు ప్రావడలు నిగుడ
నాజి మహి తేజినెక్కి మున్నధివసించె

వేడ్క జయలక్ష్మిరీతి నేఁ పికిలి చెన్న
ధీరు నెడఁబాసి నినుఁ జేరి తిమ్మభూప. ౧ఆ.౭౨

ఈపికిలి చెన్నభూపాలుఁ డెవ్వరో యెఱుఁగరాలేదు.
కవి భార్య యక్కాంబ. చింతకుంట ధర్మరాజుతనయ.

గీ. ధరణిపతిగజసింహాసద్విరద చింత
కుంట ధర్మరాజేంద్రుని కూఁతు నలరి
యక్కమాంబను వరియించి యంత బొర
మాంబనును ద్వాహమైతివివాదరమున

మనకవి యైన తిమ్మభూపాలునకు అక్కమాంబ యందిరువురు కుమారులు. ధర్మభూపాలుఁడు; ఇమ్మడికొండ నృపాలుఁడు. ధర్మభూపాలునిభార్య శేషమాంబ. ఇమ్మడికొండ నృపాలునిభార్య కృష్ణమాంబ. మఱియు నాతిమ్మభూపాలుఁడు రెండవభార్యయైన బొరమాంబయందు ముగ్గురు తనయులం గాంచెను. ౧ నృసింహభూపాలుఁడు ౨ కృష్ణభూవిభుఁడు 3 బచ్చభూపతి ఇందు నృసింహభూపాలుని భార్య చెన్నమ యని యీక్రింది పద్యములో నున్నది.

ఉ. ఆనరసావనీశుఁడు ప్రియం బలరంగ వరించెఁ జెన్నమాం
మానవతీలలామ నసమానదయాసుగుణాభిరామసా
ధ్వీనివహానిశప్రణుతధీగరిమాపరసీమ సప్తసం
తానముఖోల్లసత్సుకృతధామ సుధామయవాగ్ధురంధరన్.

కృత్యాదియందుఁ గవి వీరి నందఱిని చక్క పద్యములలో వర్ణించియున్నాఁడు. కాని యందు వర్ణనాంశములే కాని చారిత్రమున కుపయోగించు నంశములు లేవు. సంస్కృత కవులను కవిత్రయమును దక్క పూర్వకవులను నుతింపలేదు. గ్రంథము నీశ్వరున కంకితము చేసెను. కృత్యాదియం దిచ్చిన పేరులుగల వారెవ్వరో తెలిసికొనుట కాధారములు లభింపలేదు. ఈక్రింది రెండుపద్యములలో నిరువురు కవులను గీర్తించినాఁడు. కాని వారెవ్వరో వారు రచించిన గ్రంథము లేవియో తెలుపలేదు. ఇఁకఁ గాలనిర్ణయ మెట్లు చేయగలము?

మ. కననీయస్థితిఁ జెంగటన్ ధవళశంఖస్ఫూర్తి రాణింప దీ
ప్తనరీచిన్ బవడంపుఁగెంపుఁ బవలన్ బంజూరి వెలుంగొందని
స్సమసారస్వత నిర్మలామృతఝరీ జాగ్రత్తతంగాబ్ధి పే
రమహాసత్కవి తేజరిల్లె విబుధప్రస్తూయమానోద్ధతిన్.

చ. అతనికిఁ బౌత్త్రుఁడై యసదృశాఖిలవిద్యలఁ బ్రౌఢిఁగన్నయా
యతమతి కృష్ణసత్కవి సహాయకవిత్వమునన్ సమాజసం
తతభజనాదరుండ నగునాతు నశేషవిశేషవై దుషీ
ప్రతిభకరస్థలామలక భాస్వరమై తనరారు టబ్రమే.

ఈ వేంకవి, కృష్ణకవులు సంస్కృతకవులో, ఆంధ్రకవులో వీరురచించిన గ్రంథము లేవియో తెలియదు. కవి కాలనిర్ణయమున కీపద్యము లుపయోగింపలేదు. ఎన్నివిధములఁ జూచినను కవికాలమును దెలిసికొనుటకు నాయత్నములు నిష్ప్రయోజకము లైనవి. కాని గరికపాటివలెనొక చిన్న యాధారము దొరకినది. ఈకవి రచించిన యనర్ఘరాఘవమునకు, మ.ప్రా.లి.పు. భాండాగారమున నొక వ్రాఁతప్రతి యున్నది. ఆప్రతి లేఖకుఁడు గ్రంథాంతమున నిట్లు వ్రాసియున్నాఁడు.

"శ్రీ బిచుపల్లె వీరాంజనేయార్పణమస్తు పరాభవ సం॥ భాద్రపద శు ౧౨ శుక్రవారంనాడు మూడు యామములవరకు సంపూర్ణము. ఉప్పల లక్ష్మీనరసింహాచార్యుల వారికుమారుడు రామానుజాచార్యుల వారు బిజ్జల చిన్నమ్మ దేశాయి గారికి వ్రాసియిచ్చినది. అని గ్రంథాంతమందున్నది ఇది యీ ప్రతి మాతృకలోనిది"

దీనినిబట్టి యీగ్రంథవిలేఖరి బిచుపల్లె వాస్తవ్యుఁడనియు నందాంజనేయస్వామి కలఁడనియుఁ దెలియుచున్నది. ఈగ్రామ మెచ్చటిదో తెలియుటలేదు. ఈగ్రామమునుగూర్చి కాకతీయ సంచికలో "గద్వాలసంస్థానము" అనువ్యాసమున (2̈2 వ పుట) నిట్లువ్రాయఁబడి యున్నది. "బీ చి ప ల్లి". ఈగ్రామము గద్వాలకుఁ దూర్పుగాఁ బది మైళ్ళదూరమునఁ గృష్ణానదీ తీరమునందున్నది. ఇందలి యాంజనేయ విగ్రహము దర్శనీయము. దీనినిగూడ వ్యాసరాజస్వామి ప్రతిష్ఠించెనఁట! ఉత్తర దక్షిణముగాఁ బ్రవహించునదిలో నిచటబ్రాకృష్ణ ప్రవ

ముగా నొకద్వీపమేర్పడినది ఇందలి యొకగుట్టపై బలిష్ఠమగు కోట కలదు దీనికి నైజాంకొండ యనిపేరు." విలేఖరి నివాస మీగ్రామ మనుట నిశ్చయము.

పాఠకలోకారుకూడ నీసమీపముననేయుండ నేమో! ప్రతివ్రాయించిన చిన్నమ్మి దేశాయిగారెవ్వరో? కావ్యకర్తయగు తిమ్మభూపాలునకుఁ జెన్నమ్మయను కోడలుండినదనియు, నామెస ప్రసంతాన ముఖోల్లసత్సు కృథామయనియుఁ బైని నుదాహరించిన కృత్యాదిపద్యములో నున్నది. ఈ చెన్నమయే విలేఖరి వ్రాఁతలో చిన్నమ్మి దేశాయి యైనదనియు, మామగారు రచించిన కావ్యముత్సన్నమై పోకుండఁ బ్రతివ్రాయించెన నియు నూహించుచున్నాఁడను. ఇది సత్యమయ్యెనేని విలేఖరి యుదాహరించిన - పరాభవ సం॥ భాద్రపద శు ౧౪ శుక్రవారం క్రీ. శ. 1606 సెప్టెంబరు ౯వ తేదీ అయినందునను, ప్రతివ్రాయించిన చెన్నమ్మ గ్రంథకర్తకుఁ గోడలగుటచేతను, కవి యంతకుఁ బూర్వుఁడనియు క్రీ.శ. పదునాఱవ శతాబ్దియందుత్తరార్ధమున నున్నవాఁడనియుఁ దలంప వచ్చును. సాక్ష్యాంతరము లభించువఱకుఁ గవికాల మిదియే యని నిర్ణయింతము

సంస్కృతమున నీనాటకమును రచించిన మురారికవిని తిమ్మ భూపాలుఁ డీక్రింది పద్యములోఁ గీర్తించి యున్నాఁడు.

సీ. నిఖిలతపోధననివహసంస్తుత్యచా
రిత్రైకమౌద్గల్యగోత్రభవుఁడు
నానావిధశ్లాఘినవపితామహవర్ధ
మానభట్టార్యకుమారకుండు
తతసతీవృత్తాంక తంతుమంతాశీప్వాయ
మానవతీ శుక్తిమానికంబు
గురుభట్ట దేశికోత్తరపూరమధ్యస
రన్నిరాఘాట సారస్వతుండు
గీ. జాలవాల్మీకిబిరుదశుంభన్మురారి
నాటక మనర్ఘరాఘవనామకంబు

దాని నాంధ్ర ప్రబంధంబుగా నొనర్చి
యుదితసామగ్రి సమ్మనద మూను సభకు

మురారి ప్రఖ్యాతకవీశ్వరుఁడు. ఇతఁడు క్రీస్తుశకమున తొమ్మి దవ శతాబ్దియందుండిన వాఁడని సంస్కృత వాఙ్మయ చరిత్ర నుడువు చున్నది. సంస్కృత నాటకములలో ననర్ఘరాఘవమునకు గొప్పకీర్తి కలదు. ఈనాటకమున కనర్ఘ రాఘవమని పేరున్నను బండితులు కవినా మమునే నాటకమున కుంచి మురారినాటకమని పేర్కొనుచుందురు. ఆకాలమువాటి సంస్కృత నాటకములు కేవలము, శోకరసమునో కరు ణారసమునో ప్రధానముగాఁ జేసిరచింపబడియుండుటచేఁ దత్ప్రదర్శ నమువలనఁ బ్రేక్షకుల హృదయములు దుఃఖపూరితము లగుచున్న వనియు నాటకము లెప్పుడును వీరశృంగార రసప్రధానములుగా నుండ వలయుననియు నందులకు నిదర్శనముగా నారసద్వయమును బ్రధాన ముగాఁ జేసి మురారి యీనాటకమును రచించెను. "మురారి స్తృతీయ పంథా" అని వాడుకగాఁ జెప్పుకొనుచుందురు. సీతారాముల పరిణ యాది మహోత్సవములందును, రావణవధానంతరమున, విమాన యానాదిసందర్భములయందును శృంగారరసమును; శివధనుర్భంగ కాల మున పరశురామునితోడను రావణాదులతోనైన మహారణమున వీర రసమును ప్రదర్శింపుచు నీనాటకమును మురారి రచించెను.

మురారి విజ్ఞానమునకుఁ గొఱఁత రాకుండునట్లు తిమ్మభూ పాలుఁడీ ప్రబంధమును రచించెను. ఎంతప్రజ్ఞావంతుఁడైనను దృశ్య ప్రబంధమునందలి స్వారస్యమునుబద్యకావ్యమునఁ గనఁబఱచుట కష్టము. అయినను నీకవి ప్రౌఢుఁడు. కావున గ్రంథమును జక్కనిశైలిలో రచిం చెను. సంస్కృతపదబాహుళ్యముగా నున్నను, కవిత పండిత హృదయ రంజకముగా నున్నది. ఆశ్వాసమునకొక పద్యమువంతున శైలికై యుదాహరించుచున్నాఁడను.

ఉ. ఓరఘురాజవంశకలశోదధి కల్పమహీజ! మీకు నీ
చారుయశోవిభూతి సహజం బుపదేశ మొనర్చుమాత్ర మా

వారము నైరవోత్సవన వద్యుతిపూర్తికిఁ గార్తికనిశా
హారివిహారయుక్తి వలెనా నలివారికి నెంచి చూచినన్.

మ. విలసల్లీల మహాసభాంతరమునన్ విద్యాప్రసంగంబు శి
ష్యులు గావింప నెసంగుఁ దద్గురునకున్ శుంభద్గుణస్ఫూర్తి యు
జ్వలశక్తిచ్ఛటలం జలంబు ఘనముల్ వర్షింప ధాత్రిన్ నిర
ర్గలవిఖ్యాతిఁ బయోధి గైకొనుఁగదా రత్నాకరాఖ్యానమున్. 2 ఆ.

ఉ. వేడుకనై రహస్యకథ వేకువఁ బోటులు తెల్పుమటన్న నీ
చేడె నవోఢ గానఁ గడుసిగ్గునఁ దెల్పక మోము వాంచినన్
గోడెమిటారి చన్నుఁగవఁ గుంకుమపత్త్రికముల్ రచింపఁ జే
నూడి తదీయసీత్కృతినిగాఢనఖాంకము దెల్పె వారికిన్. 3 ఆ.

శా. ఓరీ రావణ! శంభుచాపహతిజాతోత్సేకుఁడై బాహుశౌ
ర్యారూఢోష్మఁ జెమర్పఁ జేయుచును బాల్యంబందె యాక్షత్రసం
హారిన్ భార్గవుఁ జక్కఁ జేసిన మహీజాధ్యక్షుచే నీకగున్
దారాభర్తృసమానకర్తృకవధోత్కర్షాత్తధన్యత్వమున్ 4 ఆ.

మ. ఘనలంకాధిపదోర్వనీమథనజాగ్రద్బాహుదండంబుచే
వినుఁడీ పాపఁడు ముజ్జగంబులకు నుద్వేలప్రమోదంబుఁ గూ
ర్చిన నాశ్చర్యము గాదు పిన్నవుడె చేసెం బిప్పిగా జామద
గ్న్యుని విస్రస్తమహాతపఃప్రబలతేజోవీర్య నిర్యాసమున్. 5 ఆ.

# 246 సవరము చిననారాయణ నాయకుఁడు



ఇతఁడు కువలయాశ్వ చరిత్ర మను నైదాశ్వాసముల యుత్తమ ప్రబంధమును రచియించి తన పెంపుడు తండ్రి యైన సవరము నారయ ప్రభువున కంకితముచేసెను. ఈ కవి సూర్యుని వర్ణించి, తద్వంశసంభవుఁడైన శ్రీరామచంద్రుని కుమారుఁడైన కుశుని వంశములోనివాఁడ నని యవతరణికలోని యీ క్రింది పద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

శా. ఆరామాధిపమౌళికిం దశముఖాఖ్య గ్రావదంభోళికిన్
బారావారపటీసమావృతకటీభారోజ్జ్వలద్ధారుణీ
గౌరంధర్యపరీస్ఫురార్యసమదోస్తంభప్రతీపప్రభా
శ్రీరాజద్ద్విషుఁడౌ కుశుండు జనియించెం బ్రాభవోపేతుఁడై.

గీ. ఆకుశునియన్వయమున బాహాసహాయ
శౌర్యగాంగేయవైరిరాజన్యగేయ
బలులు పెక్కండ్రు నృపతులు వెలసి రందు
వినుతి వహించె గోవిందజనవిభుండు.

ఇతఁడు సూర్యవంశపు క్షత్రియుఁడనని చెప్పుకొనుచు గద్యలో దననామాంతమున శూద్రులయందుఁ దఱుచుగా వర్తించు నాయక శబ్ద మేల వేసికొనెనో తెలియకున్నది. గద్య యిట్లున్నది.

"ఇది శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణాసమాసాదిత సరసకవితావైభవ సవరమన్వయాభరణనారాయణ భూపాలతనూభవ శఠగోప తాపసేంద్రచరణారవిందచంచలన్మానస మిళింద సంతతభారత భాగవతాది శ్రవణానంద కామినీ మనోహరరూపరేఖావిజితచైత్ర కాశ్యప గోత్ర పవిత్ర జాతివార్తాకవిజనామోద సంధాయక చిననారాయణ నాయక ప్రణీతం బైన కువలయాశ్వచరిత్రం బను మహాప్రబంధంబు."

కాశ్యపగోత్రుఁడనుటవలన నాయక పదమునకు బలము కలుగుచున్నది. గద్యయందు తనకుమాత్రమే నాయకపదమును వాడియుండెను. కాని తనపూర్వులకెవరికిని నాయకపదము నుపయోగ పరుపలేదు. వారికంతకును నృపాల, భూపాల ధరణీనాయ కేత్యాదిపదములనే వాడియున్నాఁడు దండనాయకార్థములోఁ దనకు నాయక

పనము నుపయోగించుకొనెనేమో! ఎట్లయిన నీతనికులము సంశయాత్మకముగనేయున్నది. ఇతని జనకతండ్రి శ్రీరంగరాయలు. ఈతని పినతండ్రి కృష్ణరాజు కుమారుఁడైన వెంకటపతిరాజును, నీకవిని, నీతని మఱియొక సవతిపినతండ్రియైన నారాయణభూపాలుఁడు పెంచుకొనిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ "అలతిమ్మాధిపునారసేంద్రుఁడు దయాధారుండు నన్నుం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్త్రి వేంకటపతిక్ష్మాకాంతచంద్రున్ గుమా
రులుగాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపింపగాఁ దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిద్ధఘనుఁ డెందు న్నందియం బేటికిన్."

ఈకవితాత తిమ్మరాజు; అతనితండ్రి తిప్పరాజు, అతనితండ్రి లక్కరాజు; అతనికిఁ దండ్రి తిమ్మరాజు. వీరందఱును బహుపరాక్రమవంతులై మహమ్మదీయులతోఁ బోరాడినట్లీకవి వర్ణించియున్నాఁడు. కాని యీనవరమువారు స్వతంత్ర ప్రభువులైనట్లు కాన్పింపదు. కర్ణాటరాజులకు సామంతులగనో, దండనాయకులగనో యుండి, తమశౌర్యమును జూపిరని యూహింపవలసియున్నది. తన పూర్వుల నెంతపొగడినను వారేదేశమును పరిపాలించిరో, ఏరాజులకు సామంతులుగనుండిరో యితఁడు చెప్పలేదు. ఇతఁడు తన పూర్వులను వర్ణించిన పద్యములలోఁ గొన్ని చక్కనిభావములతోఁ గూడియున్నందున గ్రంథవిస్తరభీతియున్నను, మూఁడు నాలుగు పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

సీ. విడు పైటచెఱఁగు నే వెఱతు గాయము
మానని మ్మని ఛాయ యొంతేని వేఁడ
నశ్వినుల్మందులకై ద్రోణగిరికిని
చన్బులఁ బోవుకతన వేసరుకొనంగ
నిరుపద్రవము గామి నిలువరాదని రమా
పతి వేలుపాలెంపుఁ బట్టు వెదక
నాయయ్య కిడియపాటా యంచు నలసింహి
కాతనుభవుఁ డోడు కలచికొనఁగఁ

జేఁగి తోఁగకొమ్మ మొగ మింత చేసికొనఁగఁ
తిమ్మనృపశౌరి దినదినోద్భిన్న వైరి
వారబహువార భేదన వర్ధమాన
మైన రవిమేని పెనుగండి మానదయ్యె.

గీ. తిప్పు రపాలకరవాలదీర్ణ యవన
ముష్టిహతి రంభ నొకసి సమ్ముఖముం జేరు
తనయుఁ గని రాజరాజు సంతసముఁ జెందుఁ
దురకగుర్రిద్దను బనికివచ్చెర యటంచు.

చ. అతఁడనుజన్ముఁడైనసుగుణాఢ్యుఁడు లక్కవిభుండు తోడుగా
నతులితు హిందుఖానుని బలావళి ద్రుంప నిలింపు లింపున
న్వితతలతాంతవర్ష మొదవించుట మించు వరించ నొంచిన
న్మతి జయలక్ష్మి నించునవమౌక్తికవృం దలఁబ్రాలు కైవడిన్.

ఈహిందూఖానెవ్వరో తెలిసికొనవలసియున్నది.

ఈకవి పెంపుడుతండ్రియైననారనాధిపుఁడు, వీరవెంకటరాయ ప్రభుని పట్టాభిషేకసమయమందున్నట్లును, ఆతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడైనట్లును నీక్రిందిపద్యములలో వర్ణించియున్నాఁడు.

సీ. బహువర్షములు గన్నపాథోనిధి స్వామి
నవ్యలావణ్య వర్ణనము గనిరొ
సగరవృత్తి నెసంగు జహ్నుమౌనితనూజ
యమృతప్రవాహ విఖ్యాతిఁ గనిరొ
నరవదిగృహలాస్య మరసూని కావేరి
రంగస్థలాభివర్తనముఁ గనిరొఁ
గడుసుగ్రిగతిరొయుంగని నర్మదానది
సోమోద్భవాదివిశ్రుతులు గనిరొ
నేకుమారునిపట్టాభిషేకసమయ
మందు నిజవారి నొసఁగుభాగ్యమున నట్టి
వీరవేంకటరాయ భూవిభునికరుణ
నెలమిఁ బాలించె నిల నారనేశ్వరుండు

సీ. చలపట్టెనా వైరిజనపాలకుల కొక్క
ముక్కాఁడనీచుక యుక్కడంచుఁ
బూనెనా యరిధరాధిపుల నంతికల
హంబుఁ గల్పించి పాయంగఁ జేయు
నెంచెనా పరిపంథి పృథివీపతుల దాడి
వెడలించి తనవెంట వెంటఁ ద్రిప్పు
దలఁచెనా రిపురాజి దనహజారంబునఁ
బడిగాపులై తడఁబడఁగఁజేయు
నితనితోడుత వైరమిాడేల దనుచు
సకలధరణీశులెప్పుడు నిచ్చక మొనర్చు
వీరవేంకటరాయభూవిభుని కరుణఁ
బరఁగు నారాయణ క్షమాపాలవరుఁడు.

సీ. తనమాట కాంచికా తంజావురీ మధు
రాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్ర ముఖధ
రాధవపద్మబంధులౌ దలధరింపఁ
దనకీర్తి మల్లనంతనృపాలముఖ్యగో
త్రామరేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూ
నిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
వెలయు కోదండగండనిర్గళదనర్గ
ళమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృడ్డిండిమారావ దుర్యసైన్యుఁ
డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాథినేత...

కువలయాశ్వ చరిత్రము:—

చ. తొలఁకెడు తావిగందవొడి తూరుపువాలిఁగఁబట్టి మల్లెపూ
వలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి మెఱుంగుఁబోండ్లగు

బ్బులపయి చంద్రకావిజిగిపయ్యెదకొంగు వెడల్చి నొందునై
దెలియక తూలుకొంచు వలిదెమ్మరలాహిరికాఁడు త్రిమ్మరున్ ౨౧

సీ. వలసినయెడకుఁగమ్మలువ్రాయు వ్రాయసం
బులవారిగంటాల కిలకిలలును
దొరదలంచినకార్యసరణులెంచునమాత్య
కుంజరంబులొనర్చు గుసగుసలును
బొలదిండిరాయలయలవులగనివచ్చి
నిలుచువేగులవారి కలకలములు
వరుసకిందఱటంచు వంతులేర్పడియున్న
బలకరంబులవారి యలబలములు
నెవుడు వెడలునోకోయంచు నెంచియాడఁ
జూచు సంగీతమేళంబు సొగసుకాండ్ర
ధిమ్మనెడి మద్దెలమ్రోఁత గ్రమ్మకొనియె
రాజుపవళించు తెలిగుడారంబుమ్రోల ౨౨

చ. సరసిజగంధి నీమది విచారము దోఁపగ శోకించు తే
దరయఁగఁ గారణంబు నవయౌవన రూపకలావిలాస భా
స్వరుఁడగునట్టి యొక్కనృగవానిపయిం గనువైచితేమొ దు
ష్కరకర చింతచే నదియొ కావలయుం దలపోసి చూచినన్ ౨౩

ఉ. అమ్మక చెల్ల! యెన్నివగలద్దిర! నాయకుఁడొద్దనుండఁగా
నెమ్మెలుగాక యేమవర మిచ్చెద నంటి విదేటిమాటదో
సమ్మసుమీ వధూటులకు జవ్వని నాథుననుజ్ఞలేక యే
కొమ్మని యీఁగఁజెల్లునె యకుంఠితచాతురి గల్గియుండినన్ ౨౪

ఈచిననారాయణ నాయకుని కాలమునుగూర్చి భిన్నాభిప్రాయములున్నవి. బ్ర. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమయాంధ్రకవుల చరిత్రమునం దీకవి క్రీ. శ. 1580 ప్రాంతము వాఁడని వ్రాసియున్నారు. కువలయాశ్వ చరిత్రమును సరస్వతి పత్రికలోఁ బ్రకటించిన సరస్వతీపత్రికాధిపతులును పోలవర సంస్థానప్రభువులు నగు శ్రీకొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు బి. ఏ. గారు పీఠికలో నీకవి

క్రీ. శ. 1520 ప్రాంతము వాఁడని వ్రాసియున్నారు. వీరిరువురు నిట్లు వ్రాయుట కీగ్రంథకృతిపతియు, కృతికర్తయుఁ దండ్రియు నగునారసాధినేత వీరవెంకటపతిరాయల పట్టాభిషేక సమయమున నున్నాఁడని కవి వ్రాయుటచేతను, వీరవెంకటపతిరాయలు వసుచరిత్ర కృతినందిన ఆరవీటి తిరుమలరాయల కుమారుఁడనియు నాతనియభిషేకము క్రీ శ. 1680 ప్రాంతమున జరిగెననియుఁ దలంచి, యదికారణముగాఁ గైకొనిరి. కువలాయాశ్వ కృత్యాదిలోఁ గృతిపతిని వర్ణించుసందర్భమున "తనకీర్తి మల్లనంతనృపాలి ముఖ్యగోత్రామరేంద్రులు గొనియాడికొనఁగ" అని వ్రాసియుండుట చేతను మల్లఅనంతభూపాలుఁడు క్రీ.శ. 1580 ప్రాంతము వాఁడగుటచేతను, ఆవిషయమునుగూడ శ్రీవీరేశలింగము పంతులుగారాధారముగాఁ గైకొనిరి.

వీరినిర్ణయము సరియైనదే యని నేనుగూడ నభిప్రాయపడితిని. కాని, ఆచార్య శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు, శ్రీ వీరేశలింగము పంతులుగారి నిర్ణయము నంగీకరింపక యీకవి క్రీ. శ. 1630–1640 కిఁ దరు వాతి వాఁ డ ని ని ర్ణ యిం చి రి. కు వ ల యాశ్వచరిత్ర కృత్యాదియందుఁ గవి కృతిపతిని "శ్రీరంగరాజకుమార వెంకటేశరాయ భుజబలసహాయ బహువిధోపాయధురీణుండును" అని వర్ణించిన వాక్యములు వారినిర్ణయమున కాధారములు. కృతిపతిని "కర్ణాట కాధీశ్వరదయాసాంద్రుండగు నారాయణవసుంధరాదేవేంద్రుఁడనియు, వీరవెంకటరాయభూవిభునికరుణ నెలమిఁ బొలిచె నిలనారణేశ్వరుండు" అనియుఁ గవివర్ణించినాఁడని శ్రీవేంకటరమణయ్యగారును అంగీకరించుచున్నారు. కాని కవి "శ్రీ రంగరాజకుమార వేంకటేశరాయ...... ధురీణుండును" అనివ్రాసియుండుటచే నీశ్రీరంగరాజు అళియరామరాజు కుమారుఁడైన శ్రీరంగరాయలనియు ఆతనికుమారుఁడు వెంకటపతి రాయలనియు నీతనిని "ముమ్మడి వెంకట దేవరాయలని" చరిత్రకారులు పేర్కొనెదరనియు, నాతఁడు క్రీ. శ. 1630–1642 వఱకు రాజ్యమేలినవాఁడనియు అతనికి సాయమొనర్చిన నారాయణరాజు (కృతిపతి) యాకాలమునం దుండియుండవలయుననియు నాతనికుమారుఁడైన చిన

నారాయణనాయకుఁడు (కృతికర్త) యంతకుఁ దరువాతివాఁడనియు శ్రీవెంకటరమణయ్యగా రభిప్రాయపడిరి.

ఆచార్యశ్రీవెంకటరమణయ్యగారియందు విశేషగౌరవముంచుచు నేనీసందర్భమున వారితో భిన్నాభిప్రాయుఁడ నగుచున్నాఁడను. పైనినుదాహరించిన కృత్యాది వాక్యములలోని శ్రీరంగరాజు అళియరామరాయలతనయుఁడైన శ్రీరంగరాయలు కాఁడనియు, నాతని కుమారుఁడైన వెంకటేశరాయలు ముమ్మడి వెంకట యనిచరిత్రకారులచే పేర్కొనఁబడు వెంకటపతిరాయలు కాఁడనియు నాయభిప్రాయము. కువలయాశ్వచరిత్ర కృతిపతి యగునారణేంద్రునకు శ్రీరంగరాయ లను సవతిసోదరుఁడు కలఁడు. ఆశ్రీరంగయలకుమారుఁడే వెంకటేశరాయలు. ఆతనిభుజబలమును సాహాయ్యముగాఁగొని నారణేంద్రుఁడు ప్రవర్తిల్లెనని కవి పైవాక్యములలో వ్రాసియున్నాడు. ఆశ్రీరంగరాయలను అళియ రామరాజుతనయుఁ డనిభావించి, కాలనిర్ణయమును చేయుటలో శ్రీ వెంకటరమణయ్యగారు పొరపడిరని తలంచుచున్నాఁడను. కృతిపతియగు నారణేంద్రునితండ్రి తమ్మరాజు. ఇతనికాగ్గురుభార్యలు. ఎనమండ్రు కుమారులు. కృత్యాది యందలి యాక్రిందివచనమువలన శ్రీరంగరాయలు కృతిపతికి సవతిసోదరుఁడని తెలియుచున్నది.

"ఆమంధరవీర్యుం డగుతిమ్మనృపశేఖరవుండు తిరుమలాంబయందు గంభీర భేరీమహారావ నిర్దళిత కకుప్పటలనికాయుం డగుతిప్పనృపాలుని, రణరంగసంగతజయరమాధుర్యుం డగు రంగరాయనృపవర్యుని నుష్ణకరతేజుం డగు కృష్ణధరాబిడౌజునిం గనియెమూర్తిమాంబయందుఁ గర్ణాటకాదీశ్వర దయాసాంద్రు డగునారాయణ వసుంధరాదేవేంద్రునిం(ఇతఁడే కృతిపతి) బెదరంగమాంబయందు నమందవితరణశాలి యగు రఘునాథ నరనాథ మౌళిని లక్ష్మాంబయందు నౌదార్యనిస్తంద్రుం డగు రామప్రభుచంద్రునిఁ గొండమాంబయందు ధర్మవిద్యాదిలీపుండగుగోవిందభూపుని గురవమాంబయందు శౌర్యహర్యక్షుండగు తిమ్మధరాధ్యక్షునింగాంచె.

ఇందులో రెండవకుమారుఁడైన శ్రీరంగరాయలను గవి మూఁడు పద్యములలో వర్ణించియున్నాఁడు. అందీక్రిఁది సీస పద్య మొకటి

సీ. తనకుఁ గూఁతు నొసంగి తనరిన దక్షుఁ
డిష్టార్థభంగముఁ జెంది యవలఁ దిరుగఁ
దనకు ననంతపద్మార్థి యొసఁగిన
చతురాస్యుఁ డెపుడు విచారమందఁ
దనపైఁ బదం బమర్చినపురుషోత్తమ
డొందు నిరాకృతిఁ జెందినిలువఁ
దనకు సత్కృతిపతిత్వం బిడినటు దేంద్రుఁ
డాశానువృత్తి నిత్యంబు బొలఁగ
వెలయుటదియెల్ల యేదానవిధమటంచుఁ
జంద్రనీరదశిబికర్ణసరణిఁ గెరి
సుకవివర్యుల కఖిలార్థనికర మిచ్చుఁ
బ్రకటగుణుఁ డైనశ్రీరంగరాయనృపతి.

ఈశ్రీరంగరాయలకుఁ దిమ్మమాంబ, తిరుమలాంబ యనునిరువురు భార్యలు. ఈశ్రీరంగరాయలకుఁ దిరుమలాంబవలన జనించిన కుమారుఁడే కువలయాశ్వచరిత్ర కృతికర్త.

మ. అతఁ డాతిమ్మమయందు వేంకటనృపాధ్యక్షుఁ రిపుక్షేపణో
ద్ధతురంగాధిపుఁ దిర్మలాంబవలనన్ ధర్మాత్మగోపాలు స
న్నుతకీర్తిం జినవారనాఖ్యుఁ డగునన్నుం గస్తురీంద్రున్నమం
చితకీర్తిం బ్రథునాథుఁ దిమ్మవిభుఁ గాంచె న్సజ్జనాధీరులన్.

ఆరవీటి శ్రీరంగరాయలతల్లి లక్ష్మమ్మ. నవరము శ్రీరంగరాయల తల్లి తిరుమలాంబ. ఆరవీటి (మూఁడవ) వేంకటపతి తల్లి లక్ష్మమ్మ. నవరము వెంకటపతితల్లి తిమ్మమ్మ. కువలయాశ్వ చరిత్ర కృతికర్తయగు చిననారాయణనాయకుఁడు తన సవతి సోదరుఁడగు వెంకటపతియొక్క భుజబల సాహాయ్యమును తన దత్తతతండ్రి యగు నారణేంద్రుఁడు కలిగియుండెనని పైవాక్యములలోఁ జెప్పియుండెనే కాని, ఆళియరామరాజు కుమారుఁడైన శ్రీరంగరాయల తనయుఁడైన

వెంకటపతికి, తనదత్తత తండ్రి సాహాయ్యమొనర్చెనని యావాక్యములలోఁ జెప్పలేదు. అట్లు చెప్పుట కవి యుద్దేశము కాదు. కావున మూఁడవ వెంకటపతి రాయలను బట్టి కవికాలమును నిర్ణయింపరాదు వసుచరిత్ర కృతినాయకుఁ డగు శ్రీతిరుమలరాయల నాల్గవకుమారుఁడైన శ్రీవెంకటపతిరాయలు పట్టాభిషిక్తుఁడైన క్రీ.శ. 1580 సంవత్సరమునఁ గృతిపతియున్నాఁడు. కావున అతని దత్తతకుమారుఁడైన కృతికర్త క్రీ. శ. 1600 ప్రాంతమువాఁడని నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. ఇట్లు నిర్ణయించినచో, మట్లి అనంతభూపాలుఁడు కూడ నా కాలము వాఁడే. కావున కృత్యాదిపద్యములో సరిపోవును. శ్రీ వెంకటరమణయ్యగారనినట్లు అనంతభూపాలునకుఁ "కు మా ర" శబ్దమును జేర్చి కుమార అనంతభూపాలుఁ డని సరిపుచ్చుకొన వలసిన యవసరముండదు.

శ్రీ వెంకటరమణయ్య పంతులుగారు, తంజావూరు విజయ రాఘవ నృపాలకృతమగు రఘునాథాభ్యుదయమందలి

"వీరుఁడౌ సవరము వెంకటపతిని
పాఁదోలించి నీపంపులచేత
పట్టినసీమలో పందనల్లూరు
గట్టించితివి ఘటిమాత్రమునన్."

అను పద్యములోని వెంకటపతి, చిననారాయణ నాయకకవికి అగ్రజుఁడనియు వారిరువురు సమకాలికులనియు, నాపక్షములో క్రీ. శ. 1633లో పట్టాభిషిక్తుఁడైన విజయరాఘవభూపాలుఁడు అంతకుఁ బూర్వుఁడైన వెంకటపతిని జయించుట పొసగదనియుఁ, గావున చిననారాయణనాయకుని క్రీ. శ. 1633 సంవత్సరమునకుఁ దరువాతివానినిగా నిర్ణయింప వలయుననియు, శ్రీ వెంకటరమణయ్య పంతులుగారి యభిప్రాయము.

పై పద్యములో సవరము వెంకటపతిని గూర్చిన వివరములుగాని, పందనల్లూరును గూర్చిన వివరములుగాని లేవు. అందుచే నీ కవికాలనిర్ణయమున కాపద్యము నాధారముగాఁ దీసికొనరాదని నా

యభిప్రాయము. ఆ వెంకటపతి కవికి సవతిసోదరుఁడే యని యంగీక రించినను, అతఁడు అరువదేండ్లు అనఁగా క్రీ. శ 1635 వఱకు జీవించి యుండవచ్చును. విజయరాఘవనాయకుఁ డప్పుడాతనిని జయించి యుండవచ్చును. లేదా, ఆ వెంకటపతి పౌత్త్రుఁడు వెంకటపతి బయలువెడలి పండనల్లూరు నేలుచుండఁగా నాతనిని విజయరాఘవ నాయకుఁడు జయించి యుండవచ్చును.

సుప్రసిద్ధములయిన వీరి వెంకటపతిరాయ మట్లి అనంతభూపాలాది నామముల యాధారముచే నిర్ణయమైన కవి కాలమును, ఆనామములకు వేఱు నామములని యర్థము చెప్పి సందేహాస్పదమైన యీ పద్యము నాధారముగాఁగొని మార్చరాదని నాయభిప్రాయము.

---

# 247 మల్లారెడ్డి దేశాయి

ఇతఁడు మొటవాడ రెడ్డికులజుఁడు; బిజ్జల తిమ్మభూపాలునివలెనే యితఁడును మొటవాడ వంశజుఁడనని చెప్పుకొని యున్నాఁడు.

ఇతని తండ్రి రంగారెడ్డి; తాత పర్వతరెడ్డి; ఈకవి గంగా పుర మాహాత్మ్య మను నొక పద్య కావ్యమును రచించెను. ఇదియెన్ని యాశ్వాసములో తెలియదు ప్రథమాశ్వాసమును ద్వితీయా శ్వాసములో గొంత భాగమునుగల యొక వ్రాతప్రతి యాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున నున్నది. అందుఁ జెప్పఁబడిన క్రమమును బట్టి కవి వంశావళి యీక్రిందిరీతినున్నది. షట్చక్రవర్తి చారిత్ర మును రచించిన మల్లారెడ్డి యితఁడు కాఁడు. అతఁడు కాచారెడ్డి కుమారుఁడు. ఇతని తండ్రి రంగారెడ్డి.




కృతికర్తకు పెదతాతయైన మల్లారెడ్డి కుతుబ్‌షాహి చేత గౌరవింపఁబడినట్లు కవి యీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. పాల్వాలగోత్ర సంపూర్ణాబ్ధి చంద్రుండు
మల్లభూనాథుఁడు మాన్యయశుఁడు
శ్రీనాథపదపద్మ సేవాధురీణుండు
సత్యభామా హంశ్చంద్రుఁ డతుల
మహనీయకీర్తిచే మాంధాతృకైవడి
శిబిఖేచరాదుల చెలువుమిగుల
సెన్నగాఁ గార్తవీర్యార్జునుకైవడి
శోభిల్లు దిక్కుల శోభనముగ

గీ. కుతుబుశాహినరేంద్రుచేఁ గోర్కెలలర
నందలంబును దళీవు లందుకొనుచు
సరసపూర్ణుల పట్టణ చౌదరగుచుఁ
బ్రజలఁబాలించె భూభుజుల్ బ్రస్తుతింప

కులీకుతుబ్‌షాహి పదునాఱవశతాబ్ది ప్రథమభాగమునందున్న వాఁడగుటచే నాతనిచే గౌరవింపఁబడిన మల్లారెడ్డికి తమ్ముని మనుమఁడైన యీకవి క్రీ. శ. ౧౬౦౦ సంవత్సరప్రాంతము నున్నవాఁడని చెప్ప వచ్చును. ఈతఁడు వైష్ణవమతాభిమాని. తిరుమలబొబ్బుని శిష్యుడు. పరాంకుశదాస, రామానుజులను వైష్ణవ భక్తులతోఁ జేర్చి వర్ణించినాఁడు. ఈతఁడు రచించిన గంగాపురము నిజాము రాష్ట్రము లోనిది. ఆపట్టణమును కవియిట్లు వర్ణించియున్నాఁడు.

సీ. కృతయుగాది నిలసత్కీర్తనీయంబయ్యె
వజ్రాపురంబన స్వాత్మమెన్న్య!
త్రేతాయుగంబున దేదీప్యమానమై
దురితకోలాహల స్ఫురణఁదనరు
ద్వాపరయుగమున వర్ధిల్లనతి కెక్కె
మాయాపురంబన శ్రేయమగుచు
కలియుగంబునమించె గంగాపురంబన
భుక్తిముక్తి ప్రధానసక్తమగుచు

గీ. నట్టి గంగాపురాధ్యక్షు నంబుజాక్షు
శ్రీరమానాథుఁ గేశవుఁ జిన్మయాత్మ
నిలయ సుక్షేత్రమహిమంబు దెలిపి పలుకఁ
దరమె శంభునకైన విధాతకైన.

## 248 కుందుర్తి గోవిందమంత్రి

ఇతఁడు ద్వైతనియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శాండిల్య గోత్రుఁడు; అహోబలమంత్రి కుమారుఁడు. ఈతని మనుమఁడైన వెంకటాచలకవి మిత్రవిందా పరిణయమను ప్రబంధమును రచియించియుండెను. అందీగోవిందకవి "భారతీ పరిణయ" మను ప్రబంధమును రచించి వీరవెంకటపతిరాయల కంకితముచేసి కనకాభిషేకము నొందినట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

చ. పటుతర గోస్తనీమధురపాకసమంచితమై రసోన్నత ప
ర్యట మగుభారతీపరిణయం బనుకావ్య మొసంగి వీరవెం
కట పతిరాయలం దనిపి కాంచె మణీకనకాభిషేక ము
త్కటగతి నమ్మహామతి సుఖస్థితి శోభియశోభిరాముఁడై.

సీ. గీ. అతఁడు సామాన్యుఁడా? షట్సహస్రకులప
రీత కుందుర్తి ధవళాంతరీప దీపుఁ
డాగమాంచల విద్యావిహారహారి
విశ్వపరితోషకారి గోవిందశౌరి.

ఈగోవిందమంత్రికిఁ దండ్రియైన యహోబలమంత్రి గొప్ప పండితుఁడై యశ్వపతి గజపతులను మెప్పించిన ట్లీక్రింది పద్యములో వేంకటాచలపతి నుడివియున్నాఁడు.

శా. మెప్పించెం గటకాధిపాశ్వపతి భూమీపండితశ్రేణిఁ దా
నిప్పించెన్ శిబికన్ఖేచరులయ ట్లిష్టార్థ మర్థ్యాళికిన్
గప్పించె న్నిజకీర్తిచంద్రికల దిక్కాండంబు యజ్ఞాదులన్
రప్పించెన్ హవిరంశభుక్కికి హరిబ్రహ్మాదుల న్నిచ్చలున్.

కుందుర్తియను గ్రామము బళ్లారి మండలమునందున్నది దానిని బట్టి యీకవి వంశమునకు కుందుర్తివారను గృహనామము వచ్చియుండును. శ్రీకృష్ణదేవరాయలీగ్రామమును శా. శ. ౧౪౩౩లో నగ్ర

హారముగాఁ జేసినట్లొక తామ్రశాసనము కలదు౧. కుందుర్తి తిరుమలయ్యయను నాతఁడు కడప మండలములోని పొట్లదుర్తియను గ్రామమును నచ్యుతరాయలకాలములో నగ్రహారముగాఁ జేసి పండితుల కిచ్చినట్లొక శిలాశాసనము కలదు౨.

ఈగోవిందయ్యకుఁ దిమ్మయార్యుఁ డనుకుమారుఁ డుండినట్లు వెంకటాచలకవి కృతమిత్రవిందాపరిణయ కృత్యాదియందలి యీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

సీ. షడ్దర్శనీమనీషాసమున్మేష వా
చస్పతి మంధాద్రిసమ సమగ్ర
ధృతి యైన వెంకటపతి శౌర్యజితవైరి
సమ్మర్దుఁడై పొల్చు తిమ్మయార్యుఁ
డమితగాంధర్వ విద్యావిషన్యాయ మా
నుఁడు నారణప్ప సన్నుతకకుప్ప
టవికానిరంతరోజ్జ్వలకీర్తి గోపాల
మంత్రిబాహాటశాస్త్ర మహితపాండి
తీనిరాకృత నాసత్యధీ విశేషుఁ
డై చెలఁగు రంగయామాత్యుఁ డలయుగంధ
రాది మంత్రివతంస మేదాభిరాముఁ
డతులగుణధాముఁ డగురాముఁ డనఁగ జగతి.

గోవిందయ వీరవెంకటపతిరాయల కాలములోనివాఁడై యుండఁగా నాతనితనయుఁ డచ్యుతరాయల కాలములో నుండుట యసంభవము. కావున నాశాసనకర్త గోవిందకవి కుమారుఁడైన యీ తిమ్మయార్యుఁడని తలంపరాదు. ఆతఁడు గోవిందకవికిఁ బూర్వుఁడై యుండును.

---

౧ న్యూయెల్ పండితుని శాసనముల పట్టిక. సంఖ్య ౧౨౩:
౨ దత్తమండల శాసన సంపుటము పుట ౧౧౧ సంఖ్య ౬౮.

## 249 రేటూరి భావనామాత్యుఁడు

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; ప్రెగడయామాత్యుని పౌత్రుఁడు; నాంచారమాంబారామధీమణుల పుత్త్రుఁడు అద్దంకి సింగరాచార్యుల శిష్యుఁడు.

ఈకవి కామేశ్వరీ చరిత్రమును ద్విపద కావ్యముగా రచియించి, గుంటి చెరువునందు వెలసియున్న కామేశ్వరీదేవికిఁ గృతి యొసంగెను. ఆదిలక్ష్మి శ్రీరామచంద్రమూర్తిని మోహించి యాతఁ డేకపత్నీవ్రతుఁ డగుటచే నాయవతారమున మనోరథసిద్ధి కాకపోఁగా నాతనిని కృష్ణావతారము నెత్తుమని శపించి తాను కామేశ్వరిగా నవతరించునట్లు శ్రీరామ చంద్రునిచే శపింపఁబడి యట్లవతారముల నెత్తియుఁ దనప్రియుని బొందఁజాలక లోకమున ననేకుల కిలువేల్పుగా నర్చింపఁబడుచు వారి కిష్టార్థము లిచ్చుచు విరహవ్యథ నోర్చుచు వెలయుచున్న కథ యిందు వర్ణితమైనది. ఈకథనే అక్కిసెపల్లి నరసింహాకవి "ఆదిలక్ష్మీవిలాసము" అను పేరఁ బద్యకావ్యముగా రచియించియున్నాఁడు. ఆపద్యకృతికిని ఈద్విపదకృతికిని ఫలితమున వ్యత్యాస మున్నట్లు కన్పట్టుచున్నది.

కవి తనవృత్తాంతమును జెప్పియున్న ద్విపదల నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను.

"నయకీర్తి రేటూరి నరసింహమూర్తిఁ
బ్రియమొప్ప నుతియించి పేర్మిఁదలంచి

* * *

హద్దు (?) గాముద్గురుండై దనరునట్టి
యద్దంకి శ్రీసింగరాచార్యుఁ దలఁచి
ద్విపదగా నాకకథ తెలిగింపఁ బూని
యపరిమితానంద మొందియున్నంత
శ్రీ మహాలక్ష్మి యాశ్రితకల్పవల్లి
ప్రేమతో మముఁ బ్రోవఁ బేర్మిఁదలంచి
కలలోనఁ దనరూపు కరుణించి చూపి
పలుమాఱు పలికె తాత్పర్యంబు మీఱ

నేమించి విను మన్న నెఱ్ఱగుంటి చెఱువు
కామేశ్వరి ననంగఁ గలమహావేల్పు
శ్రీరామచంద్రుని చేతిశాపమున
ధారుణిఁ బుట్టితిఁ దప్పు దీమాట
శ్రీకృష్ణదేవుని చెలిమిగోరుచును
నాకుఁ దోడైనకన్యలు మఱిఁ గలరు.
కరమొప్పు రేటూరి గంగమంత్రీంద్ర!
యరవొప్ప ననుఁ గొల్తు రెల్లకాలంబు
నీకవిత్వప్రౌఢి నెలకొన నిపుడు
నాకథయెల్ల మన్ననలారఁ జెప్పు
మనువొంద నీకు నిష్టార్థంబు గలుగు
ఘనతతో నిచ్చెత నైకొనుము వేగ
నిరువొంద నందున కెఱుక మీతల్లి
కురులపై నిల్చితిఁ గొలువుమీ నన్ను
అని ప్రసన్నతఁ బల్కి యాజాడఁ దెల్ప
నొనరంగ సాష్టాంగ మెఱఁగినవాఁడ
తెలిసి మేల్కని మహోదృఢచిత్త మలర
విలసితం బైనట్టి వేడ్కరచింప
రీతిగాఁ గామేశ్వరీచరిత్రంబు
బ్రీతిఁ జెప్పెద సమర్పణ సేయఁ గోరి
శ్రీవత్సగోత్రుండఁ జెలువంబుగాను
భావయామాత్యుఁడ భవ్యమానసుఁడ
బ్రహ్మండ మన్వయ ప్రభుని సత్కవిని
బ్రహ్మకటాక్షంబుఁ బడసినవారు
మహిలోన బెగడయమంత్రి పౌత్రుండ
మహికెక్కు రామధీమణి పుత్రుండ
ననువొంద నాంచారమాంబకు సుతుఁడ
నొనర రేటూరిపురి నొప్పినవాఁడ

సాంద్రమై మద్వంశచంద్ర లక్ష్మీ ప
తీంద్ర కీర్తుల మెఱుంగెక్కినవాఁడ

\+ \+ \+

ఆముక గుంటి చెర్వందున్న కుంచ
కామేశ్వరికి నియ్యఁగాఁబూని.

ఈద్విపదలలో "కరమొప్పు రేటూరి గంగమంత్రీంద్ర" యని యేల చెప్పఁబడియెనో, తెలియకున్నది. ఈభావనామాత్యునకు నామాంతరమేమో !

ఈ "కామేశ్వరీదేవి" మిక్కిలి శక్తిగల దేవత. ఆదిలక్ష్మి, కామేశ్వరి, కామవల్లి, అక్కలు, అనుపేరులతో బ్రాహ్మణు లీమెనారాధించుచుందురు. ఈమెను గొలిచి యద్భుత మహిమలను జూపిన బ్రాహ్మణులు పెక్కురుకలరు. అట్టికథలాంధ్రదేశమున నెక్కువగాఁ జెప్పుకొనుచుందురు.

ఈ రేటూరు గుంటూరుమండలమున బాపట్లకుత్తరమున నెనిమిది మైళ్లదూరమున నున్నది. ఈ రేటూరినే రెంటూరనికూడ నందురు. రేటూరివారెవ్వరు నిప్పుడచ్చట బ్రాహ్మణులలో లేరు. భానుమతీ పరిణయమును రచించిన రేటూరి రంగరాజీ కుటుంబములోనివాఁడే. అతఁడు నీతఁడునుగూడ నద్దంకి సింగరాచార్యుని శిష్యులు. ఆతనితండ్రిపేరు చినగంగన. పైనిఁ జెప్పిన "గంగమంత్రీంద్ర" లోని గఁగమంత్రి యీతనికి నామాంతరమైనచో రంగరాజీతని కన్నకుమారుఁడై యుండును. రంగరాజకవి తన తాతపేరు చెప్పలేదు. చెప్పియున్నచో, వీరిబంధుత్వము కొంత తెలియవచ్చును

రంగరాజు కాలమును క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతమని యాతని చారిత్రమున వ్రాసియుంటిని. ఏకగురుశిష్యులగుటచే నీతఁడును నా కాలమునందున్నవాఁడే.

మహామహోపాధ్యాయ భట్టారక బాలసరస్వతీ బిరుదాంచితుఁడై యనేక గ్రంథరచనాధురీణుఁడై పేరుగాంచిన యీకవివతంసుఁడు వైదిక బ్రాహ్మణుఁడు; కౌండిన్యగోత్రుఁడు; భైరవార్యపౌత్రుఁడు; కృష్ణదేవతనూజుఁడు.

నన్నయభట్టరచితమని చెప్పఁబడు నాంధ్ర శబ్ద చింతామణి కీతఁడు వ్యాఖ్యానము చేసెను. భర్తృహరి మూఁడుశతకముల నాంధ్రీకరించెను. రాఘవ యాదవ పాండవీయ మనుత్ర్యర్థి కావ్యమును రచించెను. రంగకౌముదీనాటకము, చంద్రికాపరిణయము, భాషావివరణము, బాహటము, వామనపురాణము, భ్రమరగీతి ప్రబంధము కార్తికేయాభ్యుదయము మొదలగు గ్రంథములను రచియించెను. ఇందు భర్తృహరియు, నాంధ్ర శబ్ద చింతామణియు, ముద్రితములు చంద్రికాపరిణయము యొక్కయు, రాఘవయాదవపాండవీయము యొక్కయు, నముద్రితప్రతులు మదరాసునందలి ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందున్నవి. తక్కిన గ్రంథములు నామమాత్రావశిష్టములైనవి.

ఈతఁడు రచించిన గ్రంథనామముల నీక్రిందిపద్యములలోఁ జేర్కొనియున్నాడు.

సీ. కవిసమాహితరంగ కౌముదీనామ నా
 టక విధానప్రతిష్ఠాఘనుండ
సారసారస్య సచ్చంద్రికా పరిణయ
 ప్రముఖ శతాగ్రప్రబంధకర్త
నంధ్రచింతామణీ వ్యాఖ్యానభాషావి
 వరణాది బహుతంత్రకరణచణుఁడ
వేదశాస్త్రపురాణ వివిధసంగీత సా
 హిత్యాది విద్యోపబృంహణుండ

ననఘు కౌండిన్యగోత్రుఁడ హరిపదాబ్జ
భక్తిశీలుఁడ నెలనూది భైరవార్య
కృష్ణదేవుతనూజుఁడ నే విచిత్ర
కావ్య మొక్కటి నిర్మింపఁగా దొడంగి
రాఘవ యాదవ పాండవీయము.

సీ. కడుఁ జాలి చెప్పితిఁ గార్తికేయాభ్యుద
యాదికావ్యములు గుణాధికములు
సల్పితిఁ దగ నంధ్రశబ్దచింతామణీ
వ్యాఖ్యాన మఖిలబుధానుమతము
చెలువుగఁ దెలుఁగు సేసితి వామనపురాణ
బాహటాది మహాప్రబంధచయము
లాచరించిన శ్రీ ... ... ...
... ... ...
... ... ...
... ... షడ్భాషావివరణనా ము
శాస్త్రమును రంగకౌముదీసంజ్ఞకంబు
మొదటి ... ... సద్విద్యలెలమి
చంద్రికా పరిణయము.

సీ. భాష్యాదిక గ్రంథ పరిచయోదాత్తుఁడఁ
గౌముదీనాటక కావ్యకవిని
భాషావివరణాఖ్య భవ్యశాస్త్రకరుండ
బాహటస్థాన నిబంధనుండఁ
జంద్రాపరిణయాది సత్కృతిస్రష్టను
(దీ)ప్రవామన పురాణప్రబంధ
భ్రామరగీతి ప్రబంధౌఘకర్తను
దక్షిణకాళియా తంత్రిచణుఁడఁ
బ్రకట యాదవరాఘవ పాండవీయ
నామకశ్లేష కవితాప్రణాయకుండ

నలఘుకౌండిన్యగోత్రుండ నఖిలసుకవి
తాస్వతంత్రుండ బహుకళాధరుఁడ నేను.

వ. వేంకటకృష్ణయాఖ్యుండ నే నంధ్రశబ్దచింతామణిఁ దెలిఁగించెద...
" ఆంధ్రశబ్దచింతామణీవ్యాఖ్య "

దీనినిబట్టి యీకవి నిజనామము వెంకటకృష్ణయ్యయనియు, బాలసరస్వతి యనునది బిరుదనామమనియు స్పష్టమగుచున్నది. ఈకవి నివాసము గోదావరిమండలమని కొందఱును, కృష్ణామండలమని తాకు సూర్యప్పకవియు ననియున్నారు. ఆంధ్రశబ్దచింతామణియందలి యీ క్రింది పద్యమువలన నీతఁడు పాకనాఁటివాఁడనియు నీతనితల్లి లక్ష్మమాంబిక యనియు, నీతని కాదిత్యకవి యనునొకసోదరుఁడు గలఁడ నియుఁ దెలియుచున్నది.

ఆ. పాకనాటి సుకవిపండిత ముఖజనా
నార్యుఁ డైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతులము.

శిథిలమైపోఁగా దొరకిన యాంధ్రశబ్ద చింతామణియందలి యీ క్రింది పద్యభాగములవలన నళియరామరాజకవి పూర్వులకు "ఎడవల్లి" యను గ్రామమును ఛత్రచామరాదులను దత్తము చేసినని తెలియవచ్చుచున్నది.

సీ. స్థిరకీర్తి యెలకీర్తి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలువల్లభ సోమయాజి
నతనికిఁ దిప్పన్నయు యజ్ఞన్నయు ననంగ
సుచరిత్రు లిద్దఱు సుతులు పుట్టి
రా తిప్పనకు భైరవన్న నన్నయ నాఁగ
నలఘు లిద్దరు తనూజులు జనించి
రా భైరవునకు నొజ్జర తిర్మలయ్య రా
మనయుఁ జిట్టపయును సూరనయును గల్గి

రాతిరుమలేంద్రుఁ డళియరామావనీశ
దత్తయెడవల్లివామ సద్గ్రామహేమ
చామరచ్ఛత్రపల్యంకికా మణీ
విభూషుఁడై పైదుమిస్ఫూర్తిఁ బొలుపు మించె

ఉ. ఆత్మనఘుండు రామఘనుఁ డాత్మజులం గనియెన్ శుచిత్వసాం
తత్యగభీరు భైరవుని నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రి భైరవమనీషికిఁ గల్గిరి సత్కుమారులా
దిత్యుఁడు కృష్ణసత్కవి సుధీజనవందితుఁ డబ్బనార్యుడున్.

ఈకవి రచించిన నాల్గాశ్వాసములుగల రాఘవయాదవ పాండవీయము శ్రీ వేంకటేశ్వరున కంకితము చేసెను. భారత భాగవత రామాయణార్థములు వచ్చునట్లు చెప్పినత్ర్యర్థి కావ్య మిది. ఇట్టి కావ్యరచన కవిప్రజ్ఞ నెఱింగించునను నభిప్రాయమును గవి యీక్రిందిపద్యములలో సూచించి తానీకావ్యమును మిక్కిలిసమర్థతతో రచియించితినని చెప్పుకొనియున్నాఁడు.

తే. ప్రజ్ఞకును సాక్షి యరయఁ గబ్బంబ కాన
నదభ్రతం బైనప్రజ్ఞ కనుగుణంబు
గా నితరదుష్కరం బైన కబ్బమెద్ది
సేయువాఁడనో యంచు యోజించిమదిని.

శా. మెండైనట్టి విచిత్రవైఖరులచే మీఁదౌ మహాకావ్యముల్
దండిం దొల్లియ చేసిరాదిములు తత్కావ్యాధికశ్లాఘమై
నుండన్ రాఘవకృష్ణ పాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నేఁ జేసెదన్.

గీ. ఖ్యాతికై కొందఱేమేమొ త్ర్యర్థికృతులు
చేసితి మటందు రది కల్లసేయ నేల
సరసులకుఁ బ్రీతిపద్యవిస్మయ మొసంగు
నాదు కబ్బంబునకు సాటిలేదు గాన

క. ప్రకృతి కథాశ్రిత యశ్లే
షకావ్య మిది యిందు నిజము శబ్దశ్లేషా
ధి కవిరచన యర్థశ్లే
షకప్తి యొక్కొక్క యెడల జతయై మెఱయున్.

భర్తృహరి సంస్కృతమున నీతిశతకము, శృంగారశతకము, వైరాగ్యశతకము అనుపేరులతో నీతి, శృంగార, వైరాగ్యవిషయ బోధకములగు మూడువందలశ్లోకములను రచియించి యుండెను. దీనికర్త భర్తృహరి యొక్కఁడే కాఁడనియు నిదియొక సంకలిత గ్రంథమనియు, భర్తృహరి సంధానకర్తయనియుఁ గొంద ఱందురు. ఒక్కొక్కశతకమునందు పదేసి పద్ధతులు కలవు. పద్ధతికి పదేసి శ్లోకములు మూర్ఖవిద్వచ్ఛౌర్యార్థ దుర్జనసుజన పరోపకార ధైర్య దైవకర్మ పద్ధతులు నీతిశతకములోనివి. స్త్రీప్రశంస, సంభోగవర్ణనము, కామినీగర్హణము, సువిరక్త దుర్విరక్త వర్ణనము, ఋతువర్ణనము, ననునవి శృంగారశతకము నందలివి. తృష్ణాదూషణము విషయపరిత్యాగవిడంబనము. యాచ్ఞాదైన్యదూషణము భోగాస్థైర్యము, కాలమహిమ, యతినృపతిసంవాదము, మనస్సంబోధనము, నిత్యానిత్యవస్తువిచారము, శివార్చనము, అవధూతచర్య అనునవి వైరాగ్యశతకము లోనివి. ఈ భర్తృహరిని తెలిఁగించినవారిలో నీతఁడే మొదటివాఁడు. ఈతని తరువాత పుష్పగిరి తిమ్మనయు, ఏనుఁగు లక్ష్మణకవియు, భర్తృహరి నాంధ్రీకరించియుండిరి. ఈమూఁడిటిలోను మేలుచేయిలక్ష్మణకవిది. బాలసరస్వతి పద్యములు తిమ్మకవిపద్యములుకంటె రసవంతములుగా నున్నవి. తిమ్మకవిది నీతిశతక మొక్కటి మాత్రమే లభించుచున్నది.

బాలసరస్వతి యీభర్తృహరి శతకములను జటప్రోలు సంస్థానాధిపతియైన సురభి మల్లప్రభువున కంకితముచేసెను. ప్రతిపద్యము నందును కృతిపతిపేరును జేర్చి రచించెను. నాల్గవపాదమున నెక్కువ భాగము కృతిపతినామము కొఱకుంచవలసివచ్చుటచేతను, కృతిపతి

వర్ణన వాక్యములోఁబడిన యతిస్థానమునకు సరిపోవునట్లు నాల్గవపాద ప్రథమాక్షరము వేయవలసివచ్చుటచేతను, శ్లోకము చిన్నదైనను పెద్దదైనను ఆంధ్రీకరణము మత్తేభశార్దూలవృత్తములలో నుండవలసి వచ్చుటచేతను రచనము యథేచ్ఛగా సాగక కొన్నితావుల రసభంగ మును, గుంటినడకయు వచ్చినవి. విషయానుసారముగ నీతిశతకము నందు "సురభిమల్లా నీతివాచస్పతీ" యనియు, శృంగారశతకమున "సురభిమల్లా మానినీమన్మథా" యనియు, వైరాగ్యశతకమున "సురభి మల్లా వైదుషీభూషణా" యనియుఁ గృతిపతిని సంబోధించియున్నాఁడు. జటప్రోలు సంస్థానాధిపతుల వంశములో మల్లభూపతి నామధారు లైదుగురున్నారు. (సురభి మాధవరాయకవి చారిత్రము జూడుఁడు) పెద్దానాయని కుమారుఁడు మల్లానాయఁడు మొదటివాఁడు. ఈయన కుమారుఁ డైన మల్లభూపతి రెండవవాఁడు. (ఈతనిని పెదమల్లానాయఁ డని యనుచుందురు). ఈతఁడే భర్తృహరికృతిపతి యని భర్తృహరి పీఠి కలోనున్నది. కాని యిది నిజముకాదని తోఁచుచున్నది. ఈ పెదమల్లా నాయని కైదుగురు తనయులు. అందుఁ బెద్దవాఁడు మల్లానాయఁడు. (ఇతడు మల్లనామధారులలో మూఁడవవాఁడు. ఇతనిని ముమ్మడి మల్లానాయఁడందురు.) అయిదవతనయుఁడును మల్లానాయఁడే (ఇతనిని చినమల్లానాయఁ డందురు. ఇతడు మల్లనామధారులలో నాల్గవవాఁడు)

పైనిజెప్పిన ముమ్మడి మల్లానాయనికి నలుగురు తనయులు. అందులో రెండవయాతఁడు మల్లానాయఁడు. (ఇతఁ డయిదవమల్లా నాయఁడు) ఇతని మూఁడవకుమారుఁడు మాధవనాయఁడు. ఇతడే చంద్రికాపరిణయ గ్రంథకర్త.

బహుగ్రంథ రచనాధురీణుఁడైనను బాలసరస్వతి తనగ్రంథముల యందెచ్చటను దనకాలమును జెప్పియుండలేదు. ఇతని గ్రంథముల కృతిపతులనుబట్టి యీకవికాలమును నిర్ణయింపవలసియున్నది.

ఇతఁడు రచించినగ్రంథములలో భర్తృహరికృతిపతి సురభి మల్లభూపతి యని పైని జెప్పియుంటిని. ఈమల్లభూపతిని నిర్ణయించినచో దానినిబట్టి కవికాలము నిర్ణయము కాఁగలదు. ఈమల్లభూపతులైదుగు రుండిరని పైని వ్రాసియుంటిని.

భర్తృహరిని కృతినందిన మల్లభూపతుల విషయమునఁ బండితులలో భిన్నాభిప్రాయములున్నవి.

బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు ఎలకూచి బాలసరస్వతి కృతమైన మల్లభూపాలీయ ముద్రితప్రతికి వ్రాసినపీఠికలో నీక్రిందివాక్యములను వ్రాసియున్నారు.

"కడపటి సింగనాయనిగారి జనకులయిన యనపోతనాయఁడుగారే జటప్రోలుసంస్థానమును స్థాపించినవారు. అనపోతానాయడుగారి పౌత్రులు (సింగమనాయఁడుగారి పుత్రులు) మల్లానాయడుగారు. ఈయన తనయుఁడు పెద్దానాయఁడుగారు. ఈతఁడరణ్యప్రాంత గ్రామములయందు తటాకాదులు నిర్మించుటయేకాక తనపేరిట పెద్దాపుర మనుగ్రామమును గట్టించెను. ఈయనకొడుకు పెదమల్లానాయఁడు ఎలకూచి బాలసరస్వతిచే నీగ్రంథమును గృతినందిన దీయనే. ఈతని తనయుఁడు ముమ్మడి మల్లానాయఁడు. దానశౌర్యాదులచేత నేగాక విద్యలచేతను బ్రసిద్ధుఁడయి కృష్ణవిజయమను సంస్కృతగ్రంథమును రచియించెను. ఈయనకుమారుఁడగు మాధవనాయఁడుగారు విజయనగరరాజులకు లోఁబడి రాజ్యపాలనము చేయుచున్నకాలములో శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడైన రామరాజు మహమ్మదీయులకోడి మృతుఁడగుటచేత జటప్రోలుసంస్థానము నిజామురాజ్యమునకు లోఁబడవలసినదయ్యెను. ఈమాధవనాయఁడు తర్కవ్యాకరణాది శాస్త్రముల యందును, గావ్యాలంకారములయందును సమర్థుఁడయి పద్యగద్యాత్మకముగా చంద్రికాపరిణయమును రచియించెను."

పంతులుగారి యీవాక్యములలో నొకటిరెండు పొరపాటులున్నవి. పెద్దానాయడు కుమారుఁడు మల్లానాయఁడుగాని పెదమల్లా

నాయఁడుకాఁడు. ఆమల్లానాయఁడుకుమారుఁడు పెదమల్లానాయఁడు. ఈవిషయము చంద్రికాపరిణయకృత్యాదివలన స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈ పెదమల్లానాయని కుమారుఁడు ముమ్మడి మల్లానాయఁడు. ఇతనికుమారుఁడే చంద్రికాపరిణయ కృతికర్త యగు మాధవనాయఁడుగారు.

పెదమల్లానాయఁడే భర్తృహరి కృతికర్త యని పైవాక్యములలో శ్రీ పంతులుగారు వ్రాసియున్నారు. సురభివారివంశచరిత్రము 107 పుటలోఁ దత్కర్తలగు శ్రీ వెల్లాల సదాశివశాస్త్రులుగారు "వీరి (మాధవనాయనిగారి) రాజ్యకాలమునకు యవనప్రభువులు సార్వభౌములుగా నీరాజ్యమున కేర్పడినందున వారివశముననుండి వీరు రాజ్యముచేసిరి పండితప్రభువులగు వీరికడకు మహామహోపాధ్యాయ బిరుదము గాంచిన ప్రసిద్ధుండగు నెలకూచి బాలసరస్వతీకవి యేతెంచి యుండఁగా నిన్నరేంద్రుండు తమతండ్రిగారి కంకితముగా "సురభిమల్లా నీతివాచస్పతీ, సురభిమల్లా మానినీమన్మథా, సురభిమల్లా వైదుషీభూషణా" అనువాక్యములు చేర్చుకొని భర్తృహరి సుభాషితము నాంధ్రీకరింపుమని నియోగించినఁ దత్కవిరత్నము మట్లరచియించెననియు దానంజేసి యాకవిదారిద్ర్యము తొలఁగిపోయెననియుఁ దెల్పుచున్నారు గ్రంథాదిస్థ మగు నీక్రిందిపద్యముగూడ నీయర్థమును సూచించుచున్నది. చూడుఁడు.

శా. "శ్రీమద్బాలసరస్వతీ ప్రకటలక్ష్మీహేతువై శాంతమై
యామోదావహమై నిజానుభవవేద్యంబై యనేకోదిగా
ద్యామేయ ప్రవిబోధరూపమహితంబై యొప్పు తేజంబు ప్రా
పై మీకున్సిరులిచ్చుతన్ సురభి ల్లా! నీతివాచస్పతీ!"

పెదమల్లానాయునకును మాధవనాయునకును నడుమ నఱువది సంవత్సరముల యంతరమున్నది. భర్తృహరికృతిభర్త పెదమల్లానాయుఁడో! ముమ్మడిమల్లానాయఁడో నిర్దిష్టముగాఁ దెలుపునాధారములు దొరకలేదు. ఈవిషయమున శ్రీపంతులుగారి వాక్యములకంటె శ్రీ

శాస్త్రిలుగారు వ్రాసినదియే యనుసరణీయమని నాయభిప్రాయము. మాధవనాయఁడుగారు క్రీ.శ. 1600 ప్రాంతమునందుండెను. కావున బాలసరస్వతికూడ నాకాలమువాడనియే విర్ణయింతము.

బాలసరస్వతి రచించిన చంద్రికాపరిణయము ననుసరించికూడ నీతనికాలనిర్ణయము చేయుగలమేమో ప్రయత్నించి చూతము.

ఈ చంద్రికాపరిణయమింకను ముద్రితము కాలేదు. ఇది యెన్ని యాశ్వాసములో తెలియదు. ఈగ్రంథము పర్తియాల సంస్థానాధిపతి యగు జూపల్లి వెంకటాద్రిప్రభువు ప్రేరణముచే సరస్వతీదేవికంకిత మొనర్పఁబడినది. జటప్రోలు పర్తియాలసంస్థానములు రెండును నిప్పుడు నిజాము రాష్ట్రములో నున్నవి. జూపల్లివారు పద్మనాయకకులజులు. విప్పర్లగోత్రులు. ఈజూపల్లివారు పరాక్రమవంతులై కరికాలచోళునిచే శ్వేతాతపత్రాది చిహ్నములను బడసినట్లి క్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

సీ. ఏలిక కరికాలచోళునిచే ... ... ...
  తాతపవారణం బందికొనుట
నాత్మపై చకమన్నెహం వీరరాజహం
  వీరులు సూడు గావింపఁ గెరలి
యారిపుల వధించి వారలరిరుధిరార్ద్ర
  చర్మాళిఁ బరిగల
వర్ణవిలాసభా ... ... ... తియు మూర్ధరుం
  డములపై గుబ్బలునమరఁగూర్చి
యట్టిగొడుగులు ... ... ... గల్లవిదిత
ముగఁ బ్రతిష్ఠించుకొన్న యద్భుతచరిత్రి
దీప్తు లారయూరి త్రికుటేశదేవపాద
పద్మభజనైకమతులు జూపల్లివారు.

మ. కవలై శంకరభైరవుల్ మునువు వేడ్కం జోళభూమి న్మహో
త్సవదంజా నొంచయూరి చోళమహీభృత్సామంతులై కాలభై
రవదత్తోగ్రకృపాణులై బిరుదముల్ ప్రాపించి నిరూతశా
త్రవులై మించిరి కంచిశాసనములే తత్సాక్షులై వర్తిలన్.

జూపల్లి కొండలరాయప్రభువు "ఇతిహాససంగ్రహ" మను కావ్యమును గృతినందిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పఁబడినది.

మ. ఘనతం గొండలరాయభూధవుఁడు విఖ్యాతిం జెలంగెం బుధా
ఘనుతం బౌనితిహాససంగ్రహముల సత్కావ్యంబు దా నంది పు
ణ్యానయ ప్రోల్లసమాన బొల్లవరసన్మంత్రీంద్ర మంత్రాంగర
క్షనవశ్యాను చరాయమాణ కటకస్వామ్యాధ రాజ్యేశుఁడై.

ఇతిహాససంగ్రహ కృతికర్త నామ మెఱుంగరాలేదు. ఈ జూపల్లివంశీయుఁడైన రామచంద్రప్రభువు కుతుబ్‌షాహీచేత జుజ్జూరు రాజ్యాధిపత్యంబు సంపాదించినటును, పరాక్రమవంతుఁడైనట్లు నీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది.

తే. కీర్తినిధి యైన యయ్యనక్షితివరునకుఁ
బ్రభవమందెను రామచంద్రప్రభుండు
కుతుపశహాదత్త జుజ్జూరిగురుతరావ
నీమహారాజ్య సామ్రాజ్యనిష్ఠఁ దెన్న.

ఉ. పెడిదపుటున్నతిం దనరు పిన్నలికోట మహోహయంబు బి
ల్విడి దుమికించి యుప్పరపువీథి విచిత్రత మీఱ దాఁటి పెం
పడరఁగఁ బుచ్చి తొల్లి త్రిపురాసురభంజనకేళిదీప్రుఁడౌ
మృడుగతి రామచంద్రమనుజేంద్రుఁడు శత్రులఁగూల్చె రూపఱన్.

ఈరామచంద్రనాయకుని పౌత్రుఁడైన కృష్ణభూవిభుఁడు సంగీతసాహిత్య కవిత్వములయందు గొప్పపండితుఁడని నీక్రిందిపద్యములలో గీర్తింపఁబడినాఁడు. కాని యాతఁడు రచించినగ్రంథముల నామములేవియుఁ దెలియరాలేదు.

సీ. అనఁటిపం డొలిచి యిచ్చినరీతి జనులకు
వేడ్కగాఁ గృతులు గావించువిద్య
భాష్యచింతామణీ ప్రముఖశాస్త్రములఁ ద
ర్కించి గీష్పతినైనఁ గెలుచువిద్య
దర్శితప్రతిరాగతానన సహస్రుఁడై
యింపుగా వీణ వాయించువిద్య
శిలలెల్లఁ బండు వెన్నెల సోఁకినసుధాంశు
శిలలుగా గానము సేయువిద్య
యెఱుఁగు నెఱుఁగనివిద్య లే దెల్లవిద్య
లెఱుఁగుఁ గా కేమి మరియొక్క హెచ్చువిద్య
యెఱుఁగుఁ నేమంటివా యర్థితృప్తికరణ
విద్య యీకృష్ణవిభుఁడు భావింపనరుఁడే.

జూపల్లిరాగన యనునాతఁడు మిగుల ధర్మాత్ముఁడనియు నేదియో గ్రంథమునాంధ్రీకరించి శ్రీరామచంద్రున కర్పించెననియు నీక్రిందిపద్యమువలన నెఱుంగనగుచున్నది. గ్రంథనామము శిథిల భాగములోఁ జేరిపోయినందునఁ దెలిసినది కాదు

సీ. ... ... ంచె శతసహస్రద్విజకుల
గ్రామంబు లగ్రహారంబు లిచ్చి
నైవేద్య ... ... నంబులు సాగించె
దేవతావితతిఁ బ్రతిష్ఠ చేసి
యర్పించె నిజదైవ మైన రాఘవునకు
... ... ంబు తెనుఁగు చేసి
కట్టించె విమలోదకము లైన చెఱువుల
వరవల కేటికాల్వల మరల్చి
చదివె ... ... దొడంగి
సరివోలెతోడరమ్మ ... ... ంఖ్య
బిరుద వాగ్గేయకారుల పరమపుణ్యుఁ
డయిన జూపల్లిరాగన ఖ్యాతిఁ జెందె.

కృతిపతియైన వెంకటాద్రిని వర్ణించినవానిలో రెండు పద్యముల నుదాహరించి జూపల్లివారివిషయమును విడచెదను.

శా. అతిమ్మాంబ నిజంబు శంకరుఁడు లింగాంబామహాసాధ్వి వి
ఖ్యాతప్రాభవ తమ్మమద్రిసుత నిక్కంబీవు సేనానివే
రీతంజూచిన మీకుఁ దుల్యులుగలా రే మర్త్యవంశంబునన్
దాతృత్వాపరచంద్ర వేంకటనరేంద్రా! జూపలిగ్రామణీ!

సీ. పగలు దివ్వటులు పల్లకి యెవ్వరి
చ్చిరి? గండభేరుండబిరుదుఁ డిచ్చె
నుత్తమాశ్వంబు నీమత్తేలగొడుగెవ్వ
రిచ్చిరి? జూపల్యధీశుఁ డిచ్చె
గొల్లారుబండి యీనుల్లాయి యెవ్వరి
చ్చిరి? విప్పరలగోత్రసింహుఁ డిచ్చె
నగ్రహారంబు నీయందలం బెవ్వరి
చ్చిరి? పదజాన్వయాబ్జపూషుఁ డిచ్చె
నని చెలంగి మార్గజనబృంద మడుగఁ దెల్పు
వివిధరాజసభాయాత కవివరాళి
చేఁ బ్రకీర్తిత మైన ప్రసిద్ధదాన
విశ్రుతిధరిత్రిలో నిండె వేంకటేంద్ర!

గ్రంథము పూర్తిగాదొరకక పోవుటచేతను జూపల్లివారి చారిత్రము లభింపమివలనను, జంద్రికాపరిణయమునుబట్టి కాలమును నిర్ణయింపలేకపోయితిని.

పాండురాజు కుమారుఁడైన భీముఁడు స్వయంవరలబ్ధ యైన కాశీరాజుతనయ చంద్రిక యనుకన్యకామణిని బరిణయ మైనట్లు మహాభారతాదిపర్వములోఁ జెప్పినకథను గొన్నికల్పితోపాఖ్యానములతోఁ జేర్చి యీగ్రంథమును రచియించినట్లీ క్రిందిపద్యములలోఁ గవి చెప్పియున్నాఁడు.

క. పరికించికంటి భీముఁడు
భరత ... ... భుఁడు కాశీపతి కన్యస్వయం
వరలబ్ధ వేడ్కఁ జేకొని
పరిణయ మైనట్టి యాదిపర్వకథఁ దగన్.

క. ప్రకటముగఁ గల్పనాకథ
లొకకొన్ని యమర్చి యదిప్రయోగార్హ్యవదా
ది .... .... కృతియై
ప్రకృష్టవర్ణనల మెఱయఁ బరికల్పింతున్.

సురభి మాధవరాయకవి చంద్రికాపరిణయ మనునొక ప్రబంధమును రచియించియున్నాఁడు. బాలసరస్వతిచే భర్తృహరి నాంధ్రీకరింపఁజేసి రెండువేలదీనారముల నిచ్చిన దీతఁడే యనియొక ప్రతీతికలదు. కవియుఁ బ్రభువును వేర్వేరఁ బ్రబంధములను రచియించి, యారెండుప్రబంధములకును ఒక్కనామమే యుంచుట కేమికారణమో యూహింపజాల కున్నాఁడను. ఈ రెండు ప్రబంధములయందలికథలు వేఱు. మాధవరాయకవియొక్క చంద్రిక పాంచాలదేశాధీశుఁ డగు త్రిణదోదయుని తనయ. ఆమెను వరించినవాఁడు విశాలానగరాధీశుఁ డగు సుచంద్రుఁడు. నామసామ్యము తప్ప యీ రెంటికిని సబంధము లేదు.

బాలసరస్వతి యసాధారణశేముషీమహిమ కలవాఁడు. ఈతని కవిత్వము నిర్దుష్టమై, ప్రౌఢమై, హృదయంగమముగానున్న దనుటకు సందియము లేదు చంద్రికాపరిణయమునుండియు, భర్తృహరి నుండియు నీతనిశైలి చూపుటకుఁ గొన్నిపద్యముల నిటఁ బొందు పఱచుచున్నాఁడను.

చంద్రికాపరిణయము :—

ఉ. ఆయవధూతశేఖరుఁ డనారత మెంతయు సంతసంబునన్
గాయజహర్తృభువనకర్తకు జాగిలి మ్రొక్కి యుండె స్తం
భాయతమూర్తియై గగనమధ్యము భానుఁడు సేరుదాక బ్రి
జ్ఞాయత వింటె యంతట ప్రసాద మొనర్చి ప్రభుండు గ్రమ్మఱన్.

ఉ. పూసరులిచ్చెదం బసిఁడిపూజిలు గున్ననుజీబు లిచ్చెదన్
వాసితగంధ మిచ్చెద సువర్ణవరాభరణంబు లిచ్చెదన్
భాసురశర్కరాజ్యయుత పాయసపుణ్ హరివాణ మిచ్చెదన్
గాసిలిపాటొనర్పక తగన్ననుఁ గైకొని ప్రోవుడమ్మయా.

ఉ. కన్నులతెల్పు మోవియొడికంబు గళంబుబెడంగు సిబ్బెపుం
జన్నులయొప్పు హస్తముల చక్కనిపొక్కిలి రామణీయకం
బున్నవకౌనుకీర్తు కటియందము పాదయుగంబు చందమే
కన్నియలందు లేదు త్రిజగంబున న్నారసినన్నిజంబుగన్

ఉ. పురమణికుట్టిమస్థలుల భూరివిచిత్రగతి పరివర్తనల్
తురగము లాచరించునెడ తోఁచు రజంబునఁ జిత్రవస్త్రముల్
గిరిశుఁ డగడ్త గాంచి హరికిన్నరకింపురుషాది రాజులో
గరమనురక్త చిత్తుఁడయి కైకొనియుం జెలికార మొప్పఁడున్.

భర్తృహరి:—

మ. తమయర్థంబు త్యజించి కూర్తురు పదార్థం బుత్తముల్ మధ్యముల్
తమయర్థం బెడకుండఁ గూర్తురు పరార్థంబుల్ పరార్థంబు స్వా
ర్థముకై త్రుంతురు మర్త్యరాక్షసులు వ్యర్థం బల్గి యన్యార్థముల్
సమయుం జేయమనుష్యులే సురభిమల్లా నీతివాచస్పతీ! ౧-౬౮

మ. ప్రమదోద్దీపములై క్రమశ్లథనసౌభాగ్యంబులై ముగ్ధము
గ్ధములై ప్రేమమనోహరంబు లయి కందర్పప్రకాశంబులై
యమనోవాగ్విషయంబులై సదనురాగార్ద్రంబులై పూవుబోం
డ్లమృదూక్తుల్ చెలఁగుంబ్రతి స్సురభిమల్లా మానినీమన్మథా ౨-౨౦

మ తళుకుం జెక్కులు చెమ్మగిల్లఁ గచబంధం బూడి ప్రేలంగఁ దో
ర్వల్లి పుంభావ మొనర్చి బిట్టలసి నేత్రాంభోజము ల్మోడ్చి ని
శ్చలత న్వక్షముమీద వ్రాలినపుఁ డోష్ఠంబానుధన్యాత్మకుల్
దలఁప న్భాగ్యఘనుల్ సుమీ సురభిమల్లా మానినీమన్మథా ౨-౨౬

మ. యువతీభోగకథ ల్త్రుటిత్సమము లాయుస్సీమ కల్లోలజా
లవిలోలం బెలప్రాయము ల్నిమిషకల్పంబు ల్ధనశ్రేణు ల
ధ్రువము ల్భోగము లస్థిరంబు లనుచున్ దూషించి తజ్జ్ఞుండు బ్ర
హ్మవిచారంబునకుం జను న్సురభిమల్లా మైదుషీభూషణా. 3-3౬

శా. వ్యామోహంబు వహించిపీను బధిరంబై నోరు లాలాయుతం
బై మేనావతమై రదాళి పతితంబై దృష్టియుత్సాదితం
బై మానస్థితి భ్రష్టమై నరుఁడు పంగ్వైయున్నఁ గైకోరు పెం
డ్లాము న్బిడ్డలు సైతము న్సురభిమల్లా మైదుషీభూషణా 3-౭3

జటప్రోలు సంస్థానాధిపతులగు శ్రీ సురభి రాజా వేంకట లక్ష్మారావు బహద్దరువారి యాజ్ఞానుసారముగా నీభర్తృహరిపద్ధతి యొకటి ౧౯౦౮ సంవత్సరమున ముద్రింపబడినది. గ్రంథాదియందున్న యీతనిరచనములలో నెల్ల నాంధ్రశబ్దచింతామణివ్యాఖ్యయే కడపటిది. దానిపీఠికలో నదివఱకు తాను రచించినగ్రంథముల నన్నిఁటిని పేర్కొనియున్నాఁడు. అందు భర్తృహరివిషయము లేదు. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య రచించినపిమ్మట భర్తృహరి నాంధ్రీకరించి యుండవచ్చును.

ఆంధ్రశబ్దచింతామణియను వ్యాకరణగ్రంథమును మహాభారతగ్రంథకర్త యగునన్నయభట్టు రచియించెననియు, నది యప్పటినుండియు బ్రచారములో లేక నడఁగియుండెననియు, విజయనగరమందుండెడు శివయోగివర్యుఁడు దానిని దనకిచ్చెననియుఁ దాను లోకోపకారార్థముగాఁ డీక గావించితి ననియు నీక్రిందిగద్యపద్యములలోఁ బాలసరస్వతి చెప్పియున్నాఁడు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి మున్నొకనాఁడు విద్యానగరిలో నచింత్యకారుణోపాగమ స్నేహసాహచర్యం డగు శివయోగివర్యుచే దేవచోదనం బరిప్రాప్తమైన యాంధ్రశబ్దచింతామణిగ్రంథంబు లోకోపకారార్థంబుగాఁ డీక గావింపంగోరి. నెమ్మనంబున

ఉ. ఏమి మహాద్భుతం బది హరీహరి యొక్కఁడియాంధ్రశబ్దచిం
తామణిపక్కి యొక్కఁడిమతంగనగంబు యుగాదిసంభవుం
డై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁడా
హా! మనగణ్యపుణ్య సముదగ్రతఁ జేకుఱెఁ గాదె యన్నియున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లేరే వారు వ్యాఖ్యాన క
ర్తలు గారో పరె పెక్కువత్సరము లంతర్భూతమై యున్న యీ
తెలుఁగువ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం డీకగావింపు మం
చలసిద్ధుండు మదిష్టదేవత విరూపాక్షుండు నిక్కంబుగన్.

వ. ఆంధ్రశబ్దచింతామణి తెలిఁగించెద నిది తొల్లి సకలకవితాప్రవర్తకుం డగు శబ్దశాసనుండు సకలకవిహితంబుగా యథోచితసూత్రగర్భితంబు లగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె. నేను నా నేర్పుకొలందిఁ దత్సూత్రవిభాగంబును దత్ప్రమేయవివరణంబును దదుహరణస్వరూపంబులును నంధ్రమయ గద్యపద్యంబుల నేర్పరించి నాయాత్మదేవత యగు నంబాదేవి కర్పించువాఁడ". ఆంధ్రశబ్దచింతామణీ సూత్రములను నన్నయ రచింపలేదనియు, బాలసరస్వతియే రచించి గ్రంథమున కధికగౌరవము కలుగుటకై నన్నయపేరు పెట్టెననియు నొకవాదము కలదు. మూలసూత్రకర్తృత్వ విషయమున భిన్నాభిప్రాయము కలదు. కాని టీకవిషయమున సంశయము లేదు. మూలసూత్రములను నన్నయ రచించెనా లేదా యనువిషయమునుగూర్చి నన్నయభట్టు చారిత్రమున వ్రాసియున్నాఁడను. బాలసరస్వతి రచించిన టీక సమగ్రముగా లేదని, యీసూత్రములకే యప్పకవి యప్పకవీయమనుపద్యరూపక కావ్యముగను; అహోబలపండితుఁడు సంస్కృతభాషలో వ్యాఖ్యానమును రచించియున్నారు. బాలసరస్వతి టీకాశైలి చూపుటకై రెండు సూత్రములను టీకాసహితముగ నిట వ్రాయుచున్నాఁడను

గసడదవాస్స్యుః ప్రథమామాత్రాదాత్మాస్మదోర్వినైవ తే
నవికృతిశబ్దాత్పరతస్సాంస్కృతికానాం భవన్తి గసడదవాః

ఇది రెండుసూత్రములు. ఆత్మాస్మదోః = ఆత్మన్, అస్మచ్ఛబ్ద
ములు వినైవ = వినాగాను ప్రథమామాత్రాత్ = ప్రథమావిభక్తిమీఁద
నున్న ఏతేఏవ ఈపఫషములే గసడదవాఃస్యుః = గసడదవ లగును.
సిరిగలవాఁడు, దిక్కుగలవాఁడు, దానముసేయును, ధీరుఁడుడెక్కలఁ
బోవున (ఇల్లుదాఁటరాదనుట) నిజము వల్కును. ప్రథమామాత్రాత్
అన్నాఁడు గనుక ప్రథమాసమాసము మీఁదనువచ్చును. అప్పుడు గని
పించె, ఇప్పుడు దావచ్చె. ఆత్మాస్మచ్ఛబ్దములకు లేవు. తాఁజెప్పె,
నేఁజదివితి, వికృతిశబ్దాత్ = తెలుఁగుమాటకంటె పరతః = పరమై
యుండెడి, సాంస్కృతికానాం = సంస్కృతశబ్దములకు గసడదవాః =
గసడదవలు, న = లేవు. దొర కరుణించె, సిరిచంచలము, మాయ
య్యాటంకాయుధుఁడు, మీవేల్పుతోయాధిపతి, వీఁడుపావనుఁడు."

ఈకవికాలనిర్ణయమును జేయుటకు రెండాధారములు కన్పట్టు
చున్నవి. అప్పకవి అప్పకవీయమును శా.శ ౧౫౭౭ యగు మన్మథ
సంవత్సర శ్రావణబహుళ యష్టమీదినమున ప్రారంభించితినని చెప్పుకొని
యున్నాఁడు. బాలసరస్వతి యాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యరచించిన
ట్లందు చెప్పఁబడియేగాక, బాలసరస్వతికా గ్రంథమును సిద్ధుఁడు మతంగ
గిరియొద్ద కీలకనామసంవత్సరమున నిచ్చియుండినాఁడని యీక్రిందిపద్య
ములోఁ జెప్పియున్నాఁడు.

క. ఆలోకనుతుఁడు మొన్నటి
కీలకసమనామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ
డోలిఁ దెనుఁగుటీక దాని కొప్పుగఁ జేసెన్.

శా.శ. ౧౫౭౭ కి పూర్వమైన కీలకసంవత్సరము శా.శ
౧౫౩౦ అయినది. అనఁగా హూణశకము ౧౬౦౮వ సంవత్సరమున
బాలసరస్వతికి శబ్దచింతామణి లభించినట్లు తేలుచున్నది. బాలసరస్వతి
తక్షణమే దానికిఁ డీకవ్రాయ లేదు. "మున్నొకనాడు ప్రాప్తమైన"

దని యాతఁడు కృత్యాదిలో వ్రాసియుండుటచే క్రీ.శ. ౧౬౭౦ ప్రాంతమున నీటీక నాతఁడు వ్రాసియుండునని యూహింపఁదగియున్నది. ఈతఁడు తనగ్రంథములన్నిటి నంతకుఁ బూర్వమే రచియించినవాఁడగుటచే నీతనిగ్రంథరచనాకాలము క్రీ.శ. ౧౫౯౦–౧౬౭౦ అయియుండునని తలంచుచున్నాఁడను.

అళియరామరాజుచే యెడవిల్లిగ్రామము నొసఁగఁబడినది బాలసరస్వతికిఁ బిదముత్తాత. అళియ రామరాజు సదాశివరాయలపక్షమున రాజ్యముచేయనారంభించినది క్రీ.శ. ౧౫౪౦ వ సంవత్సరప్రాంతము. ఆకాలముననే యాతఁడు తిరుమలార్యునకు "ఎడవిల్లి" నిచ్చియుండెననియు, నప్పటికిఁ దిరుమలార్యున కిరువదిసంవత్సరముల వయసుండెననియుఁ దలంచితిమేని యానాఁటికి దిరుమలార్యునితమ్ముఁడయిన రామన్న కేఁబదియైదేండ్లును, ఆతనికుమారుఁడైన భైరవునకు ముప్పదియైదేండ్లును, ఆతనితనయుఁడైన కృష్ణయార్యవర్యునకుఁ బదేండ్లును వయసుండునని తలంపవచ్చును. కృష్ణకవికి ముప్పదేండ్లవయసున ౧౫౬౦వ సంవత్సరప్రాంతమున నీబాలసరస్వతి జన్మించి తన ముప్పదవయేట ౧౫౯౦వ సంవత్సరప్రాంతమునఁ గవిత్వమారంభించియుండు ననుటలో విరుద్ధమేమియును లేదు. బ్ర.శ్రీ. వీరేశలింగముపంతులుగారు భర్తృహరి పీఠికలో "ఈకవి పదునాఱవ శతాబ్దాంతమునందును, పదునేడవ శతాబ్దాదియందును జీవించియున్నట్లు తెలియవచ్చుచున్నది" అని వ్రాసియుండిరి.

ఎడవల్లి యనుగ్రామములు కర్నూలుమండలమున పత్తికొండ తాలూకాలో నొకటియు, గుంటూరుమండలమున నరసారావుపేట తాలూకాలో నొకటియు, నెల్లూరుమండలమునఁ బొదిలితాలూకాలో నొకటియు, పశ్చిమగోదావరిమండలమున చింతలపూడితాలూకాలో నొకటియుఁ గలవు. కవితండ్రి పాకనాటినివాసుఁడని చెప్పియుండుటచే నెల్లూరుమండలమందలి యెడవిల్లియే తిరుమలార్యుఁడార్జించినదని చెప్పవచ్చును. అళియరామరాజు కర్ణాటరాజ్యభారమును వహించుటకుఁ

పూర్వము కందనోలు (కర్నూలు) దుర్గాధిపతియగుటచే నాతఁడు తన రాజ్యములోనిదైన కర్నూలుమండలమందలి యెడవిల్లిని దానమిచ్చి యుండెనని యోచించుటకుఁగూడ నెక్కువవకాశము కలుగుచున్నది. ఇందేదిసత్యమో భావిపరిశోధనవలనఁగాని తెలియదు.

ఈతఁడురచించిన త్ర్యర్థికావ్యమునుండి కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

సీ. మాధవీమధురసామల్లికావల్లికా
  డోలికాతతులందు లాలియూఁగు
తరుణసంభోగ మందిరమణిప్రోజ్వల
  తుక్కడ్యభాగములందు దోఁగియాడు
ప్రమదవనావళిద్రుమ షండపుష్ప ధూ
  ళికలందు పాంసుకేళికలొనర్చు
ప్రమదాఘనస్తనోపరి సురతాంత శ్ర
  మోద్ధిత స్వేదాంబు వుగ్గుద్రావు

గీ. లసదలస ముగ్ధగతుల నల్లనజరించు
నిఖిలసీమల స్త్రీపుంస నికరమునకు
శీతలాలింగములిచ్చి ప్రీతియొసఁగు
నప్పురంబున మదానిలార్భకుండు. ౧ ఆ

చ. లలితసపర్యలన్ సిరిదొలంకికనంబడు జ్యాభృదుత్తమం
బలఘు భుజాపరిక్రమసమగ్రుఁడు కృష్ణుఁడు వీరహస్తిదా
నెలమిని పుండరీకముగ్రహించుగతిన్ గొనివచ్చెతాహితా
వళి సుహృదిష్టముంజలిపె స్వాంతమునందలజల్లు మాన్పుచున్. ౨ ఆ

చ. హరిసమతేజుఁడట్లు భయదాయతమావనరాశినేరి బం
ధుర విలసద్విహారచరితుం డగుచున్నిహతారియైన శ్రీ
కరభుజశక్తి చేవనగ గర్భగతుండయి యవ్యపాయతన్
బురమణి గేహసౌధములబోలె వసించె సుఖైకచిత్తుఁడై. ౩ ఆ.

చ. అనుదితభీతి దుర్మతిజనార్దనుఁడా ధరణీశవుండుగ్ర
న్నన స్వమహా శుభాతతరణక్రియ సార్థకమై ఫలింప నె
మ్మనమున శిష్టకంటకసమస్త విరోధి వినాశనప్రవ
ర్తన మొనరించి వేడ్క జన దద్గడంగె సుహృత్సహాయతన్. ౭౪

చ. బలవదరాతిదుర్ణయ విభావిత సంతతదుఃఖతాప వి
హ్వలిత మదప్రమోద శమనౌషధరాజమవీవు ధీర నీ
వలన సమగ్రపుణ్యమయివర్ధిలు మాన్నృపవంశమంతయుఁ
వెలయఁగనీకు నిత్యమహనీయ యశోమహిమాకటాక్షటిల్లెడున్. ౭౫.

ఆంధ్రశబ్దచింతామణిలోని సూత్రములలోఁ గొన్నిఁటికే కవి యాంధ్రపద్యములు వ్రాసియున్నట్లు కన్పట్టుచున్నది. సూత్రములన్నిటికి నేల వ్రాయలేదో తెలియలేదు. " ఆంధ్రమయగద్యపద్యంబుల నేర్ప రించి ". కవి మొదట వ్రాసియుండుటచే నీపద్యములీతఁడు రచించినవి కావనిచెప్పుటకును వీలులేదు. ఇందుఁగొన్నిసూత్రముల కాంధ్రీకరణ ములు కొన్నిలక్ష్యములకొఱకు రచించినవి. అవియైనను స్వల్పము. అందలి మూఁడుపద్యములీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. డులుమువులు ప్రథమ నినుకూ
ర్ప్రిలలు ద్వితీయ మఱి తోడచేచేత పదం
బులు దాఁదృతీయ కై కొఱ
కులు దలంపఁ జతుర్థియనునగును దెనుఁగునకున్.

గీ. పట్టివలనకంటె యనఁగఁ బంచమియగు
భక్తియగుఁ గికుయొక్కలోపలలు షష్ఠి
జగతిలో నిందు నందున సప్తమియగు
నోయియనఁగ సంబుద్ధియాంధ్రోక్తులందు.

గీ. ఆశ్రితావన సురల మున్నంబుబ్రోచె
శంకరునిరాణి నర్చింతు శైలసుతను
ఇందువదనకుఁ బ్రణతి సర్వేశ్వరికిని
యాద్యయందనురక్తి మాయార్యయందు.

---

## 251 సురభి మాధవరాయకవి.

ఈకవి పద్మనాయక కులోత్పన్నుఁడు. మల్లభూపాల నందనుఁడు. బ్ర. శ్రీ. కందుకూరి వీరేశలింగము పంతులు గారు తమ యాంధ్రకవుల చారిత్రమున నీకవిని రేచర్ల మాధవరాయకవి యని పేర్కొనియున్నారు. వీరు రేచర్లగోత్రులు. వీరిపూర్వుల కాలములో గృహనామము రేచర్ల యని కొంతకాలమున్న మాట సత్యమే కాని మాధవరాయకవికి బూర్వము కొంత కాలము నుండియు వీరికి సురభియను గృహనామము వాడుకలో నున్నది. సురభివారు జటప్రోలు సంస్థానాధిపతులు. ఈమాధవరాయ కవిచంద్రుఁడు జటప్రోలు సంస్థానాధిపతియే. జటప్రోలు, వేంకటగిరి, పిఠాపురము, బొబ్బిలి సంస్థానాధిపతులకుఁ గూటస్థుఁ డొక్కఁడే యయినను, వేంకటగిరివారికి వెలుగోటి వారనియు, బొబ్బిలి పిఠాపురసంస్థానముల వారికి రావువారనియు గృహనామములు కలిగి నట్లే జటప్రోలువారికి సురభివారను నింటిపేరు వచ్చినది. ఈమాధవరాయ కవికిఁ బూర్వము గొన్నితరముల క్రిందట నుండియు సురభియను గృహనామ మున్నట్లు కనబట్టుచున్నది. ఈకవి చంద్రికాపరిణయ మను నారాశ్వాసములు గలయుత్తమ శృంగారప్రబంధమును రచియించి తన యిష్టదైవమగు మదనగోపాలస్వామి కంకితము చేసెను. కృత్యాది యందుఁ దనవంశీయులకు సురభియను నింటిపేరుకలిగినవిధము నీక్రింది పద్యములోఁ దెలిపియున్నాఁడు.

తే.గీ అర్థిసాత్కృత సురభి పరాళిసురభి
సుగుణ వల్లీప్రకాండైక సురభి కీర్తి
జితసురభి శౌర్యసురభి నాసింగనృపతి
పరఁగ దద్వంశమును గాంచె సురభిసంజ్ఞ.

ఈ పద్యములోఁ జెప్పఁబడిన సింగనృపతిని సర్వజ్ఞసింగమ భూపాలుఁడని యందురు. ఈతనిని గవి యిట్లువర్ణించి యున్నాఁడు.

సీ. అరిపుర భేదనాయత దోర్బలస్ఫూర్తి
నతరాజ వర్ధన విదితకీర్తి
గనదహీనాంగద కవిత బాహాకేల
ఖండితాహిత ఘనాఘనవిహేల

సద్గుణరక్షణ క్షమచరణాసక్తిఁ
బటుచంద్ర కోటీర భానిషక్తిఁ
దత సర్వమంగళాంచిత గాత్రరుచిపాళి
నచల ధర్మోన్నత ప్రచయకేళి
తే. ప్రకట దుర్గాధి నాయక భావభూతి
వైరిదర్పక దాంబక వహ్నిహేతి
నవనిఁ బొగడొందె సర్వజ్ఞుఁ డనఁగ సింగ
ధరణిభృన్మౌళి దీవ్రప్రతాపహేళి

ఈసింగభూపతివంశమున పెద్దశౌరి యుదయించెనని చెప్పుచు నాతనిని మూలపురుషుని గానుంచి తనవంశమును గవివర్ణించియున్నాఁడు. అతఁడురచించినపద్యములనుబట్టి కవివంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.




ఈవంశవృక్షమునందలివ్యక్తుల నేఁబదిపద్యములలో గవి వర్ణించియున్నాఁడు. కాని యందుచరిత్రమున కుపయోగించునంశము లేమియు లేవు. ఈవంశీయులు సంస్థానాధిపతులై యనేకయుద్ధములలోఁ బాల్గొన్నపరాక్రమవంతులై యున్నను వారికాలమును నిర్ణయించుట

కనువైనవిషయముల నాపద్యములయందుఁ జెప్పలేదు. కేవలమలంకార ప్రాధాన్యము లయిన యాపద్యములనుండి యీచరిత్రమునందుదాహరింప దగినవేమియు లేనందున విడచివైచితిని.

ఈగ్రంథమందలి నాయిక చంద్రిక. ఈమెతండ్రి పాంచాల దేశాధిపతి యగుకుశలోదయుఁడను భూపతి. తల్లి శ్యామ. ఈచంద్రిక పూర్వజన్మమునఁ జిత్రరేఖ యను దేవాంగన, బ్రహ్మచే నియమింపఁబడి వసంతుండను మునిచంద్రుని తపోభంగ మొనర్ప యత్నించి యాతనిచే మానవవనితగా జన్మింపుమని శపింపఁబడి, సుచంద్రుఁడనురాజునకుభార్యగా నున్న పిదప నిజరూపమునుబొందునట్లు శాపాంత మనుగ్రహింపఁబడిన యామె. శ్రీమద్రామాయణబాల కాండమునందు "విశాలస్య సుతో రామ హేమచంద్రో మహాబలః సుచంద్ర ఇతి విఖ్యాతో హేమచంద్రాదనంతరః" అని వర్ణింపబడిన విశాలనగరాధీశుఁడు, చంద్రికకు సంగీతవిద్య నేర్పుటకై విధాతచే ననుజ్ఞాతుండయి పాంచాలదేశమునకు వచ్చుచుఁ బోవుచు మార్గమధ్యమున నొకమునిపత్నిం గామించి యామెతో మాటలాడుచుండఁ జూచి సింహామవు" గమ్మని యామెపతిచే శాపమునొంది, సింహరూపము దాల్చి రాక్షససంహారార్థ మడవికేతెంచిన సుచంద్రునిచే మృతినొంది నిజరూపముందాల్చి సకుముదుఁడను కిన్నరుడు చంద్రికాసుచంద్రుల పరస్పరావలోక సంధానకర్త. చంద్రికాసుచంద్రుల పరిణయము కథావసానము.

ఈకావ్యము సర్వవిధముల రామరాజభూషణుని వసుచరిత్రమును బోలియున్నది. ఈగ్రంథమునకుఁ గవియే వ్యాఖ్యానమును వ్రాసియున్నాఁడు. ఈకవికి జటప్రోలుసంస్థానమును ౧౨౦౦ ఫసలీలో నళియ రామరా జిచ్చినట్లు వ్రాయఁబడియున్నసనదు సంస్థానమందున్నదని చంద్రికాపరిణయము పీఠికలో వ్రాయఁబడియున్నది. జటప్రోలుసంస్థానము వీరిపూర్వులనుండియున్నను సంస్థానాధిపతిమారినప్పు డెల్ల తాను సామంతుఁడుగానున్న ప్రభువువద్దనుండి మరల సన్నదును గైకొనుచుండుట యాచారము. ౧౦౯౦ ఫసలీ క్రీ. శ. ౧౬౮౦ అయినది.

అప్పటి కళియరామరాజు లేఁడు. కావుననాయంకె నిజమయినది కాదు. సురభివారి వంశచారిత్రములో నీశాసనము ప్రకటింపఁబడినది. కాని యందు సనదుకాలమియఁబడలేదు. సనదునిచ్చినవాఁడు ఆనెగొంది గామదేవరాయఁడు. ఇతఁడు "ప్రౌఢదేవరాయల సాంప్రదాయకులైన అచ్యుతరాయ కృష్ణరాయల సాంప్రదాయకులైన రామరాజు మహారాజుగారు" అయినట్లుశాసనములో నున్నది. ఇది యళియరామరాయల ప్రశస్తి కాదు. ఇందుఁ జెప్పఁబడిన రామరాజెవ్వరో తెలియదు. ఈశాసనము కవి కాలనిర్ణయమున కంతగా తోడుపడలేదు. ఈకవి మూఁడవ కుమారుఁడైన నరసింగరావునకు గోలకొండనవాబు ఒక సన్నదునిచ్చినాడు. అందుఁదుదిని "సిత్ సమానీనుఅలఫ్" అనియున్నది. దీనికి ౧౦౬౮ ఫసలీఅని యర్థమట. అట్లయినచో నితనికాలము క్రీ.శ.౧౬౫౮ అయినది. ఇది నరసింగప్రభువు రాజ్యారంభకాలమయియుండును.

ఏదియెట్లున్నను మాధవరాయకవి పదునాఱవశతాబ్దియం దంత్యభాగమునను, పదునేడవశతాబ్దిని బ్రథమార్థమునను నున్నాఁడని చెప్పవచ్చును. ఎలకూచిబాలసరస్వతి యీతనికాలమువాఁ డని చెప్పుటకు సందియము లేదు. బాలసరస్వతి, యీకవిప్రోత్సాహముపైని యీతని తండ్రిపేరిట భర్తృహరినాఁధ్రీకరించెనని ప్రతీతికలదు. ఆమాట విశ్వాసనీయముగానే గన్పట్టుచున్నది.

ఈకవి వసుచరిత్రకారుఁ డగు రామరాజభూషణునితో సమకాలికుఁడని కొందఱనుచున్నారు. అందుల కుదాహరణముగా నాతని వసుచరిత్రయు, నీతనిచంద్రికాపరిణయమును జూచినయొకపండితుఁ డీక్రిందిపద్యమును జెప్పెననియు సురభివారివంశచారిత్రమున వ్రాసియున్నారు.

ఉ. సురభికులామలాబ్ధిఁ బొడసూపిన మాధవరాయచంద్రుఁడా
సరసపదార్థరంజనము సత్కవిహృద్యముగాఁగఁ జంద్రికా
పరిణయమున్రచించె నదిభావ్యము నీవసుచర్యచూడఁగాఁ
బరఁగె నిగూఢవృత్తి నటు నీకునువర్తిలె మూర్తిభావముగా.

"ఈకవిద్వయమీ గ్రంథద్వయమును బరస్పరస్పర్ధాబంధమున ముగించినతరువాత మూర్తికవి యకాలపువిద్వాంసులకడ కేఁగి నిజప్రబంధముచూపెననియుఁ దెనాలిరామలింగకవియో మరియెవరో మూర్తికవింజూచి యీపద్యము చెప్పెననియుఁ బురావృత్తము దెలిసినవారు వక్కాణించుచున్నారు. చంద్రుఁడు శ్రేష్ఠములగు చకోరాదిపక్షులకు హృద్యమగుభంగిఁ గుముదాదిపదార్థరంజన మొనరించునట్లు మాధవరాయఁడు శ్రేష్ఠులగువిద్వాంసులకు హృద్యమగునట్లుగా శృంగారాదిరసపుష్టిగల వాచ్యలక్ష్యవ్యంగ్యపదార్థప్రకాశకమగు చంద్రికాపరిణయ మొనరించెననియు, లుబ్ధుఁడగువానిధనచర్య మిగులగుప్తవృత్తి నవలంబించి యితరాసులభమగునట్లు మూర్తికవివసుచరిత్రము గూఢములగు భావార్థాదివృత్తులు గలిగియున్నదనియు తదనురూపముగ నాకవికి మూర్తి (కఠినుఁడు) అనునామ మమరియున్నదనియు దీనిభావము".

వసుచరిత్రకృతిప్రదానము హూణశకము ౧౫౭౦ ప్రాంతమని రామరాజభూషణునిచారిత్రమున వ్రాసియున్నాఁడను. చంద్రికాపరిణయ రచనాకాలముకూడనదియేయని యెంచితిమేని మాధవరాయభూపతి యప్పటికథమ మిరువదియైదేండ్లవయసుకలవాఁడై యుండవలయును. అనఁగానీతనిజననము ౧౫౪౦ ప్రాంతముకావలయును. ఈతనికుమారుని రాజ్యారంభకాలము పైనవ్రాసినట్లు ౧౬౫౮ అయ్యెనేని మాధవరాయఁడు ౧౧౮ సంవత్సరములు జీవించినట్లు చెప్పవలసివచ్చును. ఇదియసంభవము. మాధవరాయనియనంతరమాతని ప్రథమద్వితీయకుమారులు రాజ్యముచేసిరందుమేని ౧౦౬౮ ఫసలీసన్నదులో "మీతండ్రిగారు కిర్దురనచుచున్నసంస్థానములు కదీముజబ్రోలువ" అనియున్నది. కాని "అన్నగారియొక్క" అనిలేదు.

ఏదియెట్లున్నను పూర్వోక్తరసందర్భములను తఱచిచూచినవారికి వసుచరిత్రచంద్రికాపరిణయము లేకకాలమున రచియింపఁబడినవికావనియు, వసుచరిత్రకంటె చంద్రికాపరిణయ మిరువది మూఁడు

సంవత్సరములు వయసునఁ జిన్నదనియుఁ జెప్పకతప్పదు. దీనినిబట్టి కవి పదునాఱవశతాబ్ది దుకపాదమునను బదునేడవశతాబ్ది పూర్వార్ధమునను నున్నవాఁడని నిశ్చయింపవచ్చును.

ఎలకూచిబాలసరస్వతికూడ నొకచంద్రికాపరిణయమును రచియించియుండెను కాని యందలికథ వేఱు. మొదటినుండియు సురభివారు కవిపండితపోషకులై పండితులై వారియశోపరిమళమును లోకమున వ్యాపింపఁజేసియున్నారు. ఈమాధవరాయకవిత్వము శ్లేషభూయిష్టమై మృదుపదఘటితమై యత్యంతప్రౌఢముగానున్నది. ఇదియాఱాశ్వాసములుకలదై మదనగోపాలస్వామి కంకితమీయబడినది. శైలిచూపుటకై యాఱాశ్వాసములనుండియు నాఱుపద్యములనుదాహరించుచున్నాఁడను.

మ. పరిసంవర్ధిత చంద్రినాగకులరాట్పద్మామృతంబై నిరం
తరముం బొల్చుత దుర్వరాధిపసముద్యత్కీర్తి వారాశిపం
కరుహోదమునిండుటల్ నిజమటుల్ గాకున్నచోఁ బుష్కరాం
తరసీమం గనుపట్టునే తరణిమండల్యైకసంచారముల్. ౧౫

శా. వింటేమన్మథ! మత్ప్రభుత్వమున కుర్విం బుట్టి విఘ్నావళిన్
గెంటందార్చుచు మాఘుకాత్మహితభంగిన్ మించునీవుండుటల్
కంటంగానక బ్రహ్మభావమునకాకాంక్షించి యొక్కండు కై
గొంటే యేముని దెచ్చినాఁడిటఁ దపఃకల్యాధ్వసంచారితన్. ౨౫

చ. సరసతరోక్తి నమ్మనిసుచంద్రిపమాఖ్య రచించుభూపతిం
బరిణయమందుమంచు సకిఁబల్కెఁ దదాఖ్యరచించుమేదినీ
శ్వరమణి పేఁకెకాన నలసారసలోచన నిస్వరించున
ష్టమయతీశవాక్తతి యపార్థతఁ గైకొనునే మహీస్థలిన్. ౩౫

ఉ. తమ్ములఁ జేరి రోదరశతమ్ములఁ గైకొని తావిభృంగపో
తమ్ములఁ గుంచి యావతయుతమ్ముల మత్తమరాళరాజపో
తమ్ముల మించి చిత్రచరితమ్ముల సీఁదిరి కొమ్మలెల్లఁ జి
త్తమ్ముల వారిదేవతలు తమ్ములలిన్ వినుతింప నయ్యెడన్. ౪౫

తే. అనినఁ దద్వాక్యార్థమునకు వేదాంతమనఁగ
వినతస్వాంతం బలజనేంద్రు నెనయకునికి
శోకని చింతఁ జేర్చి యవ్వేళఁ (దికదిరి)
తనయ యారాజుఁ జూపి యిట్లనియె నపుడు.
చ. తరుణులు చేరి కాంచనవిశద్గిరిక శోధనపీఠిఁ బెట్టి భూ
వరు వసియింపఁ జేసి ద్విజవారిజలోచన లెల్లఁ గోకిల
స్వరమునఁ బాటపాడ ననివారితమంగళవాద్య నిస్వనో
త్కరములు చాలఁబోరుకొన గౌక్కున వారతు లెత్తి రయ్యెడన్. ౬౫

ఈగ్రంథరాజమునకు బ్ర. శ్రీ వెల్లాల సదాశివశాస్త్రులువారును అవధానము శేషశాస్త్రిగారును, క్రీ.శ. ౧౯౦౦ సంవత్సరప్రాంతమున విపులమును సమంజసమునగు వ్యాఖ్యానమును గావించియుండిరి.

---

# 252 వేగినాటి (బళ్ళపల్లి) కొండనార్యుఁడు

ఇతఁడు వేదాంతప్రతిబోధక మగు వివేకసింధు వను యెదాశ్వాసముల పద్యకావ్యమును రచియించి దత్తాత్రేయున కంకితము చేసెను. ఈవివేకసింధువు సంస్కృతభాషలో పదునైదుప్రకరణములుగా నున్నదఁట! దానిని ముకుందమౌని యనునాతఁడాంధ్రమున వచనకావ్యముగా రచియించెనఁట! ఈకవి దానిని పద్యకావ్యముగాఁ జేసితినని యీక్రింది గద్యపద్యములలోఁ జెప్పినాఁడు.

"సమంచితభవాబ్ధితరణంబు లైన వేదాంతప్రకరణంబులు సదానందసాంద్రుం డగు ముకుందమునీంద్రుండు నాంధ్రభాషనురచియించిన వచనకావ్యం బైనవివేకసింధువు నిరవద్యగద్యపద్యాత్మకంబుగాఁ బ్రబంధంబుఁ జేయసమకట్టి నామనంబున.................. పీఠిక 18.

క. అనచు ముకుందమునీంద్రుఁడు
ఘనముగ లోకోపకారకార్యార్థంబై
తెనుగించెను వేదాంతము
ననుపమసువివేకసింధు వను పేరఁదగన్. ౧ఆ. ౩౨

ఈకవి తనకు దత్తాత్రేయుఁడు గురువైనట్లు గ్రంథాంతగద్యలో నీవిధముగాఁ జెప్పుకొనియున్నాఁడు.

గద్య :— ఇది శ్రీగురుదత్తాత్రేయకృపాలబ్ధ కవితావిచిత్ర శ్రీవత్స గోత్రపవిత్ర వేగినాటివంశ పయఃపారావారనిశాకళత్ర నాగయామాత్యపుత్ర సరసగుణధుర్య కొండనార్యప్రణీతం బైన వివేకసింధు వను మహాప్రబంధంబు......"

ఈదత్తాత్రేయుఁడు అవతారమూర్తి యైనదత్తాత్రేయుఁడా? లేక నెల్లూరుమండలమున దత్తాత్రేయమఠమును స్థాపించి, పరమానంద యతీంద్రుఁడు, దేనువుకొండ తిమ్మయార్యుఁడు మొదలగువారికి గురువై యద్వైతమతవ్యాప్తికై శిష్యులచే పెక్కు వేదాంతగ్రంథములను రచియింపఁ జేసిన దత్తాత్రేయయోగిపుంగవుఁడా? యనిసంశయము కలుగుచున్నది. ఈకవిగురువు దత్తాత్రేయయోగియనియే నాయభిప్రాయము. ఈదత్తాత్రేయునిఁగూర్చి పరమానందయతీంద్రుఁ డను కవిచారిత్రమున వ్రాసియున్నాఁడను. ఈకవియాతనిశిష్యుఁడే యైన యెడల, నీకవి పదునాఱవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁ డని నిర్ణయింపవచ్చును.

ఈగ్రంథమునకుఁ గృతిపతి దత్తాత్రేయ యోగిగాక యాతని కుపాస్యదైవమగు దత్తాత్రేయావతారమూర్తియే యని యీక్రింది యాశ్వాసాంత పద్యములయందు "అత్రిసుతా! అత్రిమునిపుత్రా!" అను సంబోధనలనుబట్టి నిశ్చయింపఁదగియున్నది.

క. అత్రిమునిపుత్ర! సత్కృప
విత్ర! కలుషచయ లతాలవిత్ర! మునీంద్ర

స్తోత్రీ! భవజైత్రీ! సజ్జన
పాత్రీ! జగద్బ్రహ్మసూత్రీ! భవ్యచరిత్రా! ౨౮౭వ.

పీఠికయందలి యీక్రింది పద్యములనుబట్టి యితఁడు దత్తాత్రేయావతారమూర్తికిని దనగురువునకు నభేదమును జూపినట్లు గన్పట్టుచున్నది.

చ. హరుని గురించి ఘోరతప మత్రిమునీంద్రుఁడు సేయ మెచ్చి నీ
వరుడుగ వేఁడు మిత్తు వరమన్నను పుత్త్రిత నొందుమన్న సా
దరమున సమ్మతించి యిదె దత్తుఁడనైతినటంచు వారిమం
దిరమున బుట్టినట్టి మమదేశికు దత్తుని నాశ్రయించెదన్.

ఆంధ్రకవులలో నీక్రిందిపద్యమున పదునైదవ శతాబ్దాంతము వఱకు గల వారినిమాత్రమే నుతించి అల్లసానిపెద్దనాదులను దలపెట్టకుండుటచే నీతఁడు పదునాఱవ శతాబ్దివాఁడనియే తలంపనగుచున్నది.

సీ. నన్నయభట్టు శ్రీనాథు తిక్కన సోము
యాజి బమ్మెరపోతనార్యు సోము ...

... ... ... ...

తే. భాస్కరుని రంగనాథులఁ బ్రస్తుతించి
భావికవులకుఁ బ్రియములు పలికి ప్రీతి
నాంధ్ర కవితాచమత్కృతి నాగమాంత
సరణిఁ గృతిసేయఁ దలంచితి సభికు లెంచ

ఇతని కావ్యమున కాధారమైన వచన వివేకసింధువును రచించిన ముకుందమాని నీతఁడీ క్రింది పద్యములోఁ గీర్తించి యున్నాడు.

మ. వినుతింపం భవరోగవైద్యమగు నీవేదాంత శాస్త్రంబు పా
వనమై యుండఁ బ్రవీణతన్ వచనకావ్యంబొప్పఁగాఁ జేసి స
జ్జనులం బ్రోచినపుణ్యమూర్తి విమలస్వాంతుండు విజ్ఞానశా
సనుఁ డైనట్టి ముకుందమానికి నమస్కారంబు గావించెదన్.

ఆంధ్రబ్రాహ్మణులలో వెలనాట్లని, వేగినాట్లని, కాసలనాట్లని తెలగాణ్యులని, వారునివసించిన ప్రదేశనామములనుబట్టి యనేకశాఖా భేదము లేర్పడినవి. ఈకవి పేరునందలి 'వేగినాటి' శబ్దమును బట్టి కాఁబోలు శ్రీవీరేశలింగము పంతులుగారీతనిని వేగినాటి నియోగిబ్రాహ్మణుఁడని ఆంధ్రకవుల చరిత్రమున వ్రాసియున్నారు. తండ్రిపేరున కమాత్యశబ్దమును జేర్చుటచే నీతఁడు నియోగి బ్రాహ్మణుఁడనుమాట నిశ్చయమే. కాని వేగినాటి శాఖలో నియోగిశాఖా బ్రాహ్మణు లుండిరాయని సంశయము. అయినను వీ వేగినాటిశబ్దము శాఖాసూచకము కాదనియు కవి యింటిపేరు వేగినాటివారనియు గూడఁదలంపవచ్చును. గద్య యందలి "వేగినాటి వంశపయఃపారావార నిశాకళత్ర" యనువాక్య మీయంశమును స్పష్టము చేయుచున్నది.

దత్తాత్రేయయోగికాలమున నాతని శిష్యు లనేకు లిట్టి వేదాంత గ్రంథముల నాంధ్రమునఁ బెక్కులు వెలయించియున్నవారు. అందుచే నీకవియు నప్పటివాఁడని తలంచెదను.

కొండనార్యుఁడు రచించిన యీగ్రంథమంతయు గురుశిష్యసంవాద రూపమున నున్నది. విషయము కఠినమైనను గవిత్వ మతిసులభమై సుబోధకముగ నున్నది. క్షపణకాది మతముల నచ్చటచ్చట ఖండించి యద్వైతమత సిద్ధాంతముల నిందు జక్కఁగాఁ బోషించినాఁడు. కవిత్వశైలి తెలియుటకై నాల్గుపద్యముల నుదాహరించెదను.

క. జ్ఞానేంద్రియ పంచకమును
మానుగఁ గర్మేంద్రియములు మఱి దృశ్యములు న్
నేనరయఁగ ద్రష్టను నవి
గాను వివేకమునఁ దెలియఁగా నెల్లప్పుడున్ ౧౪౧౬

ఆ. వట్టి విడుపు లేక పరగ శీతోష్ణముల్
గాక స్థూలసూక్ష్మకరము గాక
రాక పోక లేక వికతో కాదిపోక
యున్నయదియె యాత్మ! సన్నుతాత్మ. ౩౪౫౭

ఆ. త్వంపదార్థ మనఁగఁ దలపోయ జీవుండు
యొలమి తత్పదార్థ మీశ్వరుండు
నసి పదార్థమనఁగ నట్టి జీవేశ్వర
భావములకు నైక్యమై వెలుంగు. ౫౦౩౧

ఇంతవరకు వ్రాసినపిదప నీతఁడు "దత్తయోగీంద్రవశ్య" అను మకుటముతో నొక సీసపద్య శతకమును రచియించినట్లు తెలిసినది. శతక కవుల చరిత్రమునందీకవి యుదాహృతుఁడు కాలేదు. ఆంధ్ర కవుల చరిత్రమునం దీతని చారిత్రమున నీశతక ప్రసక్తి యేమియు లేదు.

ఈశతకము యొక్క తాళపత్రప్రతి యొకటి (R No 633) మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమున నున్నది. దొరతనము వారు ప్రకటించిన పట్టికలో (Volume IV. Part I page 1601) నీ శతకమును గూర్చి వ్రాయుచు 'కర్తపేరుతెలియదు' అనివ్రాసి, యీ క్రింది రెండుపద్యముల నుదాహరించి యున్నారు.

సీ. శ్రీకరాకార శాశ్వతనిత్య పరిపూర్ణ!
యానందయోగ విద్యావిహార
రూప విభ్రమ కళాదీపప్రకాశ యో
గాధ్యక్ష యోగికులావతంస
నారదస్తుతిపూర్ణ నాదాంచిత వినోద!
కరుణాకటాక్షవీక్షణ విశాల
భూతిలేపన జగత్పూత చారుచరిత్ర
సకలలోకాధార సగుణరూప

గీ. పరమపావన మహనీయ భవ్యగాత్ర
విశ్వసంవేద్య మౌనీంద్రవినుత లోక
చిర శుభాకార మోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవశ్య.

సీ. పరతత్త్వ వాచ్యార్థ భావంబు లన్నియు
వేర్వేర నొక్కొక్క విధముగాఁగ

సీసపద్యంబులఁ జెలువొంద శతకంబు
చెప్పితి సత్కవిశ్రేష్ఠు లలర
వరుఁడు దత్తాత్రేయగురు సంకితంబుగా
నానేర్చు విధమున నవ్యముగను
వేగినాటి కులాబ్ధి విధుఁడను బళ్ల ప
ల్లిఖ్యన్వయుఁడను నాగయప్రధాను
గీ. సుతుఁడ శ్రీవత్సగోత్రుండ సుకవి
గొండ ధన్యుఁడ వెలయ నాచంద్రతారకముగ
చిర శుభాకార మోక్షలక్ష్మీవిహార
సాంద్రరుచిధుర్య దత్తయోగీంద్రవర్య!

"సంసారబంధనము, ఈషణత్రయము, అపత్యభ్రాంతి, అష్టకష్టములు మొదలగు శీర్షికలక్రింద వేదాంతవిషయములు, నీతివిషయములు, నీశతకమునఁ గలవు"

తండ్రిపేరును, గోత్రమును, దత్తాత్రేయ శిష్యత్వమునకుసరిపోవుట చే వివేకసింధువు కర్తయు, నీశతకకర్తయు నొక్కఁడేయని స్పష్టమగుచున్నది. కాని బళ్ళపల్లి యన్వయుఁడనవి వివేకసింధువునందు జెప్పలేదు. "వేగినాటి కులాబ్ధివిధుఁడ ననుటచే" వేగినాటినియోగి బ్రాహ్మణుఁడని శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసినది సత్యమనియు, ఇంటిపేరు బళ్ళపల్లి వారనియు, నిశ్చయింపవలసి వచ్చుచున్నది. దత్తాత్రేయయోగి శిష్యత్వముచే నీతఁడు పదునాఱవశతాబ్దియందు త్తరార్ధమున నుండిన వాఁడని నిర్ణయింతము.

---

# 253 రేటూరి రంగరాజు

ఈతఁడాఱువేల నియోగిబ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు శ్రీవత్సగోత్రుఁడు; చినగంగనామాత్య పుత్త్రుఁడు.

ఈకవి భానుమతీ పరిణయమను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించి వెంకటగిరి సంస్థానాధీశుల పూర్వులలో నొకఁడగు వెలుగోటి రాయశౌరి కంకితముచేసెను. కృతిపతి కవినిగూర్చిపలికినట్లు కవిరచించిన యీక్రిందిగద్యపద్యములవలన నీతఁడష్టావధాన శతావధానములను జేయఁగలవాఁడనియు, శ్రీరామచంద్ర పదభక్తుఁడనియుఁ దెలియు చున్నది.

సీ. "వ్యస్తాక్షరీధుర్య విస్తీర్ణభావంబు
క్రముక సంఖ్యాఖ్యానకౌశలంబు
నారోహణావరోహణ లేఖఁ బ్రౌఢి
యగ్రపద్యగ్రహణాభిరక్తి
యనవలోకిత శారి శాఖిఖేలనరీతి
వర సమస్యాపూర్తి వైభవంబు
సముదగ్ర నేక్షిత చతురంగబల కేళి
కా విలాసము నేకకాలమున నె

తే.గీ యలరఁ బ్రకటింప నేర్తు వష్టావధాన
కవిత శతలేఖనీ పద్యగద్య శక్తిఁ
బాటిమీఱితి వాంధ్రకర్ణాటచోళ
రాజసభలను రేటూరిరంగనార్య!

గీ. అనుచుఁ బేర్కొని శోభితాహ్లాదమునను
సరస పద్యానుబంధ బంధురముగాఁగ
దలఁచి నిర్మించు మీప్రబంధంబు మాకు
జెలువముగ నంకితంబుగఁ జేయవలయు.

అని సబహుమానంబుగా గంధకర్పూర తాంబూల పట్టాంబరహారా గ్రహారాదుల నాదరించుటయు, నేమనంగీకరించి"

గ్రంథాంతగద్యమునఁ గవి తననుగూర్చి యిట్లు చెప్పుకొనియెను.

"ఇది శ్రీరామచంద్ర సాంద్ర కృపారస పరిపాకలబ్ధ కవితా మా ధురీధురీణ శ్రీవత్సగోత్ర పవిత్ర కేటూరి చినగంగనామాత్య పుత్రి సౌజన్యవిధేయ రంగరాజ నామధేయ ప్రణీతంబైన భానుమతీ పరిణ యంబను మహాప్రబంధంబు"

ఈకవి కందాళ శ్రీరంగదేశికుల శిష్యుఁడు. ఈక్రింది రెండు పద్యములలో గురువును గీర్తించి యున్నాడు.

సీ. క్షమియు నుద్ధత వారణమ్ముఁ ద్రిప్పునే సదా
చార ధౌరేయుహుంకార రవము
లసదనుష్ఠాన వేళల నుదగ్రవ్యాఘ్రమ
మే మహాత్ముని సేవ కెదురుకొనును
ఫణిచుంబిత గభీరభక్తాగ్రణికి సుధా
పాన మేయాచార్యు పాదరజము
సకలమతోద్ధారక కళా ధురంధరం
బే ధన్యు కరుణార్ద్ర వీక్షణంబు

గీ. నట్టిదేశికమణి భావనార్యు తనయు
రత్నమై తేజరిల్లు శ్రీరంగధాము
హైమయజ్ఞోపవీత లీలావతారు
ధరణిఁ గందాళ శ్రీరంగ గురుఁదలంతు.

సీ. బహుదేశికులుచూడ బ్రహ్మాగ్రకసిఁ బాపు
రంజిత శ్రీపాద రజమువాఁడు
పుట్టుమూగను దమ్మి పుట్టిగాఁగ చేసి
పరఁగు ప్రసాద వైభవమువాఁడు
సకలదిగంత విశ్రాంతంబు లగు నిరం
తర తదీయారాధనములవాఁడు
పరమదయాదృష్టి భక్తలోకములకు
నుభయవేదాంతంబు లొసఁగువాఁడు

గీ. నన్నయాచార్యవర్య ప్రియాత్మజుండు
వసుధ నన్నేలు కందాళ వంశజులని
ధాన శుభద సుధాధామ ధాళధళ్య
సురుచిర యశుండు శ్రీరంగగురువిభుండు.

మొదటి పద్యములో భావనాచార్య తనయుఁడనియు రెండవ పద్యములో నన్నయాచార్య తనయుఁడనియుఁ జెప్పుటచే వీరిరువురు నొకరుకారని తెలియుచున్నది. మొదటి శ్రీరంగగురుఁడు తిరుపతిదేవస్థానమున నాచార్య పురుషుఁడుగానుండి గొప్పపండితుఁడై యనేకులను గవులను బండితులనుగా జేసినవాఁడు. విష్ణుపురాణకర్త యగు కలిదిండి భావనారాయణ మొదలగువా రీతనిశిష్యులు. ఈ శ్రీరంగగురుఁడు తిరుపతి వెంకటేశ్వరస్వామికి 1500 నాణెములు సమర్పించి యాద్రవ్యముతో నాస్వామివారి గ్రామములలోఁ బంటకాలువలు త్రవ్వించి, ఆనీటితో వ్యవసాయము చేయు భూములనుండి వచ్చునాదాయమును స్వామివారి యంగరంగ భోగాదులకై వెచ్చించునట్లొక శిలాశాసనమును శా. శ. ౧౪౬౭ విశ్వావసుసంవత్సర కార్తీకశుక్ల ద్వాదశీ భానువారము నాఁడు వ్రాయించి యుండెను. (క్రీ. శ. ౧౫౪౫ జూలై నెల ౫ వ తేదీ). రంగరాజకవి యీతని శిష్యుఁడు కావున పదునాఱవశతాబ్ది ప్రథమార్థమున నున్నవాఁడని తోఁచవచ్చును.

కాని బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు ఆంధ్రకవుల చారిత్రమున "గోలకొండ మహమ్మదీయులను గొండవీడు వినుకొండప్రభువులను జయించి ౧౫౭౭ వ సంవత్సరమునందు విజయనగర రాజుల పక్షమునఁ బోరాడి విపక్షరాజబృందము నోడించిన కస్తూరి రంగనాయనికిఁ గృతిపతియైన రాయభూపతి పెదతండ్రి మనుమఁడు కానుమతీపరిణయము కృతినందునప్పటికి రాయనృపాలునకు యుక్తవయస్సు వచ్చిన కొడుకు లుండుటచేత గ్రంథరచన చేసినకాలము ౧౬౩౦ వ సంవత్సర ప్రాంతమని చెప్పవచ్చును." అని వ్రాసియున్నారు. ఈమాటలను గాదని చెప్పుటకాధారములు లేవు.

మొదటి పద్యములోని శ్రీరంగ గురునకును రెండవ పద్యము లోని శ్రీరంగగురునకును గల సంబంధమును దెలుపు పద్యమీగ్రంధము న లేదు. ఈపుస్తకమున నిష్టదేవతా ప్రార్ధనాదికము సామాన్యముగా నన్ని గ్రంథములయందుండు నట్లుండక గ్రంథాది నీక్రింది పద్యమొక్క టియే యున్నది.

ఉ. శ్రీలఁ జెలంగు సత్త్వగుణశీలత నిర్మలమూర్తి వయ్యు నై
నీలరుచుల్వహించితివి నీమదిలోపల నీలకాంతు లీ
లీలఁ బ్రకాశమయ్యెను భళీయను శ్రీయలమేలుమంగకాం
తాళిమరీచి యొమ్మనను దాల్చిన వేంకటభర్తఁ గొల్చెదన్.

ఈ పద్యమునకుఁ బిమ్మట శ్రీరంగగురులను వర్ణించిన పై రెండు సీసపద్యము లున్నవి. దీనినిబట్టి కృత్యాదియందుఁ గొంతభాగముఁబోయి న దనియు, ఇరువురు శ్రీరంగగురులకును సంబధమునుగలుపు పద్య మీ పద్యములలో పోయియుండుననియుఁ దోఁచుచున్నది. మొదటి శ్రీరంగ గురుని కుమారుఁడు, అన్నయాచార్యులనియు, నాతనితనయుఁడు రెండ వ శ్రీరంగగురుఁడనియుఁ దలంచితిమేని, ఇంచుమించుగాఁ గవిచరిత్ర కారులు వ్రాసినకాలమునకు సరిపోవచ్చును. కాని యితరాధార ములు లభించువఱకు నీయూహసత్యమని నిశ్చయింపఁజాలము. మొదటి శ్రీరంగగురునకును, అన్నయాచార్యులకును నడుమ ఒకటిగాని రెండు గాని తరములుండిన నుండవచ్చును.

కృతిపతియైన రాయశౌరి యాస్థానమున నన్నయాచార్యులుండి నట్లీ క్రిందిపద్యములోఁ జెప్పఁబడి యుండుటచేత శ్రీరంగగురునకును నన్న యాచార్యులకును నడుమ తరములున్నమాట సత్యమనియే తలంపవలసి యున్నది.

మ. ధ్వజితాకాశగసింహతల్పుఁజని గందాళాన్న మఖ్యాప్త ది
గ్గజము ల్గొల్వఁగ యోగిరాజ్యపదవా రైకొంచు నప్పాంగమా
నిజనాధీశ్వరు దివ్యవైభవ గుణానీకంబు వర్ణింపుచున్
విజయంబుల్ గల్గను రాయశూరమణుఁడుర్విన్ గీతవిజ్ఞానుఁడై.

ఈ రంగరాజకవి తనగురువునేకాక గురువంశమును వర్ణించి యుండుటలోఁ పై రెండు సీసపద్యములును వ్రాసియుండును. ఇతఁడు అద్దంకి సింగరాచార్యునకుఁగూడ శిష్యుఁడైన ట్లీక్రిందిపద్యములోఁ జెప్పి యున్నాఁడు.

క. వెలయింతు సంతతము ని
ర్మల కుహనాగోపబాల మంజీరఝళం
ఝళనినద వచనరచనల
వల మాయద్దంకి సింగరాచార్య విభున్.

ఈ సింగరాచార్యునిబట్టి కాలనిర్ణయముచేయుట కాధారములు లభింపలేదు.

కృతిపతిని వెంకటగిరి సంస్థానము వారి పూర్వుఁడని చెప్పి యుంటిని. కాని యిందువలన నప్పటికి వెంకటగిరి సంస్థాన మేర్పడిన దని తలంపరాదు రాయశౌరినాఁటికి వెలుగోటివారు, కర్ణాటప్రభువుల సామంతులై వెలుగోడు రాజధానిగా నొకచిన్న సంస్థానమునకుఁ బ్రభు లై యున్నారని తలంపవలసి యున్నది. ఈ వెలుగోటివారి వంశ మును వర్ణించిన భానుమతీపరిణయ కృత్యాదియందలి పద్యములను జాల భాగమును వెలుగోటివారి వంశావళిలో నుదాహరించి యున్నారు. కృతిపతి యైన రాయశౌరి పరాక్రమవంతుఁడగుటయే కాక, పండితుఁ డును భగవద్భక్తుఁడును గూడ నైయున్నట్లు కృత్యాదిపద్యములవలనఁ దెలియవచ్చుచున్నది. గ్రంథవిస్తరభీతిచే నాపద్యముల నుదాహరింప లేదు.

గ్రంథ రచనాకాలము కవుల చరిత్రకారు లనినట్లు పదునేడవ శతాబ్దియందు ప్రథమపాదమనియే నిశ్చయింపవలసి యున్నది. పది-వదునైదేండు వెనుకకుఁబోయినఁ బోవును గాని యీవలకురాదు.

ఈ కావ్యమున శ్రీకృష్ణుని పినతండ్రియగు భానునితనయ భాను మతికిని, పాండవులలోఁ గడపటివాఁడైన సహదేవునకును జరిగిన పరి ణయకథ వర్ణనాంశములలోఁ జేర్చి చెప్పఁబడినది. ఇతివృత్తమునందు

విశేష మేమియు లేదు. ఇందలి కవిత్వము సరసమై ద్రాక్షాపాకమున హృదయంగమముగా నున్నది. శైలి తెలియుటకై కొన్నిపద్యముల నుదాహరించుచున్నాఁడను.

ఉ. చూడఁగఁజూడఁగా మఱియుఁ జోద్యములై దనరారు జాళువా
మేడలమీఁదటన్ మెఱయు మేలిమిటెక్కెము లభ్రవీధులన్
గూడుచు దట్టమై యిరులుగొంచు రవిద్యుతి నడ్డగింపఁగా
వాడల నెండకన్నెఱుఁగువారలు లేరు తలంప నప్పురిన్. ౧అ

ఉ. ఆయెడ ముగ్ధలైన జలజాస్యలు నిర్మలచంద్రకాంత త ౨ ఆ.
ల్పాయత మైన మెట్టికల నల్లన డిగ్గుచు మోము లాసర
స్తోయములందు నందముగ దోఁచిన బంగరుతమ్మి లంచు వేఁ
గోయఁగ వ్రాలి గన్గొనుచు గొల్లున నవ్విరి ప్రౌఢకామినుల్.

మ. సుమనోధన్వధురీణ! మాధవకథా శుద్ధాంతరంగాఢ్యలో ౩ ఆ
లమనోజ్ఞ ద్విజరాజసేవిత! శుకాలాపాదరాలోకయు
త్తమ దాక్షిణ్య! సదాగతి ప్రకటితాత్యంత స్థితానంద! హం
సమతస్థాపక! తే నమోయని సరోజాతాననల్ మ్రొక్కుచున్.

ఉ. దీపితకాంతి పూరసముదీర్ణ మనోహరలీల పద్మరా
గోపలపంక్తిచే మెఱయుచున్నది గావున నోర్మినో కటో
రోపల యోజనం బనుచు మత్పలలోచనలాడ చంద్రరే
ఖాపద పల్లవంబునన క్కేలి గదియించె విభుండు నవ్వుచున్. ౪ఆ

ఈకవి యింటిపేరు రెంటూరి వారని ముద్రిత ప్రతులయందున్నది. కాని యది లేఖకప్రమాదము. గుంటూరు మండలమున బాపట్ల కుత్తరమున నెనిమిదిమైళ్ల దూరమున రేటూరు అనుగ్రామ మున్నది. ఆగ్రామమునుబట్టి యీకవి యింటిపే రేర్పడినది. రేటూరి భావనామాత్యుఁడను కవి కామేశ్వరీ చరిత్రమను ద్విపదకావ్యమును రచియించియుండెను. అతఁడును నీరంగరాజకవియు అద్దంకి సింగరా

చార్య గురుని శిష్యులు. మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నున్నయొక తాళపత్రప్రతిలో నీతనియింటిపేరు 'రేటూరి' అనియే యున్నది. (D. No. 602)

ఆఱువేల నియోగులలో రెంటూరి వారును గలరు. కాని వారిది శ్రీవత్ససగోత్రము కాదు.

## 254 పొట్టూరి గోపన్న

ఈ క్రిందిపద్య మప్పకవీయమునందు నామాఖండ విశ్రమమునకు లక్ష్యముగా నుదాహరించి యున్నాఁడు.

క. అన్నలుఁడు రూపమున సిరి
యన్న కళాయుక్తి భఁతునన్న కరుణచే
నన్న సముద్రపు పెదచి
న్నన్న కుమారుఁడు వేంగళామాత్యుఁడిలన్.

ఈ పద్య మేదియో గ్రంథముయొక్క కృత్యాదియందలి పద్యమువలె కన్పట్టుచున్నది. ఇందు జెప్పఁబడిన వేంగళామాత్యుఁ డెవ్వఁడో తెలియదు. అప్పకవి క్రీ. శ. ౧౬౬౦ ప్రాంతమువాఁడు. కావున నీగోపన యంతకుఁ బూర్వుఁ డనుట స్పష్టము. పొట్టూరను గ్రామము గుంటూరు మండలములో గుంటూరుతాలూకా యందున్నది. ఈకవి యింటిపేరా గ్రామమునుబట్టి వచ్చియుండునని భావింపవచ్చును. ఇంతకంటె నీకవినిగూర్చి యింకనేమియుఁ దెలియదు.

అప్పకవి లక్ష్యముగాఁ గైకొనుటచే నీగోపన్న కొన్నఁదగిన కవియై యుండునని తలఁపవలసి యున్నది.

## 255 పింగళి ఎల్లనార్యుఁడు

ఈకవినిగూర్చి బ్ర. శ్రీ. కందుకూరి వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవులచరిత్రమునందిట్లు వ్రాసియున్నారు. "ఈకవి సర్వేశ్వరమాహా

త్సైవ్య మను నామాంతరముగల తోభ్యచరిత్రమును రచియించెను. తోభ్య చరిత్రము నాలుగాశ్వాసములుగల క్రైస్తవగ్రంథము. "ఇది శ్రీమద్దివ్య టూరి శరభనారాధ్యసద్గురు ప్రసాద లబ్ధాష్టవిధకవిత్వ ప్రవీణ" అని గద్యమునందు వ్రాసికొనుటచేతను,

సీ. భక్తిమై రేణుక ప్రముఖోత్తము నుతించి
మాయదేవాహ్వయు మహిమ పొగడి
చెలఁగి యథావాక్యముల నన్నమయగారి
భజియించి మ్రొక్కిడి పాలకురికి
సోమన్న గారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవముఖ్య సత్కవుల నెంచి
గణపతిదేవుని ఘనత సన్నుతిచేసి
కేమనఁ గీర్తించి విమలమతిని

తే. వ్యాస వాల్మీకి కాళిదాసాది ఘనుల
నన్నపార్యునిఁ దిక్కన యజ్వనెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవిని
జెలఁగి శ్రీనాథముఖకవిశ్రేణిఁ దలఁచి

అని శివభక్తులను ముఖ్యముగా నుతించియుండుటచేతను, ఈకవి శైవుఁడయిన నియోగి బ్రాహ్మణుఁడని యూహింపఁదగియున్నాఁడు. ఇతఁడు క్రైస్తవుఁడుగాక శైవబ్రాహ్మణుఁడే యైనపక్షమున, క్రైస్తవమతగ్రంథ మేలచేసెనో తెలియరాకున్నది. ఇతఁడు క్రైస్తవ మతావలంబనము చేతఁగాని ధనాపేక్ష చేతఁగాని యీగ్రంథమును రచించియుండును. కవి భారద్వాజగోత్రుఁడు; పింగళినాగయామాత్య పుత్రుఁడు. ఇతఁడు కృష్ణామండలములోని కొండవీటి సీమయందుండిన నియోగిబ్రాహ్మణుఁడు. ఈకవి తుమ్మరాయపరెడ్డి ప్రేరణముచేత నీ గ్రంథమును రచియించెను. ఈసందర్భమునఁ గవి కృత్యాదిని వ్రాసిన పద్యములఁ గొన్నిటి నిందుదాహరించుచున్నాను.

చ. తనర విదర్భసీమ కవితంప మనందగు కొండవీటి కిం
ద్రుని దెస రాజ్యలక్ష్మికి నిరూఢనివాస మనంగ భర్తవా
డను పుర మొప్పు నుర్వంబు హారమణిస్థితిఁ బొల్చి సజ్జనుల్
ధనకనకాంబరామల సదావిభవోన్నతిఁ జెందివర్ధిలన్.

వ. ఆపట్టణంబున కధీశ్వరుండు.

సీ. తనకీర్తి కామినుల్ దశదిశాభాగరం
గస్థలంబుల నాట్యగతులు నెఱపఁ
దనశౌర్యవహ్ని దుర్దమ భయంకర శత్రు
ధరణీశ్వరాటవుల్ దరికొనంగఁ
దనదానదారానితంబినీ రత్నము
లర్థినాయకులతో నవఁగి పెనఁగఁ
దనకరుణారస ఘనత రౌషధ మఖి
లార్థిదారిద్ర్యామయంబు లడఁప

ఘనతఁ జెన్నొందు జగనొబ్బగండబిరుద
భూషణుఁడు తుమ్మ వంశాబ్ధి పూర్ణచంద్రుఁ
డలఘు చరితుఁ డనంతాధిపాత్మజుండు
రమ్యరుచిహేళి రాయపరెడ్డిమౌళి

వ. ఒక్కనాఁ డమాత్య పురోహిత విద్వత్కవీంద్రతార్కికమీమాంసిక వందిమాగధ సుహృద్బంధు సేనాధీశ్వర సహితంబుగా వాసాన మంటపంబున గీతవాద్య నృత్య వినోదలీలా కౌతూహల మానసుండై యుచితాసనంబున సుఖాసీనుండై

గీ. అనుఁగుఁ దమ్ముఁడు పాపన్న వినయగరిమ
నాత్మధర్మప్రవర్తన ననుకరింప
బరఁగ ధర మంత్రి పొత్తూరి పాపనార్యుఁ
డెలమి విద్యాప్రసంగము ల్సలుపుచుండ

మ. నను శ్రీమదురు చిత్రశ్లేషణ మహాసంధానుసంధాన
వన కారుణ్యకటాక్షలబ్ధ వరగీర్వాణాంధ్రభాషాకవి పా
త్వ నిరోష్ఠ్య క్రమచిత్ర లక్షణ చమత్కార ప్రబంధాళుక
ల్పమనిశ బింగళి యెల్లనార్యమణిఁ బిల్పించి పల్కెం గృపన్.

చ. ప్రణుత యశోవిశాలుఁడవు భాసుర శబ్దనిగుంభనాదిల
క్షణములఁ జిత్రవైఖరుల సర్వనృపాల సభాంతరంబులన్
గణుతికి నెక్కె నీకవిత గర్ణరసాయన మౌచు విస్ఫురి
గణకవితానమందు నతిగౌరవమందితి మెంచిచూడఁగన్.

◆ ◆ ◆

శా. కొండారెడ్డి ఘనుండు శౌర్యపటిమన్ గొల్చెన్స్మరాటీలను
ద్దండు డన్నయతండు మాకు సుకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్
నిండన్ దామెర వేంకటాధిపుడు మన్నించంగఁ బాహూరిలో
నుండున్ నిన్ను బహూకరింపఁగలఁడే యుద్యత్కృతి శ్రేష్ఠతన్.

వ ... ... మున్ను మజ్జనకాగ్రజుండును గొండారెడ్డికి జనకుండును నగు నోబళరెడ్డి భూకాంతునకుం దదీయాచార్యుం డగు సంజీవనాథస్వామి పరాపరవిజ్ఞాన మార్గోపదేశ ప్రసంగవశంబున నిత్యం బైన సత్యాధ్యయన విధాన ప్రవర్తకుండైన తోభ్యుండను నొక్కమహా పురుషుని దివ్యచరిత్రంబు గల సర్వేశ్వరమాహాత్మ్యంబు చిత్రంబుగా ముఖ వచనంబులం దేటపఱచి సంక్షేపరూపంబైన వాక్యగ్రంథం బొసంగె. దీనిం బరిశీలించి సర్వేశ్వరున కంకితంబుగాఁ దెనుఁగున మృదువచన రచనా గౌరవం బేర్పడఁ బ్రబంధంబుగా నిర్మింపవలయు ... — ...

పయిదానినింబట్టి యీకవి యంతకుమున్ను వచనకావ్యముగా రచియింపఁబడినదానినిబట్టి యీపద్యకావ్యమును రచించినట్లు తెలియ వచ్చుటయే కాక యితఁడు దామెర వేంకటాధిపుని కాలములో నుండి నట్లుకూడ స్పష్టమగుచున్నది. బహుళాశ్వచరిత్రమును రచియించిన దామెర వేంకటాధిపుఁడు పదునేడవ శతాబ్దారంభమునం దుండినవాఁడు.

ఇతఁ డతఁడుగాక యాతని మనుమఁడయినను, కవి పదునేడవ శతాబ్దమధ్యమునందున్న ట్లేర్పడు చున్నది. దీనినిబట్టి చూడఁగా నీలోభ్యచరిత్రము వేదాంతరసాయనము * కంటెఁబూర్వమున రచియింపఁబడినట్లు కానఁబడుచున్నది. ఈకవి కవిత్వము మృదుమధురపాకముగలదయి హృద్యముగానున్నది. కవనపటిమ తెలియుటకై తోభ్యచరిత్రమునుండి కొన్నిపద్యముల నుదాహరించు చున్నాను.

మ. ఇలకంపించినఁ దారకల్ చెదరినన్ హేమాచలం బెంతయున్
దలక్రిందైనను భానుఁడస్తగిరి మీఁదం దోఁచినన్ దిగ్గజా
వలి యల్లాడిన వార్ధులింకిన మనోవాక్కాయ కర్మంబులన్
బలుకంబూనఁ డసత్యమెన్నటికి మానం డాత్మ ధర్మస్థితిన్. ౧

మ. అకటా చేరెడు కూలిబియ్యమునకై యత్యంత నిత్యాన్నదా
న కళావైభవ లక్ష్మికిన్ నిలయమౌ నాతల్లిహస్తాబ్జ మిం
త కృశీభావమునొంది క్రిందుపడఁగా నాగుండె ఱాయంతే విశా
లికలై క్రీలక నిల్చియుండెఁ గఠినోర్వీభృద్విపాషాణమై. ౨

ఉ. బాలుఁడు వీనినింతకును బాముల నొందఁగనీక పెంచితిన్
దాళఁగఁజాలడా కలికి దప్పికి వేళ యతిక్రమించినన్
మేలొనరింపఁ గైకొనివ మిమ్మిఁక నేమని వేఁడుకొందు నా
జాలిదొలంగునట్లు మునిసత్తమ సత్కృప నానతీయవే ౩

ఉ. సంతసమంది యప్పుడ వసన్ మగుడంజని ప్రాణనాథ యా
వంతయుఁ జింతలేదు భవదాత్మజ మున్నగ లేచి పాదుకల్
కాంతుని మ్రోల సడ్డెనపకం బుగఁ దల్పుముడిగ్గు నాసతీ
కాంతునిబోలు నాథునిని గన్నులపండువుగాఁగఁజూచితిన్ ౪

కృష్ణా గుంటూరు నెల్లూరు మండలములలో "భక్తవాడ" యను పేరుగలగ్రామ మిప్పుడెచ్చటను గన్పట్టుట లేదు,

సుప్రసిద్ధ కవిశేఖరుఁ డగు పింగళి సూరనార్యునకును సీతనికి

* వేదాంతరసాయనము మంగళగిరి ఆనందకవికృతమైన క్రైస్తవ మత గ్రంథము. ఆనందకవి చారిత్ర మీగ్రంథమున నొకచోట నున్నది.

సంబంధము లేదు. అతఁడు గౌతమగోత్రుఁడు. ఇతఁడు భారద్వాజ సగోత్రుఁడు.

---

## 256 రాజవోలు సుబ్బారాయకవి

ఇతఁడారువేల నియోగిబ్రాహ్మణుడు; ఆపస్తంబసూత్రుఁడు; శ్రీవత్స సగోత్రుఁడు.

ఈకవి జయవిజయాభ్యుదయ మను నాలుగాశ్వాసముల ప్రబంధ మును రచియించి శ్రీవెంకటేశ్వరున కంకితము చేసెను. అందుఁ గవి దనవంశము నిట్లువర్ణించి యున్నాఁడు.

సీ. శ్రీరమ్యమైన యార్వేల వంశాంబుధి
రాకాసుధాంసుఁడై రహిఁ జెలంగి
పావనం బగు తుంగభద్రానదీ తీర
భాసురరాజవోల్పట్టణాఖ్యుఁ
డై పొగడొందెను హనుమంత యామాత్యుఁ
డతని నందనులు ప్రఖ్యాతయశులు
తిమ్మ ప్రధానుండు తిమ్మరుసయ్య చె
న్నప్ప యనంగ ఘనాతిదాన
మహితు లమ్మువ్వురందు దుర్మదవిరోధి
గజమృగేంద్రుండు తిమ్మరుస్స ఘనుఁడు గనియె
సుతుల వార్గురనందు ధీయుతుఁడు ముద్దు
లచ్చనాఖ్యుండు వెలసె సిలాస్థలమున

మ ధరణిం బెంపు వహించు నాఘనున కుద్యత్కీర్తి జన్మించె నా
శరధిం గౌస్తుభరత్నముంబలె లసచ్ఛౌర్యుండు దీనావన
స్థిర సర్వోజ్జ్వలమానసాబ్జుఁడగుచున్ శేషాచలమాత్యుఁ డా
శరభిద్వాహన కంధరాబ్జ ధరభాస్వత్కీర్తి ధౌరేయుఁడై.

క. ఘనుఁడతఁడు గాంచె నేగురు
తనయుల హరిచరణ భజనతత్పరుల సుధీ
జనహితుల ధర్మరతులఁ
గన దురువిద్యా విలాసకౌశలుల మముఁ.

క. ఆరీతిం జనియించి య
పారలసత్సంస్కృతాంధ్రభాషా సామ్రా
జ్యారూఢి సరసిక విద్యా
ప్రారంభుఁడ నైతి సుబ్బరాయాహ్వయుఁడన్.

ఈకవి రచించిన యితరగ్రంథముల నామముల నీక్రింది సీసపద్య
ములోఁ జేర్చినియున్నాఁడు.

సీ. గంభీర శబ్దార్థ గుంభనాచాతురి
మెఱయఁ జిత్రాంగదా పరిణయంబు
రమణవాగ్ధాటీ నిరాఘాట విస్ఫూర్తి
గరుడాంజనేయ వాగ్వాదకథయు
శృంగార మృదువాక్య సంగతి ద్విపదకా
వ్యముగ సుదంతా వివాహకథయు
సరసకృష్ణార్జున సంవాద మహా ప్ర
బంధంబును గవి జనానందముగను
వెలయ నొనరించినాఁడ నార్వేలవంశ
వననిధి సుధాకరుండ శ్రీవత్సగోత్ర
సంభవుఁడ రాజవోల్పురీస్థానవరుండ
రసికజనరంజనుఁడ సుబ్బరాయకవిని

ఇతఁడు నరకృతి సేయుట కిష్టము లేనివాఁడై తనగ్రంథము శ్రీ వేంకటేశ్వరున కంకితము చేసితినని యీ క్రింది పద్యములో వాకొచ్చియున్నాఁడు.

చ. విమలమతిన్ మహాకృతులు వేడుకతో రచియించి మూఢభూ
రమణుల కిచ్చి వారు సుకరంబుగఁ బోవకయున్నఁ గూటికై
శ్రమపడి చచ్చి దుర్గతి నజస్రముఁ బొందుటకన్నఁ బక్షిరా
డ్గమనునకున్ సమర్పణముగా నొనరించినఁ గల్గు సౌఖ్యముల్.

జయవిజయాభ్యుదయ మొకకల్పనాకథ. పింగళి సూరనార్య కృతమగు కళాపూర్ణోదయమువలెనుండవలయునను నుద్దేశముతో నీ కావ్యమును రచించితి నని కవి యీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. ఘనుఁడా పింగళి సూరనాఖ్యకవి లోకశ్రేష్ఠుఁ డెంతో రహి
న్మును జెప్పె న్విదితాంధ్రభాషను కళాపూర్ణోదయగ్రంథము
న్నవవీధిన్ గవిబృందముల్పనినత్రోవం జీమ లిచ్ఛారతిం
జను నేతద్గతి నేనొనర్తుఁ గృతి శేషాద్రీశు కారుణ్యతన్.

ఇతఁడు కథాకల్పనమునందును నామములనుంచుటలోను కళాపూర్ణోదయము ననుకరించినాఁడు. కాని కవితాచాతుర్యమునను నితివృత్తకల్పనములోను, ఈతని కావ్యము పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమునకు సరిరాదు. కవి ప్రౌఢుఁడును, మృదుమధుర కవితాసామర్థ్యము కలవాఁడునై యున్నాఁడు. ఇతనిగ్రంథములలో నీజయవిజయాభ్యుదయము దప్ప మిగిలినగ్రంథములు నాకు లభింపలేదు. పింగళి సూరనార్య ననుకరించిన గ్రంథమగుటచే నీతనిగ్రంథమునుండి యాశ్వాసమునకు రెండుపద్యములవంతున నీతనికవిత్వ శైలి తెలియుట కీ దిగువ నుదాహరించుచున్నాఁడను.

ఉ. సంతతిలేని మానవునిజన్మము సార్థముకాదు గాన నో ౧ ఆ.
కాంత! వనాంతవీధికిని గారవమొప్పఁగఁ బోయి యయ్యుమా
కాంతుని మోక్షదాయకుని గాలగళున్మదిలోననిల్పి వి
శ్రాంతిమెయిం దపం బొనరఁజల్పి సుపుత్రులఁ గాంతు వేడుకన్

చ. సమయ రఘూద్వహుండు హరిచాప శిలీముఖముల్ ధరించి వే
గమునఁ బయోధరాఖ్య దశకంధరునిన్ గగనంబనే
సమరవసుంధరాస్థలి వెసం బడవేయఁ దదీయ మాంసఖం
డము లిల రాలెనో యనఁ గనంబడె ధారుణి నింద్రగోపముల్.
౧ ఆ.

చ. నరవరసూనుఁడుం దనమనంబున నేమియుఁ గొంకులేక యో
గిరిజ! మదంబ! ప్రోవుమని కేల్నిటలంబునఁ జేర్చి మ్రొక్కి భీ
కరతరభూరిఖడ్గమలుకం జళిపించి మునీంద్రుమస్తమున్
ధరపయిఁ ద్రెళ్ళ నేసె ముదంబున భూతగణంబు లుబ్బఁగన్.
౨ ఆ.

మ. మరుఁడన్గాలవు వేఁటకాఁడు కడుప్రేమం గాంతలావణ్య సుం
దర కాసారమునం దనర్ఘమణికీటం బెన్న చేర్చుక్క నా
మరువా సూత్రమునం నమర్చి విడువ న్మున్మున్ను గావచ్చు వా
ళ్ళరయుగ్మం బనం బొప్పు నేత్రములు నీచంద్రాస్యకు న్వింతగాన్.

చ. సురతరుణీలలామ కడుసొంపున భూపతిదండ నుండి స
త్త్వరగతివచ్చి యారమణి వైఖరిఁ జూచి దరస్మితాస్యయై
మురు వగు నాత్మ రూపము సమున్నతిఁ గైకొని దానిరూపము
న్వరుస నొసంగి తానెఱుఁగనట్టుల నొక్కెడనుండె నంతటన్.

శా. క్షీరాంభోనిధి సంభవించి విబుధు ల్సేవింప సన్మార్గ సం
చార శ్రీనిరవందుచుం గువలయాంచన్మోద సంధాన దక్షోదీ
క్షారంభంబునఁ దేజరిల్లి విధుఁడై సర్వజ్ఞమౌళి న్మహో
దార ప్రక్రియ నుండు నీవబలలం దాపంబుఁ జెందింతువే ౩ ఆ.

శా. నీపాదంబులు నమ్మియుంటి మదిలో నిర్నిద్ర మోదంబు న
న్నేపట్ల న్నితరం బెఱుంగ కెలమిన్నింపారఁ గ్రీడింపఁగాఁ
బాపాత్మ్యుం డగు దేవుఁడిట్టి లెడఁబాప న్వచ్చునే యిర్వురన్
నాపైఁ గోపము మాను మింక నుతపుణ్యాగణ్య! తేజోనిధీ! ౪ ఆ

ఉ. సింగపువారువంబుపయిఁ జెల్వుగ సిద్ధవరేణ్యుఁ డా యా
బంగరుగట్టు విల్లుదొరబాగున వ్యోమపథంబుఁ బట్టి రా
ముంగల రత్నకంధరుఁడు మోహముతోడ నిరాశ్రయుండునై
చంగున దాటుచు న్నడవసాగె మహామహిమాభిరాముఁడై.

౫ ఆ.

మ. పలుకంజాడఁగరాని యవ్యయపరబ్రహ్మంబు లోకంబునన్
దెలియంగా దుర్లభ మెట్టివారికి ధరన్ ధీయుక్తి నూహించినన్
గలదే శ్రీగురు సత్కృపన్ విమల మోక్షాసక్తులౌ రాజయో
గులసద్దైవతపు లైన ధన్యులకు శీఘ్రం బబ్బు నిక్కంబుగాన్.

౫ ఆ.

మ. విను మోవత్స! నిరంజనుండు కపటోద్వృత్తిం దగంబాలునా
కన్నని ని న్నొచ్చలినవాని మున్ను గడువేడ్కం దెచ్చె నింకుండిరిం
పున నయ్యిర్వురు శాంభవీసదనముం బొల్పొంద వీక్షింపఁగాఁ
జని రేమైరో యెఱుంగ మాఘనులు స్వేచ్ఛన్ యొందువర్తిం

[తురో! ౬ ఆ.

చ. తనయులువచ్చిరంచుఁ బ్రమదంబునఁ జారులు విన్నవించినన్
విని వసుమంతనామ పృథివీపతి వేగమె సత్యసీల కిం
పునఁ దెలియంగఁజెప్పుటయు మోమున లేనగ వంకురింపఁగా
వనదరవంబునం జెలఁగు బర్హిణికైవడిఁ బొంగె నయ్యెడన్.

ఈ కవికాలనిర్ణయమునకుఁ దగిన యాధారములు గ్రంథమున నేమియు లభింపలేదు పరాశర వెంకటభట్టరు తనగురువైనట్లీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. ఘనత పరాశరోత్కరవిభుఁడనుఁడయ్యుఁ బరాశరాఖ్యచే
దనరి బుధానురాగ సముదంచితుఁడై విబుధావనస్థితిన్
వనరుహలోచనుం డితుల వర్తిలెనో యన నొప్పు ధీయుతున్
వినుతి యొనర్తు మద్గురుని వేంకటభట్టరు దేశికేంద్రునిన్.

ఇఁకనొక గమణార్యుఁడీతని విద్యాగురువఁట!

క. వరశబ్దశాస్త్రలక్షణ
నిరతామంద ప్రబోధనిర్నిద్ర దయా
కర హృదయు న్సద్విద్యా
గురు రమణార్యు న్భజింతు గురువాక్ప్రౌఢిన్.

ఈకవి నివాసము కర్నూలుమండలములోని సిరివెళ్లితాలూకా రాజోలని తోఁచుచున్నది. పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయము ననుకరించిన వాఁడగుటచే నీతఁడు పదునాఱవశతాబ్దికిఁ దరువాతనుండె ననుట నిశ్చయము. కవికాలము సునిశ్చితముగాఁ దెలియువఱకు నీత నిని బదునేడవ శతాబ్దికవులలో జేర్చితిని.

---

## 257 నెప్పల్లె అప్పనార్యుఁడు

ఇతఁడు కౌండిన్యగోత్రుఁడు; బసవలింగార్యపుత్త్రుఁడు; వీరమాహేశ్వరాచారనిరతుఁడు. ఇతఁడేశాఖకుఁజెందిన బ్రాహ్మణుఁడో తెలియదు. ఇవటూరి రామనారాధ్యుని శిష్యుఁడు.

ఇతఁడు శైవాగమ శిఖామణియను నైదాశ్వాసముల పద్యకావ్యము ను రచియించి శ్రీశైలమల్లికార్జునున కంకితము చేసెను. ఈగ్రంథ మున "భస్మ రుద్రాక్ష శివలింగ మాహాత్మ్యములును తద్ధారణమువలనఁ గలుగు ఫలములును శివపూజాదుల మాహాత్మ్యములును" దెలుపఁబడినవి.

కవి తన గురువు నీక్రిందిపద్యములోఁ గీర్తించియున్నాఁడు.

గీ. అనఘు నివటూరివంశ మహాబ్ధిశశిని
వీరనార్యాత్మజుని సారవినుతయశుని
సకలపరవాది మత్తేభశ స్త్రహరిని
రామనారాధ్యు సద్గురుస్వామిఁగొలుతు.

గద్య:— ఇది శ్రీమదివ్వటూరి రామనారాధ్య చరణాంబుజసేవా ధురీణ శైవశాస్త్రార్థపారీణ సరసకవితాచాతుర్య అనవరత గాంభీర్య వీర మాహేశ్వరాచార నిరత సకలసద్గుణభరిత కౌండిన్యసగోత్రపవిత్ర బ్రహ్మలింగార్యసుపుత్త్రి నెప్పల్లె అప్పనార్య ప్రణీతంబైన శైవాగమ శిఖామణి యను ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసంబు సర్వంబు.

ఈ యప్పనార్యుఁడును, అజ్జరపు పేరయలింగమును, మల్లవరపు వాలేశ్వరకవియు, ఇవటూరి రామలింగయ్యవారి శిష్యులని శ్రీ ఇవ్వటూరి పాపయ్యశాస్త్రిగారు 1950 సం॥ ఏప్రియల్ 17 వ తేదీ త్రిలింగ పత్రికలో వ్రాసియున్నారు. అది సత్యమయ్యేనేని, యీకవి అజ్జరపు పేరయలింగ కవితో సమకాలికుఁడై క్రీ. శ. 1575 — 1625 నడుమ నున్నవాఁడని నిశ్చయింపవచ్చును. ఇంతకంటె నీకవినిగూర్చి యేమియుఁ దెలియరాలేదు.

---

## 258 సింహాద్రి వేంకటాచార్యుఁడు

ఇతఁడు శ్రీవైష్ణవుఁడు, గౌతమగోత్రుఁడు, చెన్నకేశవార్యపుత్త్రుఁడు, తిరుమలాచార్య పౌత్త్రుఁడు; ఇళ్లాదూరి వెంకటదేశికుని శిష్యుఁడు. ఈకవి లక్షణాపరిణయమను నామాంతరము గల చమత్కారమంజరి యను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి రామానుజ మతస్థాపకుఁడయిన రామానుజాచార్యులకుఁ గృతియొసంగెను. ఈకవి తననుగూర్చి యొక్క పద్యముమాత్రమే వ్రాసికొనియెను. ఆ పద్యమును, గ్రంథాంతగద్యయును ఈకవిచారిత్రమున కాధారములు. వానినీక్రింద నిచ్చుచున్నాఁడను.

క. అతి యకృష్ణబ్రహ్మా క
టాక్షోదిత రసిక పరిషదాహాకృతి సం
ధుక్షిత నవనవకవితా
దక్షుఁడ సింహాద్రి వెంకటాఖ్యాకుండన్.

గద్య:- ఇది శ్రీమద్రామానుజ భాగినేయకుల సార్వభౌమ శ్రీమాన్మల్లనాచార్యపరిచర్యధుర్య చెన్న కేశవాచార్యపుత్ర తిరుమలాచార్య పౌత్ర గౌతమగోత్ర సింహాద్రి వేంకటనామధేయ ప్రణీతంబైన మహా ప్రబంధ చమత్కార మంజరి.........

ఇతఁడు తనగురువు నీక్రిందిపద్యములో స్తుతించియున్నాఁడు

శా. శ్రీరామానుజ భాగినేయుఁడయి తచ్ఛ్రీభాష్యసింహాసనం
బారూఢిం గృపచే లభించు ఘనుఁడా యంబారువంశంబు వి
స్తారంబొంద జనించినట్టి వరదాచార్యాత్మజాతు న్నిళా
దూరీ వేంకటదేశికుణ సుగుణపాంధోధిం బ్రశంసించెదన్.

ఈక్రిందిపద్యములో భద్రాచలమందలి శ్రీరామచంద్రుని నుతించియుండుటచే నీతఁడు గోదావరిమండల వాసుఁడేమోయని యూహ కలుగుచున్నది

సీ. మున్నహల్యా గౌతములకు పెండ్లిఘటించి
పిదప నజ్ఞానకి బెండ్లియాడి
మున్నె యాశబరి కింపుగ విందుగావించి
చారువన్య ఫలంబు లారగించి
మున్నె విభీషణు ముదమొప్ప లంక నే
లించి యయోధ్యబాలించి మించి
మున్నె రావణునింటనున్న వేలుపుటాండ్ర
జడలువిప్పించి తాజడలు విప్పి
యిట్లు తనుగొల్చువారల కెల్ల మిగుల
నాదరంబున బహుమాన మాచరించు
రాజు భద్రాచలస్వామి రామచంద్రుఁ
డొనర నాడెందమున నిండి యుండుఁగాత.

ఈకవి యెప్పటివాఁడో తెలియఁదగిన యాధారము లేమియు లభింపలేదు. ఈతనిగ్రంథమునుండి యప్పకవి లక్ష్యములను గైకొని యుండుటచే నీతఁడప్పకవికిఁ బూర్వుఁడనుట నిశ్చయము. అప్పకవీయము క్రీ. శ. ౧౬౫౬ వ సంవత్సరమున రచియింపఁబడిన దగుటచే నీకవి పదునేడవశతాబ్దియందుఁ బ్రథమపాదమున నుండియుండును. అప్పకవికిఁ బూర్వులయిన లాక్షణికు లెవ్వరు నీతనిగ్రంథమును బేర్కొనకపోవుటవలన నితఁడు ౧౬౩౦ – ౫౦ సంవత్సరప్రాంతము వాఁడని యూహింపఁ దగియున్నదని శ్రీవీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు.

అచ్చటచ్చట ఇకారసంధులాదిగా గొన్నివ్యాకరణ దోషము లున్నను నీతని కవిత్వము ప్రౌఢమై హృదయంగమముగా నున్నది. ఈతని కవిత్వశైలి తెలియుటకై మూఁడుపద్యముల నిటనుదాహరించుచున్నాఁడను.

మద్రదేశాధిపతి యగు బృహత్సేనమహారాజు తనయ యగు లక్షణను, శ్రీకృష్ణుఁడు పరిణయమాడిన కథ యిందువర్ణితమైనది.

ఉ. ముక్కరముత్యమున్ మిగుల మోహపుఁజుక్కను గూడి వక్త్రమున్
 జిక్కలరేడు గాంచిసవరించిన సామపు ముద్దుకుఱ్ఱకున్
 జొక్కపు బావలన్ బసిఁడిసోగలఁ గట్టినలాలి లీలతో
 నక్కున వ్రేలుదాళి చెలువారఁగ వచ్చె సుదంతయంతటన్. ౧ ఆ.

చ. విను మతఁడెంతజాణయొ యవేద్యమతీరితజాతిభాష నె
 మ్మనమునఁ జక్కఁగాఁ దెలిసి మన్మన నీతివినీతివాక్యముల్
 దనరఁగఁ బల్కరించెఁ బ్రమదంబున నేనును వారిచెంత యం
 దొనరు ప్రవాళపీఠమున నుండి సుబోధ మనుష్యభాషలన్. ౨ ఆ

చ. ఎలమిగఁ జిన్నవాఁడె తను నెత్తుక ముద్దొనరించు వ్రేఁతమూఁ
 కల జిగిమోవి చన్నులును గంఠుడుకాయ లక్కదొండపం
 డులుగ నొనర్చి యాడినఘనుం డిపు డెండతనైనఁ బెండ్లియై
 పొలుపగుటేమి యంచు నొకపోఁడ నగించె సఖీజనంబులన్.
 ౩ అ.

ఈకవి పూర్వకవుల నెవ్వరిని పేరుపెట్టి స్తుతించియుండలేదు. ఈగ్రంథముయొక్క వ్రాఁతప్రతులు రెండు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నవి. అందొకదానిపై నీతీరున వ్రాయఁబడియున్నది. విశ్వావసు సంవత్సర ఫాల్గుణ బ॥ ౧౩ జయవారం పోడూరి రామకవి వ్రాసిన ప్రతిక్రమానను తురగా వెంకటార్యుడు కుమారుఁడు సర్వేశం వ్రాసికొనెను." ఇందు జెప్పఁబడిన రామకవి శివరామాభ్యుదయమునురచించినపోడూరిపెదరామామాత్యునిసోదరుఁడు

ఈగ్రంథమునుగూర్చి బ్రౌనుపంతుఁడిట్లు వ్రాసి యుంచినాఁడు

" This poem is useless – it is composed in a bad pedantic style and is in many places nearly unintelligible. Yet it is much admired by some learned Telugus. The subject of the poem is the marriage of Kristna which is the theme of at least twenty Telugu Poems.

" కేవల పాండిత్య ప్రకర్షనుచూపెడి హేయమైన శైలిలో వ్రాయఁబడిన యీకావ్యము నిరుపయోగమైనది. చాలచోట్ల నర్థము విస్పష్టముగాకుండ నున్నది. అయినను ఆంధ్రపండితులు కొందరు దీనిని చాలమెచ్చుకొనుచున్నారు. ఈకావ్యమందలి విషయము శ్రీకృష్ణ కల్యాణము. అథమ మిరువది యాంధ్రకావ్యములయం దీకథ వర్ణింపఁబడి యున్నది."

బ్రౌను పండితుని మొదటివాక్యములలో సత్యములేదు. ఇది యాతఁడనుకొనునట్లు చెడ్డగ్రంథము కాదు. అవి గ్రంథమందలి స్వారస్యమును గ్రహింపకుండ వ్రాసినమాటలని తలంపవలసి యున్నది. శ్రీకృష్ణుని పరిణయ కథ లాతఁడనినట్లిరువది పుస్తకములలో వర్ణితమై యుండిననుండవచ్చును. కాని లక్షణతో శ్రీకృష్ణునకు జరిగినపరిణయమును వర్ణించుగ్రంథములు మూఁడునాలుగుకంటె నధికముగ లేవు.

పోడూరు పెదరామామాత్యుఁడు క్రీ. శ. 1750 ప్రాంతమునం దుండెను. ఆతని సోదరుఁడైన రామకవికూడ నప్పటివాఁడేయగును కదా! ఈ వెంకటార్యుఁడంతకుఁ బూర్వుడు. పైనిచెప్పిన కాలము సరియైనదనియే నిర్ణయింతము.

## 259 పైడిమఱ్ఱి వెంకటపతి

ఈకవి చంద్రాంగద చరిత్రమనెడి యాఱాశ్వాసముల ప్రబంధమును రచించి, శ్రీరామచంద్రుని కంకితము చేసెను. "ఈతనికవిత్వము రసవంతమయి ప్రౌఢమయి పూర్వకవుల రచననుబోలి హృదయాహ్లాదకరమయినదిగా నున్నది" అని కవులచరిత్రమున శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియున్నారు. ఇతఁడు షష్ఠ్యంతములకుఁ బిమ్మటను కథాప్రారంభమునకుఁ బూర్వమునను తననుగూర్చి యీక్రింది సీసపద్యమును వ్రాసికొని యున్నాఁడు.

సీ. సకలసత్కవి పూజ్య సుకవిత్వ సామ్రాజ్య
నిర్వాహకుఁడు పెద్దపర్వతన్న
వివిధభాషాచార్య విరచనాచాతుర్య
సర్వంకషుఁడు బోడిపర్వతన్న
వరపద్యదాకార వాచాచమత్కార
నిరుపమ మతిశాలి తిరుమలన్న
అవధానకృతి గర్భకవితాచ్ఛ సందర్భ
కీర్తితప్రజ్ఞుండు కేశవన్న
తనకు నన్నలుగాఁగను దనరుకృష్ణ
రాయభూషణకల రామరాజతనయు,
కేశవాత్మజ పర్వతాధీశు వేంక
టాద్రి నిదె కావ్య మేనిత్తు నంకితముగ.

"ఇందలి పేరులనుబట్టియు, కవికాలమిది యని నిశ్చయించుటకాధారము దొరకలేదు. ఇందు "కృష్ణరాయభూషణ"యను పదముండుటనుబట్టి కర్నల్ మెకంజీ దొరగారు సంపాదించిన లిఖితపుస్తకముల పట్టికలోఁగవి కృష్ణదేవరాయని కాలములోనివాఁడని చెప్పఁబడియున్నది. ఇటీవల బ్రౌణ్దొరగారు తమ నిఘంటువునందీకవి యాధునికుఁడని వ్రాసియున్నారు. పయిపద్యములో కృష్ణరాయభూషణ శబ్దమూ కవికి కృష్ణదేవరాయని యాస్థానమున కలంకారముగా నుండుటచేతనే

వచ్చినను, ఈకవి కృష్ణరాయ భూషణుని వంశజుఁడగు రామరాజు కొడుకైన కేశవార్యుని పుత్రుఁడగు పర్వతాఖ్యునిసుతుఁడగు వేంకటపతి యగుటచేఁ గృష్ణదేవరాయని యనంతరమునఁ బెక్కుతరములు గడచిన తరువాత నున్నవాఁడనుట స్పష్టము. అప్పకవి యీచంద్రాంగద చరిత్రము లోనిపద్యముల నుదాహరించియుండక పోవుటచేత నీకవి౧౬౫౦వ సంవత్సరమునకుఁ దరువాతి వాఁడన యూహింపదగియున్నాఁడు. అందుచేతఁ గవి ౧౭౦౦ సంవత్సర ప్రాంతములయం దున్నవాఁడని తోఁచుచున్నది.'' అని వ్రాసియున్నారు.

ఈ చంద్రాంగద చరిత్రమును ముద్రించిన యాముద్రిత గ్రంథ చింతామణీ పత్రికాధిపతు లగు పూండ్ల రామకృష్ణయ్యగారు యీకవి పద్యముల నప్పకవి లక్ష్యములనుగా దీసికొనకపోవుటచే నీతఁడప్పకవికిఁ దరువాతివాఁడను విషయము నంగీకరింపక తక్కినవిషయములలో వీరేశలింగము పంతులు గారితో నేకీభవించియున్నారు.

పైనివ్రాసిన సీసపద్యములో కవి తనకులగోత్రాదులను జెప్పుకొని యుండలేదు. తనను గ్రంథాంతగద్యమునం దిట్లు తెలుపుకొని యున్నాఁడు.

గద్య:- ఇది శ్రీరామచంద్రచరణారవింద మిళిందాయమాన మానస సకలశాస్త్రాధ్వరివతంస, పైఁడిమఱ్ఱి పద్మనాభాధ్వరివతంస కృపాభూషణ కృష్ణరాయభూషణ పర్వతరాజతనయ వేంకటపతి విరచితంబైన త్రిం బను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము"

ఈ గద్యలోఁ జెప్పఁబడిన పైడిమఱ్ఱి పద్మనాభధ్వరి కవికి గురువైనట్లు కన్పట్టుచున్నది. అతఁడు సకలశాస్త్రపండితుఁడై నట్లును, ఆతని కృపచే భూషితుఁడైనట్లు కవి చెప్పుకొనియుండుటచే నాతఁడీ కవికిగురువనియే భావిపందగియున్నది. పైఁడిమఱ్ఱి యనునది గురువుయొక్క గృహనామము కాని కవియింటిపేరు కాదు. కవియింటిపేరు "కృష్ణరాయభూషణ" అయినట్లు పైనినుదాహరించిన సీసపద్యములోని "కృష్ణరాయభూషణకుల' అనువాక్యమునుబట్టియు, గద్యలోని 'కృష్ణరాయ

భూషణ పర్వతరాజతనయ...' అనువాక్యమునుబట్టియు నిర్ధారణమైన ద్వ వలసియున్నది. కృష్ణరాయభూషణ 'శబ్దము' ఇంటిపేరుగాక, కృష్ణరాయల సభ కలంకారము వంటివాఁడని యర్థమిచ్చు బిరుదశబ్దముగ భావించితిమేని, యాబిరుదము చరిత్రకారులును పీఠికాకారులు ననుకొనినట్లు రామరాజునకుఁగాక కవితండ్రి యగు పర్వతరాజునకే యన్వయించునని గద్యమునుబట్టి నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈబిరుదము, నిజముగా పర్వతరాజు చేసంపాదింపఁబడినను, గవి యాబిరుదమును, పూర్వులకుకూడ నన్వయించునట్లు "కృష్ణరాయభూషణవంశ" మని సీసపద్యములో వ్రాసినను వ్రాసియుండవచ్చును. ఈయూహ నిజమైనచోఁ గవి పదునాఱవ శతాబ్దిని మధ్యకాలమున నుండినవాఁడగును. ఇతరాధారములు లభించినచేతప్ప, ఈవిషయమున నిదమిత్థమని నిర్ణయింప వీలులేదు.

ఇతనికవిత్వమున ఆముక్తమాల్యద, మనుచరిత్రము ల కనుకరణములు బాగుగా గన్పట్టుచున్నవి. అందుచే నీకవి పదునాఱవశతాబ్దికిఁ బూర్వపువాఁడు కాఁడనియు, బదునేడవ శతాబ్ది యందున్నవాఁడనియు దలంపవచ్చును. కృష్ణరాయల సభ కలంకార ప్రాయుఁడైనవాఁడు రామరాజని తలంచినను నతఁడే కృష్ణరాయలో నిర్ణయింపలేము. ఆంధ్రభోజుఁడని కీర్తిగాంచిన శ్రీకృష్ణదేవరాయలే యని తలంచినను ఆతని కాలములో రామరాజున్నచో నాతనితనయుఁడు కేశవుఁడు ౧౫౬౦లోను, పర్వతరాజు ౧౫౯౦లోను, వెంకటపతి ౧౬౫౦ ప్రాంతమునను నుండువారని నిశ్చయింపవచ్చును. అంతకుఁ దరువాతివాఁడనుట కవకాశము లేదు. ఈకవి కగ్రసోదరులగు పెద్దపర్వతన్న, బోడిపర్వతన్న, తిరుమలన్న, కేశవన్నలు గూడఁ గవులైనట్లు పైపద్యములో నున్నది. కాని వారు రచించిన గ్రంథములపేరులైనను తెలియలేదు.

ఈగ్రంథమున సీమంతినీ చంద్రాంగదుల పరిణయకథ వర్ణితమయినది. చంద్రాంగదుఁడు నలచక్రవర్తి తనయుఁడైన యింద్రసేనుని కుమారుఁడు. సీమంతిని తండ్రి చిత్రసేనుఁడు లేక చిత్రవర్మఁడు.

ఈకథనే పెనుమళ్ళ సోమయార్యుఁడు సీమంతినీ పరిణయ మను పేర ప్రబంధమును రచియించినాఁడు. బ్రహ్మోత్తర ఖండమునందలి మూఁడవ యాశ్వాసమునఁగూడ నీకథయే కలదు. కాని యీరెండు గ్రంథముల యందలి కథకును చంద్రాంగద చరిత్రయందలి కథకును భేదమున్నది. ఆరెండు కావ్యముల యందును సోమవార వ్రతమాహాత్మ్యమును దెలుపు సందర్భమున నీకథ చెప్పఁబడినది. ఇందు సోమవార వ్రతముతో సంబంధములేదు. ఇందలికథ యిది.

"చంద్రాంగదుఁడొకపరి వేఁటకేఁగి కడుదవ్వరిగి యొకవంకం గొరవంకం దఱుముకొనిపోయి, రమ్యమైన యుపవనమునఁ జిత్రసేన రాట్పుత్రి యగు సీమంతినిఁజూచి విరహమునఁ బరితపించుచుండ నా శారిక స్త్రీరూపధారియగుటయు నతండదిచూచి వింతపడుచున్నతఱి శారికారూపధారి యగు నాస్త్రీ దగ్గరిన నాతఁడీవింత యేమనియడుగ తనపేరు చిత్రరేఖ యనియు, నీవుచూచిన యాయింతి చిత్రసేనరాట్పుత్రి యగు సీమంతినియనియు నామె యుదయమందినపుడు కార్తాంతికు లీమె పదునాల్గవయేటఁ బతివియోగమొందు ననితెల్ప విని రాజు మిక్కిలి చింతాక్రాంతుడయి చేయునదిలేక తనతనయనతిగారాబమునఁ బెంచుచుండ సత్యప్రతిజ్ఞుఁడను విప్రుఁడొకఁ డరుదేరఁగా నా బాల యావిప్రునకు దండమిడ నతఁడు "దీర్ఘసుమంగలీభవ" యనిదీవించె ననియు నంతట నచటనుండువారి వలన జ్యోతిష్కుల సిద్ధాంత మెఱింగి తనమాటను నిలుపుకొనుటకై గౌరిఁగూర్చి తపమొనర్ప నాయమ ప్రత్యక్షమై యావిప్రుని సత్యవచనుం గావింపనెంచి తన చెలియగునన్నుం గని నీవు సీమంతినితల్లి యగు విమలకుఁ జెలికత్తియవుగా భూలోకముం జేరి దీర్ఘాయుష్మంతుండగు చంద్రాంగదు నాసీమంతినికిం గూర్చి బాల్యమున నామెకు రాఁగల వైధవ్యముం బాపి రమ్మనె నన్నంపెయుండి నీ వీ వనీ ప్రాంతంబుల విహరించుట నెఱింగి శారికావేషధారినై నిన్నులయించుకొని వచ్చితిననియు, నామె నీయందు బద్ధానురాగయై యున్నదనియు దెల్పి నిన్నానవనితకుం గూర్చెద నని వక్కాణించి సీమంతినితల్లి యగు

విమలకడకేఁగి చంద్రాంగదుచిత్తరువుపట మొక్కటిదాని నామెకొసంగి వానికులవర్తనాదులెఱింగించి యాతనిపై సీమంతినినిరాళిఁ గొనియుండు టను సూచించి స్వయంవరోత్సవముం బ్రవర్తిలఁజేసి యాతనివరించున ట్లొనరించెద ననియు నిది యంతయు సత్యప్రతిజ్ఞుని తపోమహిమ యనియు వెల్లడిచేసి, యట్లే వారిరువురకుఁ బరిణయ మగునట్లుచేసెను''

ఈతనికవిత్వము ప్రౌఢమయినదనియిదివఱకే చెప్పియున్నాఁడను' శైలిచూపుటకై చంద్రాంగద చరిత్రమందలి కొన్నిపద్యముల నిట నుదాహరించెదను.

మ. ధర నేనోములు నోచిన న్వరుస నేదానంబు లీఁజాలినన్
హరిసేవారతి లేనివాని కకటా యాభాగ్యమేలబ్బెడిన్
మరుభూభాగమున న్పిపాస యడఁగింపంబూని యేయత్నముల్
బరగన్ జేసిన నీళ్లుపుట్టునె నదీప్రాంతంబునన్ దక్కఁగన్.
౧ ఆ.

చ. అకట నిదాఘతాపమున నగ్ని యొకించుకఁ దాళలేక మే
నికిఁ దగుచల్వ గావలసి నీటమునుంగఁగఁబోలు లేనిచోఁ
దుకతుకఁ గ్రాఁగ నేటికి నదుల్వనధుల్నిజాంతరో
దకముల వేఁడిమిందెరలి తద్దయు మిట్టిపడంగ మీనముల్.

శా. అస్తోక క్రతుహోమ ధూమముల చాయల్ తీర్థకుండంబులన్
దుస్తైతోపగఁజూచి యందు నెసఁగెన్ ధూమంచిటాదూరతో
పాస్తం బగ్ని ఘనంబునం దలఁప నాహా తప్పేఁబో 'యత్రధూ
మ స్తత్రాగ్ని" రితీరితం బను శ్రుతిన్ మారా! కనుంగొంటివే.
౩ ఆ.

మ. వనజాప్తుండు ప్రవృద్ధుఁడై సముచితవ్యాపారతన్ దక్షిణా
వనికిన్ బట్టము గట్టి పట్టి హిమవద్వన్యాగ్రివీధిన్ దపం
బన వద్వ్యస్థితి సల్పఁగా నరుగుచాయం బోయెఁ దా నుత్తరం
బునకుం దాపసవాథ వైఖరిఁగన స్ఫూర్జజ్జటాపాళియై. ౪ ఆ

మ. పతి యస్తంగతుఁడైనచో ననుగమింపన్ యుక్త మేపట్టునన్
సతులౌ వారికి నంచుఁ జంద్రుఁడు సనన్ దారప్రభాతాగమో
న్నత సంధ్యారుణ మచ్ఛలాహిత చితిన్ వ్రాలె న్నిజం బట్లుగా
నీతిన్ జంద్రుఁడు గ్రుంకఁ గన్పడక యున్నే తారకానీకముల్.
౫ ఆ.

ఉ. నెలతా కంబము చాటున న్నిలిచి యెంతే నందఁ బ్రాణేశ్వరో
జ్జ్వల దాకారముఁ గాంచి వీఁడె పతి చేర్ప న్నేరి నంచున్మదిన్
దొలఁగంగోరి యొకింత యోరసిలి కాంతుండున్న యామైకిఁ జే
రి లతాతన్వి విభుండుఁ దానపుడె తార్చెన్ సెజ్జకుం దార్చినన్
౬ ఆ.

కవికాలమునుగూర్చియుఁ గులగోత్రాదులను గూర్చియు నింకను బరిశోధింపవలసియున్నది. "హైడిమత్తి" యను నింటిపేరుగలవారు తెలగాణ్యశాఖీయు లగు వైదిక బ్రాహ్మణులలోఁ గలరు.

---

## 260 దామెర అంకభూపాలుఁడు

ఈకవి ఉషాపరిణయ మను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి శ్రీరామచంద్రమూర్తికిఁ గృతి యొసంగెను. ఇతఁడు పద్మనాయకకులజుఁడు, ఇనగాలగోత్రుఁడు; చెన్నభూపాలునకును దిమ్మాంబకును బుత్రుఁడు; బహుళాశ్వచరిత్రమును రచించిన దామెర వెంగళరాయకవి యీతనికిఁ బినతండ్రి. ఈయంకభూపాలుని తండ్రియైన చెన్నభూపాలునకుఁ గృష్ణాంబ, లింగాంబ, తిమ్మాంబ, వెంగాంబ యను నలువురుభార్యలు. కృష్ణాంబ యందు వెంకటభూపతి జన్మించెను. ఇతఁడు చెంజిరాజునుజయించి తనతండ్రి పేర చెన్నసాగరమును గట్టించి నట్లీక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. రహి నవ్వేంకట ధారుణీరమణుఁ డౌరా! తండ్రి పేరొప్పఁగా
మహిఁ జిత్రంబగు చెన్నసాగరము ధర్మస్ఫూర్తిఁ గట్టించె స
త్య హరిశ్శోధిత తేజుఁ గృష్ణ ఘనవాహాధీశజున్ వాలి బ
ల్వహి నే చెంజిరమాధ్యుఁ ద్రుంచి శుభలీలం గాంచె రామోన్నతిన్.

లింగాంబ యం దయ్యనృపతి జనియించి, తనతండ్రి పేరఁ జెన్నపట్టణమును గట్టించిన ట్లీక్రింది పద్యభాగమునఁ గాననగును.

తే. ప్రళయకావేరి (Pulicat) మైలాపురంబుఁ (Mylapore) గల్గి
బీరమునఁ గోర నది మట్టుపెట్టఁ దండ్రి
పేరఁ దన్మధ్యభూమిని బృథువిభూతి
నలవరిచెఁ జెన్నపట్టణ మయ్యనృపతి.

ఇదియే యిప్పటి చెన్నపట్టణము.

తిమ్మాంబయందు చెన్నభూపాలునకీ కవి జననమందెను. వెంగాంబయందు చినవెంకటాధిపుఁడు గలిగెను.

ఈకవికి శ్రీరామచంద్రుఁడు స్వప్నమున దర్శనమిచ్చి యుషాపరిణయమును దనకుఁ గృతియిమ్మని యాజ్ఞచేసిన ట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

చ. నిలిచినఁ జూచి లేచి హరినీలశుభాంగు పదాబ్జయుగ్మముల్
వలగొని మ్రొక్కి యస్మదభివాంఛితము ల్సఫలమ్మారె నంచు ని
శ్చలతరభక్తి యుక్తిఁ బలుచందముల న్నుతిసేయుచో దయా
కలిత కటాక్షవీక్ష ననుఁ గన్గొని పల్కెఁ బ్రభుత్వసంపదన్.

మ. మనమందున్ మముఁ జేర్చి నీవు రచియింపంబూను బాణాత్మజా
వనజాతాశుగపుత్రి చిత్రకథ తేవన్ మాకు నర్పింపనన్
వినయం బొప్పఁగ నట్లుసేతుననుచున్ మేల్కాంచి మోదించి యా
ఘనలీలాంగునకున్ బ్రబంధ మొనరన్ గావించి నే నిచ్చెదన్.

కవి యీస్వప్నవృత్తాంతమును దనయన్నగారైన వెంకటనృపాలునకు విన్నవించినట్లును నాతఁడందుల కనుజ్ఞయిచ్చినట్లును నీక్రిందిపద్యములలోఁ జెప్పుకొని యున్నాఁడు.

క. ఏనట్లఁ జేరి తదంఘ్రుల
కానతి యొనరించి యతనియానతి వినయం
బూనుచు సమీపమున నా
సీనుఁడ నగుటయు నతండు స్మితయుతముఖుఁడై.

క. నను గారవింప నేనును
వినయంబునఁ జేరి స్వప్నవృత్తాంతంబున్
వినిపించిన విని మోదం
బున బుధజనరాజిఁ జూచి పొంగుచు ననియెన్.

క. అనఘాత్ములార! మాయం
కన నిన్నటి రేయిఁ గన్నకల వింటిరె మ
మ్మను గృతిఁ దనకిమ్మనె న
య్యినకులు కారుణ్యమహిమ యెంతన వచ్చున్.

వ. అనుటయు,

క. పావన మూకల శుభముల
కావాల యితండు సేయునట్టి ప్రబంధం
బావన జాసనసుతునకు
రావణసంహారకునకు రఘురామునకుఁగా.

తే. అంకితంబొనరింప వీరాంకనృపతి
కానతి యొసంగుఁడనుటయు నవ్విభుండు
నను గనుఁగొని నీవు పూనినమహా ప్ర
బంధ మొసఁగుము జానకీపతికి ననిన.

అన్న గారి యాస్థానపండితు లనినట్లు చెప్పిన యీక్రింది సీస పద్యమువలన నీకవి సామర్థ్యము విదితమగుచున్నది.

సీ. అలరఁ జేయఁగ నేర్తు వసహాయశూరత
ఘటికాశత గ్రంథకల్పనంబు
సవరింపనేర్తువు సర్వతోభద్రకం
కణబంధముఖచిత్ర కావ్యరచన

ప్రకటింప నేర్తువు వికచపంకజబృంద
మకరంద నిష్యంద మధురఫణితి
ఘటియింప నేర్తువు కమనీయ పదబంధ
సంధాన సరస విస్తరణసరణి
గీ. నీకె తగు సౌ నంచుచిత్తార్థికతాన
జాతివార్తాధ్య కవన లీలాతిరూఢి
యరినృపాఖర్వ గర్వసంహరణ జాగ్ర
దాగ్రహాటోప! దామెర యంకభూప!

కవి తనగ్రంథమందలి కవిత్వరీతి నీక్రిందిపద్యములో సూచించి యున్నాఁడు.

సీ. మును గృతుల్సేసిన ఘనులరీతులకన్న
వింతయై నేర్పుచే వెలయుచుండ
లలితము గూఢము లక్షణయుక్తంబు
చిత్రవైఖరియు నై చెన్ను మెఱయ
ధారాళగతియును దగు జాతివార్తయు
శృంగారవిధమును జెలఁగుచుండ
శబ్దగాంభీర్యంబు చతురోపమోత్ప్రేక్ష
లును దగుచోటులఁ దనరుచుండ
సమ్మదంబున బుధులెల్ల సంస్తుతింప
నొక మహాకృతి యతులకౌతుకముతోడ
నొనర రచియింపఁగాఁ బూనియున్న వేళ
నధికతర మైన నాదుభాగ్యంబు కతన.

ఈతని యగ్రజుఁడైన వెంకటభూపాలుఁడు వాలూరి పురాధీశ్వరుఁడని వర్ణించియున్నాఁడు. ఈవాలూరు యిప్పటి రాయవెల్లూరు. కవి నివాసముకూడ నాపట్టణమే యనుటకు సంశయములేదు. అగ్రజుఁడైన వెంకటనృపతి రణకోవిదుఁడై భూపాలకత్వము వహించి పోషింపుచుండ నీకవి పాండిత్యములవరచుకొని కాలమును గ్రంథరచన

కై వినియోగించినట్లు కన్పట్టుచున్నది. పైని నుదాహరించిన సీసపద్యములను జదివినవారి కీతఁడొక్కింత యాత్మశ్లాఘనా ప్రియుఁడని స్ఫురింపకమానదు. ఈక్రింది గద్యలోఁగూడ తన యగ్రసోదరుని స్మరించుటచే నీతని కాతనియందెక్కుడు భక్తిగలదని తోఁచుచున్నది.

"ఇది శ్రీమద్దామెర్ల వంశముక్తాఫల చెన్న పాలకలశజలధిరాకా శశాంక కోర్కొంటు సింహాంక బాహుబలవిశంకట వేంకటక్ష్మావల్లభానుజాత వితరణాభినవభానుజాత సీతారమణ కరుణారసస్యందకందళిత లలిత కవితాలతాల వాంకభూపాల విరచితంబగు నుషాపరిణయంబను మహా ప్రబంధంబు"

ఈతని పినతండ్రి యైన వెంగళభూపాలుని చరిత్రమున నాతని కాలనిర్ణయమును గావించియుంటిమి. ఈకవి యాతనికంటెఁ గొంచె మీవలివాఁడై యుండును. కావున హూణశకము పదునేడవ శతాబ్ది మధ్యకాలమున నున్నవాఁడని చెప్పవచ్చును.

ఉషాపరిణయమునందలి కథ సుప్రసిద్ధమైనది. ఈగ్రంథ మింకను ముద్రింపఁబడలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున మూఁడు వ్రాఁతప్రతులున్నవి.

ప్రస్తుత చెన్నపట్టణము క్రీ. శ. ౧౬౩౯ వ సంవత్సరమున నిర్మిత మైనట్లు స్యూయల్ పండితుఁడు వ్రాసియున్నాఁడు.

"In 1639, Damerla Venkatadri Naidu the then Poligar, granted the village Chennakuppam to the English, who obtained a sanad for it, from the Raja of Chandragiri the expatriated prince of Vizianagar. The Poligar stipulated that the new settlement was to be called Chennapatnam after his father Chennappa or Chennaiah Naidu.

On the site so obtained Mr. Day built Fort St. George and found the city now called Madras.

(Vol. II page183.).

ఆకాలమునఁ జంద్రగిరియందు రాజ్యము సేయుచున్న విజయనగర ప్రభు వెవ్వరో యిందుఁజెప్పలేదు.

చెన్నపట్టణనిర్మాణము నిందుఁ బేర్కొనుటచేఁ గవి యీగ్రంథమును క్రీ. శ. 1639 కిఁ దరువాత రచియించెనని స్పష్టమగుచున్నది

---

## 261 అందుగుల వెంకయ్య

ఈతఁడు నియోగి బ్రాహ్మణుఁడు; సూరసచివుని కుమారుఁడు రామరాజీయ మను నామాంతరముగల నరపతి విజయ మను నాల్గాశ్వాసముల ప్రబంధమును రచియించి కోదండరామరాజున కంకిత మొసఁగి నవాఁడు.

కృతిపతి కవితోఁ బలికినట్లు రచించిన యీక్రింది పద్యమువలన కవి నామాదికమును కృతిపతి యుద్దేశమును గ్రంథసందర్భ విషయమును కొంతవఱకుఁ దెలియఁగలవు.

క. నగుమొగమున నను గనుఁగొని
జగతీసుగవంశమణివి సత్కవి వగుటన్
దగుదువు మామన్ననకుఁ బొ
సఁగఁగ నందుగుల సూరసచివుని వెంగా.

క. రారమ్మనుచును మిక్కిలి
గారవమునఁ బిలిచి చెంత గద్దియపైన
న్నారూఢినిఁ గా నొసరిచి
తోరముగాఁ జేలములను దొడవుల నొసఁగెన్.

క. ఈవిధమున బహుమానముఁ
గావించి మదీయవంశకర్తలచర్యల్
భూవలయంబున వ్యాసవ
చో విరచిత లీల సర్వశుభకర మగుచున్.

క. పంచమ వేదంబని బుధు
లెంచం దగి భారతాఖ్య నెసఁగిన దానిన్
మించిన భక్తిని నాక
ర్ణించనె నామదికి నెపుడుఁ బ్రీతిజనించున్.

ఆ. తారలెన్నవచ్చు వారిధి నవలీల
దాటవచ్చు గిరుల మీటవచ్చు
భారతాగమోక్తిఁగి పలుకంగవచ్చునె
చిలువఱేనికైన నలువకైన

క. కన్నంతె బుధులచేతను
విన్నంతయు నంధ్రభాష వివరింపబడెన్
జెన్నలరఁగ భారత మా
నన్నయభట్టాది కవిజనంబులచేతన్.

క. ఆవిద్వత్కవు లాదిగ
భూవలయమునందుఁ గలుగు పూర్వకవీంద్రుల్
మావంశజు లగురాజుల
నెవిధమునఁ జెప్పినారో యితరకృతులలోన్.

క. నీవును సంక్షేపముగా
నావిధమును దెలిసి పేరు లాఘునచర్యల్
గావింపుము కృతిరూపము
గా వినవలె ననెడువాంఛ గలిగెనుమాకున్.

తే. అనిన నౌఁగాక యని సంస్కృతాంధ్రకవుల
వినుతులొనరించి తత్పాదవనరుహాంబు

డెందమున నిల్పి మృదువచోబృందగరిమ
రామరాజీయ మను కృతి రహిఁ రచింతు.

కవి అందుగుల సూరయకొడుకు వెంకయ యనుట తప్ప కవి వృత్తాంతమును దెలుపువిషయ మొకటియు నై పద్యములలో లేదు. ఈ గ్రంథమున నాశ్వాసవిభాగము లేదు. కర్ణ పద్యములుమాత్ర మిప్పుడు లభించుచున్నవి. స్వల్పసంఖ్యగలపద్యములు గ్రంథాంతమున నుండవలసినవి లభింపలేదు. వానితోపాటుగ కవి వృత్తాంతమును దెలుపు గద్యము కూడ లేకపోవుటచే కవినిగూర్చి యింకనేమియుఁ దెలియరాలేదు.

కృతిపతియైన కోదండరామరాజు, ఆర్వీటి బుక్కరాజు వంశములోనివాఁడు. ఆరవీటివారు చంద్రవంశపు రాజులు. ఆరవీడను పట్టణము రాజధానిగా రాజ్యమేలినవారిలో బుక్కరాజు ముఖ్యుఁడు. అందువలన నాతని నార్వీటి బుక్కరాజను నామమువచ్చిన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. అడుగ నిచ్చితి నిప్పు డంతియ లేదను
మాట దాఁ బుట్ట దేనాఁటనైన
గెలిచి వచ్చుటె కాని కలన నోటమియను
మాట దాఁ బుట్ట దేనాఁటనైన
మన వెంత చెప్పిన విని పరాకుగఁజేయు
మాట దాఁబుట్ట దేనాఁటనైన
మొదటన చనవిచ్చి తుద నది కేలగు
మాట దాఁబుట్ట దేనాఁటనైన
తే. ననుచు జనులెల్లఁ బొగడఁగ నారవీటి
పురము నేలుచుఁ దనకులమును దదాఖ్య
నలర వెలసెను సతత కృతాధ్వరుండు
రాజపరమేశ్వరుఁడు బుక్కరాజవిభుఁడు.

ఆరవీటిపురపాలకులలో ప్రథముఁడు బుక్కరాజానకు ముత్తాత యగు సోమదేవభూపతి నందవరమును బ్రాహ్మణులకిచ్చి యోగపాదు

కామహిమంబును బడసిన నందక్ష్మాపాలుఁడును గళ్యాణపురమును పాలించిన పశ్చిమ చాళుక్యుఁడగు బిజ్జలుఁడును నీయారవీటి బుక్కరాజు వంశమునందలి పూర్వులయినట్లు నరపతి విజయము చెప్పుచున్నది. వీరశైవుఁడగు బసవనారాధ్యునిచేఁ జంపింపఁబడిన బిజ్జలుఁడీబిజ్జలుఁడు కాఁడు. ఆబిజ్జలుఁడు కాలచుర్యుఁడు. ఈబిజ్జలుని మనమఁడు వీర హొమ్మాళిరాయఁడు. ఇతనికుమారుఁడు తాత పిన్నరాజు. ఇతని తనయుఁడు సోమదేవుఁడు. ఈసోమదేవుఁడే ఆరవీటి పురపాలకులలో మొదటివాఁడు. ఈతని పరాక్రమమును, జయించిన రాజులను, తెలుపు మూఁడు సీసపద్యములను గ్రంథ గౌరవభీతియున్నను చారిత్రాంశము లిమిడి యుండుటచే నిట నుదాహరించుచున్నాఁడను.

సీ. బలవంతుఁడగు నడబాలనాయకునిని
శూరుఁ డౌ గుజ్జులవీరినేని
రౌద్రరసోన్నద్రు రుద్రపాధిపు మహా
శౌర్యు గౌరారెడ్డి సాహసాంకు
గంగినాయకుని సంగ్రామరంగంబున
సింగంబు మత్తమతంగజములఁ
బట్టు కైవడిఁ బట్టి చట్టలెత్తించి కీ
ర్తను నసహాయుండు నై గంగినేని

కొంశప్రాగ్ద్వార సీమ నుద్దండవృత్తి
గంబములఁబాఁతి తోరణగాఁగఁగట్టి
వినుతికెక్కెను సకలభూజనులచేత
సోమదేవనృపాల సుత్రాముఁడెలమి

సీ. కదనరంగంబునఁ గరితురంగమ వీర
వితతితోఁ బలుమాఱు విఱుగఁదోలి
యమితోగ్రశౌర్యు మహామ్మదుఁబట్టి నీ
పేరుఁబెట్టెదను గుమారున కది

గాక భవత్పాద కమలంబు గదురంట
దండఁబుఁ బెట్టెదఁ దన్నుఁగాచి
విడుపుమన్నను గాచి విడిచి యర్థులకును
షష్టి శతంబు నశ్వముల వాని

తే. చేత నిప్పించి శరణన్నఁ బ్రీతిఁగాచు
బిరుదు తగు నీతనికె యని ధరణిపతులు
సన్నుతింపఁగ నాదిరాజన్య చర్యఁ
దేజరిలె సోమదేవ ధాత్రీవరుండు

సీ. దండెత్తిచని మహోద్దండ వృత్తిని । గంగినేనికొండవలీలగాను గట్టి
కందనవోలును గలువకోలును గోట । రాచూరునెటువంటిరాజు కైన
సాధింపరాని ముసలిమడుగు మఱి । యాతగిరినగఁ ముసాతానికోట
వరుసతో సాధించి పరమహర్షంబునఁ । దత్తన్మహాజనులఁ బ్రోచి

తే. ధరకుఁ దొడవని వినుతింపఁ దగినయట్టి
యారవీటి పురాధ్యక్షుఁడగుచుఁ దాత
పిన్న నృపసోమదేవుండె యెన్నఁదగిరి
నఖిల సత్కవిసురభూజ మనుచు నెపుడు.

ఈసోమదేవుని సుతుఁడు రాఘవరాజు. ఇతనిపుత్త్రుఁడు పిన్నశౌరి. ఈతనికుమారుఁడే పైనిచెప్పిన యార్వీటి బుక్కరాజు. ఈతనికి బల్లాదేవి, యబ్బలదేవి యను నిరువురు భార్యలు. ఈయిరువురి భార్యలయందును బుక్కరాజునకు సంతానముకలదు. వారందఱితోను మనకీచరిత్రమున సంబంధములేదు. రెండవభార్యయైన బల్లాదేవి యందుఁ గలిగిన రామరాజునకు లక్కమాంబయందు తిమ్మరాజు, కొండరాజు, శ్రీరంగరాజు అనుముగ్వురు కుమారులు కలిగిరి అందులో శ్రీరంగరాజు వంశములోనివాఁడు నరపతివిజయకృతికర్త. కావున నావంశ వృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను.


ఆరవీటి బుక్కరాజు = భార్య బల్లాదేవి
రామరాజు
తిమ్మరాజు (అవుకుదుర్గపరిపాలకుడు)
కొండరాజు (ఆదవేని దుర్గ పరిపాలకుడు)
శ్రీరంగరాజు కందనోలు (కర్నూలు పరిపాలకుడు)
కోనరాజు
తిమ్మరాజు
అళియ రామరాజు (కృష్ణదేవరాయలఅల్లుఁడు)
తిరుమలరాయలు (వసుచరిత్ర కృతిభర్త)
వెంకటాద్రిరాజు
శ్రీకృష్ణరాజు
పెద్దతిమ్మరాజు
కొండరాజు
చినతిమ్మరాజు
శ్రీరంగరాజు
రామరాజు
పెదవెంకటరాజు
చినవెంకటరాజు
తిరుమలరాజు
వెంకటరాజు
శ్రీరంగరాజు
భార్య పాంచారమ్మ
కోదండరామరాజు (ఇతఁడే నరపతివిజయ కృతిభర్త)
తిమ్మరాజు
వెంకటరాజు
శ్రీరంగరాజు
చినవెంకటరాజు
పెదవెంకటరాజు
చినవెంకటరాజు (శ్రీకృష్ణరాయవిజయ కృతిప్రేరకుఁడు)
కోదండరామరాజు
వెంకటరాజు

ఈవంశవృక్షము నరపతి విజయములోఁ జెప్పఁబడిన పద్యముల ననుసరించి వ్రాయఁబడినది. దీనినిబట్టి నరపతి విజయకృతికర్తయైన కోదండరామరాజు అళియరామరాజునకు మనుమని మనుమఁడై యున్నాఁడు. బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవుల చరిత్రములో "ఈకవి కృష్ణదేవరాయల యల్లుఁడైన రామరాజు తమ్ముఁడగు తిరుమలదేవరాయని మనుమనిమనుమఁడగు కోదండరామ రాజు కాలములో నుండి యాతనిపేర రామరాజీయమను నామాంతర మగలనరపతి విజయమను గ్రంథమును జేసెను." అని వ్రాసియున్నారు. అదిపొరపాటు, తిరుమలదేవరాయని మనుమనిమనుమడు నరపతివిజయమున పర్ణింపబడలేదు. నరపతివిజయము ననుసరించి తిరుమలరాయల వంశవృక్షము నీక్రింద నిచ్చుచున్నాఁడను. పైవంశవృక్షములోని అళియరామరాజు తమ్ముఁడే యీతిరుమలరాయలు.




బ్ర. శ్రీ. వీరేశలింగము పంతులుగారి వెంకయ్యకవి చారిత్రమున "ఈరామరాజు (అళియరామరాజు) తండ్రియైన శ్రీరంగరాజు కృష్ణదేవరాయల తండ్రియైన నృసింహరాజునకుఁ గర్ణాటకరాజ్యమును నిలుపుటలో సహాయుఁడుగా నుండినట్లు కానఁబడుచున్నది. ఈ శ్రీరంగ

రాజు యొక్క శౌర్యము నరపతివిజయములో నీక్రిందిపద్యమున వర్ణింపబడినది.

సీ. కడువిజాపురవర కామినీ గర్భముల్
భేదించు నెవ్వని భేరిరవము
దామిడిఁ బోయి నిజాముపట్టణముల
ధూళిగాఁజేయు నేదొరబలంబు
గోలకొండ వజీర్ల కోటుల కాయముల్
చించు నేరాజేంద్రు చేతికత్తి
సకల భూపాలకాస్థాన సన్నుతిఁగాంచి
వెలయు నేశూరుని విజయలక్ష్మి
యతఁడు కేవలనృపతియే యఘవిదూర
చర్యుఁ డాశ్రితరక్షావిచక్షణుండు
జీర్ణ కర్నాట భూపునర్జీవనుండు
రమ్యగుణశాలి శ్రీరంగరాయమౌళి.

అనివ్రాసియున్నారు. ఇదియును పొరపాటే. ఈపద్యమున వర్ణింపఁబడిన శ్రీ రంగరాజు తిరుమలరాయల రెండవకుమారుఁడైన శ్రీరంగరాజుగాని, అళియరామరాజు తండ్రియైన శ్రీరంగరాజు కాఁడు. ఈ శ్రీరంగరాయల ప్రతాపమును రామరాజభూషణుఁడుకూడ వసుచరిత్రమున నాలుపద్యములలో వర్ణించియున్నాఁడు. అళియరామరాజు మరణముతో శిథిలమైపోయిన కర్ణాట రాజ్యమును పునరుద్ధరించుటలోఁ దండ్రియైన తిరుమలరాయలకు సహాయ్యము చేయుచుఁ దనశౌర్యమును ప్రకటించినవాఁడగుటచే నీశ్రీరంగరాయలను వెంకయ్యకవి, నరపతివిజయమున "జీర్ణకర్ణాట భూపునర్జీవనుండు" అని కీర్తించియున్నాఁడు.

ఈరామరాజీయ ముద్రితప్రతిని, Gustav oppert Ph. D. Prof: of Sanskrit and Comparative Philology, Presidency College, Madras. అను పండితుఁడు 1893 వ సం. జనవరి 30 వ

తేదీని ఆంగ్లేయభాషలోఁ బీఠిక వ్రాసియున్నారు. ఆపీఠికలో నళియ రామరాజు యొక్కయు, తిరుమలరాయల వంశవృక్షముల నిచ్చియుఁ జారిత్రకాంశములలోఁ గొన్ని పొరపాటుగా వ్రాసియున్నారు. వాని నీక్రింద నిచ్చుచున్నాఁడను.

"The Ramarajiyamu was composed at the beginning of the second half of the 16th Century by Surayya's son Venkayya, the Court Poet of Kondanda Ramaraja. This prince, better known as Ramaraja and son-in-law, a great patron of Telugu litarature. I have else where shown that there existed two Krishnarajas who had as their sons-in-law princes of the name of Ramaraja.

The Ramarajiyam was written previously to the battle of Talikota in which Kodandaramaraja was defeated and killed by the united armies of the Mahammedan Chiefs of Bejapur, Golkonda Ahmadabad and Bedar.

The Kodanda Ramaraja the son-in-law of king Krishnaraja, fell, as has already been mentioned previously, in the battle of Talikota but Venkayya closes his Ramarajiyam previously to this event.''

పైవాక్యముల కాంధ్రీకరణమిది.

'కోదండరామరాజు యాస్థానకవియగు సూరయకొడుకు వెంకయ్య వలన బదునాఱవ శతాబ్దియం దుత్తరార్ధమున శ్రీరామరాజీయము రచింపఁబడినది. ఈ కోదండరామరాజు, ఆంధ్రభాషాపోషకుఁడని ఖ్యాతిగాంచిన యాతనికల్లుఁడై, రామరాజని వాడుక చెందినవాఁడు. రామరాజులు జామాతలు గాఁగలిగిన కృష్ణరాజు లిరువురున్నారని మఱియొకతావున నేనువ్రాసియున్నాఁడను. విజాపురము, గోలకొండ, అహమ్మదాబాదు, బీడారుదేశాధిపతులగు మహమ్మదీయ ప్రభువుల సమష్టిసైన్యములచే తళ్లికోట యుద్ధమున నీకోదండరామరాజోడింపఁబడి చంపఁబడక పూర్వమీరామరాజీయము వ్రాయఁబడినది,

నేనిదివరలోఁ జెప్పినట్లు సుప్రసిద్ధ ప్రభువగు కృష్ణదేవరాయల యల్లుఁడైన కోదండరామరాజు తళ్లికోట యుద్ధమున మరణించినాఁడు. కాని వెంకయ్యకవి యీతళ్లికోట యుద్ధమునకుఁ బూర్వమే తనరామ రాజీయమును బూర్తిచేసెను.'

కోదండరామరాజును, అళియరామరాజుగా భ్రమించుటవలన నీపొరబాటు కలిగినది. అళియరామరాజు శ్రీకృష్ణదేవరాయలయల్లుఁడు. ఈకృష్ణదేవరాయలే, మనుచరిత్రాది కావ్యములను గృతినొందియాంధ్ర భాషా పోషకుఁడని ప్రఖ్యాతిగాంచినవాఁడు. ఈ యళియరామరాజే క్రీ. శ. ౧౫౬౫ సంవత్సరమున తళ్లికోట యుద్ధమున మరణించినవాఁడు. అళియశబ్దము కన్నడభాషలోనిది. 'అల్లుఁడు' అనియాశబ్దమునకర్థము. శ్రీకృష్ణరాయల యల్లుఁడగుటచే నతనికల్లుఁడురామరాజని పేరువచ్చి నది. పైనవ్రాసిన వంశవృక్షమును జూచినచో, అళియరామరాజు నకుఁ గోదండరామరాజెంత దూరమున నుండెనో తెలియఁగలదు. కోదండరామరాజు మామగారిపేరుకూడ కృష్ణరాజే కాని యతఁడు పోచిరాజు కృష్ణరాజు. ఈవిషయ మీక్రిందిపద్యమువలన స్పష్టము కాఁగలదు.

శా. కారుణ్యాంబుధి పోచిరాట్కుల సుధాకంధిశుఁ డర్థార్థి మం
దారుండై విలసిల్లు కృష్ణమనుజాధ్యక్షేంద్రు సత్పుత్రి నాం
చారమ్మన్ వరియించె రామధరణీశస్వామి మోదంబునన్
క్షీరాంభోనిధి కన్య నచ్యుతుఁడు మున్ జేపట్టినట్లుం బలెన్.

ఈకృష్ణరా జాంధ్రభాషాపోషకుఁడు కాఁడు. రామరాజీయపీఠికా కారుఁడీవిషయమునఁ బొరపాటు పడెననుటకు సంశయములేదు.

అళియరామరాజు తళ్లికోట యుద్ధమున చనిపోవునాటి కఱువది యేండ్లవాడందుమేని యప్పటి కాతని మనుమఁడైన చినవెంకటరాజు పదేండ్లవాఁడని యూహింపవచ్చును. అతనిమనుమఁడైన కోదండరామ రాజు యుక్తవయసువచ్చి కృతినొందుకాలము క్రీ.శ. ౧౬౩౦ప్రాంతమై

యుండునని తలంప వలసియున్నది. కావున రామరాజీయ కృతిరచనా కాలము ౧౬౩౦ ప్రాంతమని నిర్ణయింతము,

అరవీటివారికి పదాతిసైన్య మధికముగా నుండుటచే నరపతులని పేరువచ్చినది. వారివిజయము తెలుపుగ్రంథము కావున దీనికి నరపతి విజయమని పేరు. ఇందు అళియరామరాజు కీర్తి ప్రతాపములు విశేషముగా వర్ణింపఁబడుట వలనను, కోదండరామరాజునకుఁ గృతియివ్వఁబడుటవలనను రామరాజీయమని నామాంతరము కలిగినది. కుమార ధూర్జటి కృత కృష్ణరాయ విజయమువలెఁ గాక నీగ్రంథము చారిత్రక దృష్టితో వ్రాయఁబడినది. ఇందలి విషయములు సత్యములును సత్యమునకు సమీపములునై యున్నవని తలంపవచ్చును. చరిత్రకారుల కిది యుపయోగకరమనియే చెప్పవచ్చును.

ఈగ్రంథమందలి కవిత్వము రసవంతమై చక్కఁగా నున్నది. సృష్టికర్త మొదలు పురాణోక్తరీతిగాఁ జాలవఱకు చంద్రవంశము వర్ణింపఁబడి కళ్యాణిబిజ్జలుఁడు మొదలు వరుసగా నారవీటివంశమును జెప్పియున్నాఁడు.

కవిత్వశైలి తెలియుట కిదివఱ కుదాహృతములైన పద్యములే చాలియున్నను, మఱి మూఁడు పద్యముల నుదాహరించు చున్నాఁడను.

చ. పవనతురంగ రత్నణకుఁ జాలి వసుంధరఁజుట్టి వచ్చుచో
బవరమొనర్చి భూవరులఁ బల్వుర గెల్చి హయంబుఁదెచ్చి వై
భవమునఁ దత్క్రతుత్రయముఁ బొందు సుతాగ్రజుఁ జేయఁజేసిదా
నవరిపుతోడ ఫల్గునుఁడొనర్చె ననారత సఖ్యమున్దగన్.

మ. అనిలోనార్వీటి తిర్మలాధిపు మహోగ్రసిక్త రిపుల్సమగ్ర పా
వనలీలన్ రవిదాఁటి దేవగణికా వాటిం జరిం చింద్రు ప
జ్జను గూర్చుండిన మోహిగంటిఁ గని లజ్జన్ రంభ కన్వాల్చె నా
ననమున్వంచె ఘృతాచి పూనిరి సునందా మేనకల్ మానమున్

చ. అసదృశబాహుశౌర్యమున నారయ సెందు నజాతశత్రుఁడై
వసుధ సిరంగరాజ జనవల్లభుఁడేలెడి యాదినంబులన్
బిసరుహ మిత్రమండల మభేద్యతనొంది చెలంగ రంభతో
నొసపరి బాగులం గదిసియుండఁగ గల్గెఁగుబేర సూతికిన్.

కడపమండలములోని కమలాపురము తాలూకా పొట్లదుర్తియందలి చెన్నకేశవరాయస్వామికిఁ గొన్ని పన్నులను దానమొసంగుచు. అందుగుల పర్వతరాజుకుమారుఁడు మల్లప్పయు, తిమ్మరాజు కుమారులు తిమ్మయ్య సూరయ్యలును, వ్రాయించిన శాసన మొకటికలదు. అదానము శా. శ. ౧౪౬౮ పరాభవ సంవత్సర శ్రావణ బ ౮ (కృష్ణాష్టమి) గురువారమునాఁడు నందేల తిమ్మరాజయ్య మఱియు నారపరాజయ్య యను వారి పుణ్యముకొఱకీయఁబడినది. దానకర్తలలోని సూరయ్య కవితండ్రియే మోయని తలంచితిని కాని కాలమనుసరిపడ లేదు. కవి యీకుటుంబములోని వాఁడైనచో కవితండ్రియైన సూరయ్య శాసనకర్త సూరయ్యకు మనుమఁడై యుండును. ఈసంబంధము సత్యమయ్యె నేని కవి కడపమండలములోనివాఁడై యుండునని తలంపవచ్చును.

# 262 చెంగల్వ వెంకటయ్య



ఇతఁడార్వేలనియోగి బ్రాహ్మణుఁడు; శ్రీవత్సగోత్రుఁడు; శ్రీకంఠమంత్రి పుత్రుఁడు; కాళయమంత్రికిని గంగమాంబకును పౌత్రుఁడు.

ఈతనికుమారుఁడైన కాళయకవి రాజగోపాలవిలాసమును రచించెను. అందుఁదనవంశమును వర్ణించుపట్టున "పార్వతీపరిణయ ప్రముఖ ప్రబంధ నిబంధ దురంధర ప్రౌఢఫణితి యైన వెంకటయ్య" యని చెప్పుటచే నీతఁడు కవి పార్వతీపరిణయాది ప్రబంధములను రచియించి నట్లు తెలియవచ్చినది. ఇప్పుడా కావ్యము లెచ్చటను గనుపట్టుటలేదు. ఈతని తనయుఁడైన కాళయకవి చారిత్రమును వేఱుగా వ్రాసి యున్నాఁడను. ఈకవినిగూర్చి యింతకంటె నేమియుఁ దెలియ రాలేదు. కాళయకవి కాలము క్రీ. శ. ౧౬౩౮ ప్రాంతమగుటచే నీతఁడు ౧౬౦౦ సంవత్సర ప్రాంతమునందుండెనని యూహింపఁదగి యున్నది.



## 263 ముద్దరాజు రామభద్రుఁడు

ఇతఁడు నందవరీక నియోగిబ్రాహ్మణుఁడు; గణపయామాత్య పుత్రుఁడు. పెదరామన, చినరామనలకుఁ దమ్ముఁడు. ఈకవిని రామన యని కూడ వ్రాయుచుందురు. అప్పకవి ముద్దరాజు రామనయనియే పేర్కొనియున్నాఁడు.

ఈక్రింది గద్యపద్యములవలన నీతని వృత్తాంతము కొంత తెలియవచ్చుచున్నది. ఇతఁడు కవిసంజీవని యను లక్షణగ్రంథమును రచియించెను. ఈ గ్రంథము ముద్రితమైనట్లు కాన్పింపదు. అసమగ్రమయిన ప్రతి యొకటి మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది. అందు నాల్గు తరంగములున్నవి. గ్రంథమెన్ని తరంగములో తెలియరాదు. ఇందు వ్యాకరణ విషయములును ఛందోవిషయములును గలవు. ఈతఁ డఖండయతి నంగీకరించినవాఁడు.

సీ. అందమా నీకేనుహాసుధానిధి నిశా
        ఘాటలాక్షణికతా కౌశలంబు
దొరయు నీకే కవిస్తోమస్తుతానేక
        నాటకాలంక్రియా పాటవంబు
తగు నీకె శాబ్దికస్తవనీయభాష్యకై
        యటముఖ్యశబ్ద విద్యానిరూఢి
చెల్లు నీకె రసజ్ఞ జేగీయమాన క
        విత్వవైశద్యతా విలసనంబు

గీ. నమచు బుధులెల్ల వినుతింప నలరు ముద్ద
రాజు గణపయ్య గర్భవారాశిపూర్ణ
చంద్ర పెదరామ పినరామ సచివమణుల
తమ్ముఁడను నేను రామచంద్రాఖ్యకవిని.

క. ఒనరించెద నన్నయ తి
క్కన యజ్వప్రముఖ నిఖిల కవికసూక్తి మణీ
ఖనియగు కవిసంజీ
వని యను లక్షణము సుకవివరులు నుతింపన్

గద్య:— ఇది శ్రీ మదనగోపాల కృపాకటాక్షసంప్రాప్త సారసారస్వత సంతతానంద నందవరకులాలంకార ముద్దరాజు గణపయామాత్య పుత్ర పెదరామ చినరామ సచివసోదర్య దైనందినౌదార్య చర్యాపరాజిత సముద్ర రామభద్ర ప్రణీతంబైన కవిజన సంజీవనియను లక్షణగ్రంథము''

ఈకవి గోత్రసూత్రము లేమియో తెలియలేదు. ఇతనినివాసము నెఱుంగరాలేదు. ఈతనిగ్రంథమునందు మనుచరిత్రము పాండురంగమాహాత్మ్యము, రాఘవపాండవీయము, యయాతిచరిత్రము మొదలగు పదునాఱవ శతాబ్దియందు రచితములైన గ్రంథములనుండి లక్ష్యము లుదాహరింపఁబడియున్నవి. కవిజనసంజీవని యందలి

తే. తాఱొంతులు నుఱ్ఱ్యాలయుఁ బఱ్ఱ్యాదయును దక్కఁ
గలుగ దెత్వంబు మధ్య యకారమునకుఁ
దుదిని గ్రియఁదక్క నెత్వంబు గదియ దాది
నత్వ మొందదు తెనుఁగున నబ్జనాభ

అను పద్యము నుదాహరించి కాకునూరి యప్పకవి

తే. ధరణినుఱ్ఱ్యాల పఱ్ఱ్యాద తాఱొంతులను
గల యకారంబులకు వక్రములకు నిజంబు
ముద్దరాజు రామన వానిమాఁటిని బద
మధ్యయాలని చెప్పె నిమ్మాట మిథ్య.

అనివ్రాసియున్నాఁడు. కావున శ్రీరామభద్రకవి హూణశకము ౧౫౮౦ - ౧౬౫౦ సంవత్సరముల మధ్య నున్నవాఁడనుట స్పష్టము. లక్షణమును నిర్వచించుపద్యములనుబట్టికవిత్వగుణమును నిర్ణయింపఁజాల

ము, కావున నాభాగమును విడచి కృత్యాదియందలి రెండుపద్యముల నీక్రింద నుదాహరించు చున్నాఁడను.

శా. శ్రీమించం దనకాంతి వేఁడుటకు లక్ష్మీనామ సౌదామనీ
దామోపాయన మాచరించి భుజమధ్య ప్రాంగణం బాచరిం
చే మేఘం బనఁగాఁ జెలంగు లలిత శ్రీవత్సముం బొల్చు రా
ధామోదాస్పదరూపధేయు మురళీ ధౌరేయుఁ గీర్తించెదన్.

మ. తళుకున్ వజ్రము బంగరుంగమునం దాపించి నన్మించు వీ
క లతాంతాయుధ సంగరాంతరములో గాఢాంకపాళీరతిన్
గోలకూలాయవు ముద్దుతేజిదోరతోఁ గూడ న్మిటారించు న
వ్వులుకుంజిల్కలకొల్కి నాదుమదిలో భావించి సేవించెదన్.

ఆంధ్రసాహిత్య పరిషత్కార్యాలయమున నీతనిగ్రంథముయొక్క వ్రాఁతప్రతి యున్నది. కాని యదియు నసమగ్రమైనదియే.

ఈ కవి పింగళిసూరనార్యకృత రాఘవపాండవీయమునకు వ్యాఖ్యవ్రాసియున్నట్లుతెలియుచున్నది. కానినాకా వ్యాఖ్యలభింపలేదు.

# 264 ముడియం వెంకటరమణకవి



ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు; ఋగ్శాఖీయుఁడు; శ్రీవత్స సగోత్రుఁడు; వెంకటపతికిని ఓబమ్మకును గుమారుఁడు; కసువ ప్రథానికిఁ బౌత్రుఁడు.

ఇతఁడు సంస్కృతమున రాధామాధవమను నాటకమును నాంధ్రమున గళాధరోపాఖ్యానమను పద్యకావ్యమును రచించిన ట్లీక్రిందిపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

క. చేసితి రాధామాధవ
మాసంస్కృతధాటి నాటకాగమనంబున్
వ్యాసక్తి నింక నాంధ్రము
చేసెద నొకకావ్య మతి విచిత్రకథాప్తిన్.

క. ఇది శ్రీదత్తాత్రేయా
ఖ్యాదితయఃథోచిత కళాధరో పాఖ్యానా
స్పద వేంకటరమణ కృతిన్
విదితం బఖిలంబు నొక్కవిష్కంభ మగున్.

శ్వేతద్వీపమున శ్రీ మహావిష్ణువు నేత్రమున నుదయించిన కళాధర కుమారుని చరిత మిందు వరితమయినది. ఇది దత్తాత్రేయున కంకితము. ఇదిచాలదుర్లభమైన కృతియనియు దీనియందునిరసనభావముఁ జూవరాని దనియుఁ గవి యీక్రింది పద్యములలోఁ జెప్పినాఁడు.

మ. తెలియంగూడ దిదేడబోలి యనుబుద్ధిన్ మత్ప్రబంధంబు పై
నలతం జెంది భ్రమ ప్రమాదములనైనన్ వేసరంబోకుఁ డీ
యలవోక న్ననునిట్లు (పూంచు) నలదత్తాత్రేయ నారాయణుం
డిల మీవంటి మహానుభావులకు దానీయర్థముం దెల్పెడిన్.

క. తత్తాదృశానసూయా
చిత్తా సారాత్మబాల్య చిన్మయునకున్

విత్తాసంధ్యేయునకున్
దత్తాత్రేయునకు సజ్జనాధ్యేయునకున్.

వ. అంకితంబుగా నేనార్చు … క నంకువగల యాకలాధరోపాఖ్యా
నోట్టంకన దుర్లభకృతికి కథాసంవిధానమది యెట్లన్నను
కవి తనవంశావళి నీక్రింది పద్యములలో నుడివియున్నాఁడు.

క. పాత్రుఁడ వేంకటపతికిం
బుత్రుఁడ గస్వప్రధాన పురుషాగ్రణికిం
బౌత్రుఁడ శ్రీవత్సాంక స
గోత్రుఁడ ఋక్శాఖికానుగుణ సూత్రుండన్.

క. తమ్మన కప్పన యనియెడు
తమ్ములుగల వెంకటేశు తల్లగు నారం
గమ్మకు సవతైతగు నో
బమ్మకుఁ దనయుండ దిమ్మ నాగ్రిమవుండన్.

క. సంకుచిత మోహమమతా
హంకారుఁడ ముడియ మగ్రహారాన్వయుఁడన్
వేంకటరమణాంకుఁడ ని
ష్పంకిల నందవరవంశ పరిగణితుండన్.

ఈకవికిఁ బొమ్మసాని తిమ్మానాయఁడు పోషకుఁడయిన ట్లీక్రింది పద్యములలోఁ జెప్పియున్నాఁడు.

శా. ఆత్మీయస్తుతి గర్హితం బనుచు వంశాఖ్యాయికా వర్ణనం
బాత్మన్ గోరుట లేదు గాని కృతరాజాస్థాను లైనట్టి వా
రాత్మీయుల్ నరదేవ సంఘటిత దుర్గాధీశతాదక్షుల
శ్యాత్మోక్తి ప్రతిభావరాకృత భుజంగాధ్యక్షులం దేనొగిన్.

మ. అతిలోకాయుత భోగభాగ్య మహిమాఢ్యం బైన సింహాసన
త్రితయంబందుఁ బ్రశస్తమౌ నరపతి శ్రీరాయసింహాసనం

బతి ధన్యాశ్రయశైకతాన మనమెచ్చ పెమ్మసాన్యన్వయం
బుధులం బైతగనుద్భవిల్లె మను తిమ్మాధీశుఁ డశ్రాంతమున్.

క. ఇట్టటు గెంటని దయ నే
పట్టున సన్మానభోగభాగ్యము గల చే
పట్టితినని కంకణముం
గట్టుక గణింపఁ బెంపు గాంచినవాఁడున్,

మ. ఇతికర్తవ్య యథామతిం బొగడనౌ నీరీతులెల్లన్ నర
స్తుతిగా నెన్నకుఁ డీ విప్రవరు లిచ్చో నిష్టదైవాంకిత
స్థితి కావ్యంబు లొనర్చినట్టి ముదముం జేకూర్పఁ బోషించువాఁ
డతఁ డౌటం గృతిహేతువౌ నితఁడన న్నూహాపోహఁ గీర్తిం
జెదన్.

నారన సూరన రచించిన యుదయనోదయ కృతిపతి ముడియము భాస్కరుఁడు. అతఁడు నందవరీకుఁడే. శ్రీవత్సగోత్రీయుఁడే. ఆతనికిని నీ వెంకటరమణకవికిని నెట్టిసంబంధమైన కలదో లేదో చెప్ప లేము. కాని వీరిరువురు నొకవంశములోనివారని చెప్పవచ్చును. ఆభాస్కరుని వంశవృత్తమును సూరనకవి చారిత్రమున నిచ్చియున్నాఁడను. భాస్కర మంత్రికిఁ బూర్వ మైదారు తరములందుఁ జూపఁబడినది. అందు వెంకటరమణకవిగాని, యాతని పితృపితామహులుగాని లేరు. ఆభాస్కరుని కాలము పదునాఱవ శతాబ్ది పూర్వార్ధము.

కవికాశ్రితుఁడైన పెమ్మసాని తిమ్మనాయని కాలమెఱుంగఁ గలిగితిమేని కవికాలము స్పష్టమగును. పెమ్మసాని తిమ్మనాయ నామధారులు ముప్వురున్నారు. అందుఁ గవికాశ్రయదాత యెతఁడో తెలిసికొనుట కాధారములు లేవు. పదునాఱవశతాబ్ది నాల్గవభాగమునను బదునేడవశతాబ్ది ప్రథమభాగమునను పెమ్మసాని తిమ్మనాయని శాసనములు కన్పట్టుచున్నవి*. అతఁడేయీకవి కాశ్రయదాతయని ప్రస్తుతమున

*A. R. 431 of 20 శక ౧౫౫౮; A. R. 436 of 20 శక ౧౫౩౭;
A. R. 677 of 17 శక ౧౫౭౬

నిర్ణయింతము. ఇందులకు భిన్నముగ నేదేనిసాక్ష్యము లభించినచో మార్చుకొనవచ్చును. కవికాలము ౧౫౭౦ — ౧౬౩౦ కావచ్చును.

ఈకవి కవిత్వము ప్రౌఢమై మనోహరముగానున్నది. కవిత్వశైలి తెలియుటకై కొన్నిపద్యముల నిందు క్రిందఁ బొందుపరచుచున్నాఁడను.

మ. అతినైల్యోశ్రథ్య పయోధరోపలలితంబై నిర్గళత్కంకణా
న్వితమై విక్లబమందరుద్ధపికవాగ్విన్యాసమై నూతనో
దిత మృద్గంధ ముఖానితాకులితమై దిక్సుందరీబృందమా
ప్రతిమ ప్రాంగణ సంగమస్ఫురణ గర్భాదానమూనె న్నెసఁగా.

మ. అనువొప్పన్మణి కార్ముకంబునఁ దటిజ్జ్యావల్లి సంధించి గ
ర్జనచే టాంకృతి సల్పి ఘోరశరధారాపంక్తిచేఁ గ్రమ్మి ప
ద్మినభీతిగా బరరాజహంసములు గంపింపగా విజృంభించునా
ఘనుపై దైవతపుష్పవర్షము లనంగా రాలె వర్షాశ్మముల్.

మ జలిఁబర్జన్యుఁడు దిగ్వధూమణులు మెచ్చంగా మబ్బుగమ్మెచ్చుపం
గతిచేఁ దీసిన వెండిసామ్ములవలాకల్ వోలె హేలాచమ
త్కృతి పూర్వగ్రహయాళ్ళుచాత కమిళత్స్తోత్రీటీపుటీ కోటరా
పతయాళ్ళు ప్రథమాంబుధారలెసఁగెగా బ్రాగ్వార్షికాహంబులఁ.

# 265 మల్లవరపు వాలేశ్వరుఁడు

ఇతఁడు శైవమతాభిమాని యగు పాకనాఁటి నియోగి బ్రాహ్మణుఁడు; గౌతమసగోత్రుఁడు; పోతరాజునకుఁబౌత్త్రుఁడు; పోలమంత్రికిఁ దనయుఁడు; ఇతని తనయునిపేరు సదాశివుఁడు.

ఈకవి భిల్లాణ చరిత్రము నైదాశ్వాసముల పద్యకావ్యమునుగా రచియించి మల్లవరపు నాగేశ్వరునకుఁ గృతి యిచ్చెను. ఇతఁడు తననుగూర్చి కృత్యాదియందిట్లు చెప్పుకొనియున్నాఁడు.

సీ. అనఁ బాడఁ జదువఁ జెప్పను నేర్పుసర్వజ్ఞ
భోజుండు మాతాత పోతరాజు
బహుపురాణజుండు బాంధవాశ్రితకల్ప
భూజంబు మాతండ్రి పోలమంత్రి
పరమశాంతుఁడు కృపాపాథోధి మ్మాపిన
తండ్రి విరూపాక్షదండనాథుఁ
డఖిలవిద్యానిధి యర్థార్థితతిఁ బ్రోచు
దాత మత్సుతుండు సదాశివుండు
నే వితర్కింప వరకవితా విశేష
వదనుఁడను పాకనాఁటింటివాఁడ శుద్ధ
శైవుఁడను గౌతమసగోత్ర సంభవుండ
నెంచఁదగు మల్లవరపు వాలేశ్వరుఁడను.

ఇతఁడు మల్లవర పురాధ్యక్షుఁడ నని గ్రంథాంతమందలి యీ క్రిందిగద్యములోఁ జెప్పియుండుటచేత నీతఁడాగ్రామమునకుఁగరణమని యూహింపఁ దగియున్నది.

గద్య:— ఇది శ్రీమదివ్వటూరి రామనారాధ్య గురుచరణ సరసీరుహ షట్పదాయమాన సరసకవితాచాతుర్య విద్యానుసంధాన పరమ మాహేశ్వరాచార పక్ష మల్లవరపురాధ్యక్ష గౌతమగోత్ర పవిత్ర పోల

యామాత్యపుత్ర సంతతానందవిధేయ వాలేశ్వరనామధేయ ప్రణీతంబైన భల్లాణచరిత్రం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

ఈ మల్లవరము కృష్ణామండలములోని గుడివాడతాలూకాలో నున్నది. ఈకవి తనగురువైన యివటూరి రామనారాధ్యు నీక్రిందిపద్యములో స్తుతించి యున్నాఁడు.

సీ. శరభసాళ్వంబు ప్రాసాదపంచాక్షరి
శ్రీమదఘోరంబు సిద్ధవిద్య
గ్రంథత్రయంబును గావ్యనాటకములు
బహుపురాణంబులు పల్లిపాద
ముపనిషత్తులు శాస్త్ర ముచితాగమంబు ల
నేకేతిహాసముల్ హృద్గతములు
వినయ వివేకముల్ వితరణగుణమును
దయయు శాంతంబు నిత్యవ్రతంబు
లవఁగ వెలసెను మిగులఁ బ్రఖ్యాతిగరిమ
నెంచ నారాధ్య మాత్రుఁడే యివ్వటూరి
రామనారాధ్యమౌళి సర్వజ్ఞమూర్తి
యట్టి సద్గురునాథున కంజలెత్తి.

ఈకవి, ఈగ్రంథమున కేవల భల్లాణునికథయే కాకుండ సందర్భవశమున శివప్రభావమును దెలుపు మఱికొన్ని కథలను రచించి యున్నాఁడు. ఇందలి కథావిశేషములను క్లుప్తముగా నీక్రిందివచనములో వివరించియున్నాఁడు.

వ. నమస్కార పూర్వకంబుగా నేసమర్పింపంబూనిన భల్లాణచరిత్రంబను మహాప్రబంధంబునందు విభూతిధారణ ఫలంబును బంచాక్షరీ మాహాత్మ్యంబును గాశీక్షేత్రప్రభావంబును గంగోత్పత్తియుఁ దారక బ్రహ్మనామ నిరూపణంబును రుద్రాక్ష మాహాత్మ్యంబును శివా

ర్పన పరిహారంబును హరనారద సంభాషణంబును సదాశివుండు గౌరితో బల్లహుజన్మంబును వివాహంబును రాజ్యపరిపాలనంబును నెఱింగించుటయు మిండజంగమవేషంబున భల్లాణునికడకీశ్వరుండేతెంచి వనితాసంగమం బభిలషించి వచ్చితివనుటయుఁ బణ్యాంగనా జనమార్గంబును ధనాభిరామంబును వీరజోడవ్వ చరిత్రంబును మహాదేవున కాన్పుపుండు తనసతిం దెచ్చి యిచ్చుటయు విరచింపంబడె"

ఈ కవి రెండువందల సంవత్సరములకుఁ బూర్వుఁడై యుండునని బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు కవులచరిత్రయందు వ్రాసియున్నారు. అది సత్యమయినచో నీతఁడు పదునేడవశతాబ్దియం దుత్తరార్ధమున నున్నవాఁడని చెప్పవచ్చును. భల్లాణ చరిత్రమును కూచిమంచి తిమ్మకవి ద్విపదగాను, పోచిరాజు వీరన్న పద్యకావ్యముగను, నడిమింటి రామభోగికవి దండకముగాను రచియించి యున్నారు.

ఈకవి ఇవటూరి రామనారాధ్యుని శిష్యుఁడనని చెప్పుకొని యున్నాఁడు. అజ్జరపు పేరయలింగముకూడ నీరామనారాధ్యుని శిష్యుఁడే. కావున నీకవియుఁ బేరయలింగమును సమకాలికులని విశ్వయింపవచ్చును. పేంయలింగకవి క్రీ. శ. 1580 – 1630 కాలమునం దుండెనని యాతనిచారిత్రమున వ్రాసియుంటిని. కావున నీతఁడు నాకాలమునం దుండెనని నిర్ణయింతము.

# మోచర్ల నన్నయకవి



ఇతఁడు ఆర్వేల నియోగి బ్రాహ్మణుఁడు; ఆపస్తంబసూత్రుఁడు భారద్వాజగోత్రుఁడు అన్నపార్య పౌత్రుఁడు; మాధవామాత్య పుత్త్రుఁడు; ఇతనితల్లి సింగమ్మ. పింగళి సీతమరాజీతనికి మాతామహుఁడు.

ఇతఁడు సాంబోపాఖ్యానమను నైదాశ్వాసముల ప్రబంధమును రచించి, మోచర్ల పురమునందలి బాలగోపాలస్వామి కంకితము చేసినాఁడు. గ్రంథాదియందలి కృతిపతి వర్ణన మిది.

శా. శ్రీమద్గోపనితంబినీ హృదయరాజీవాంతరోల్లాస లీ
లామోద భ్రమరాయమాణ మహితశ్లాఘ్య ప్రభావుండు సు
క్షేమానంద మెలర్ప దాసులఁ గటాక్షించుఁ గృపాలోలుఁడై
శ్రీమోచర్ల పురాధివాసుఁ డధిక శ్రీ నుల్లసిల్లన్దయన్.

ఇతఁడు తనగురువును, పూర్వకవులను, రెండు పద్యములలో నిట్లు స్తుతించియున్నాఁడు.

క. అస్మద్దేశికవరుల న
తస్మితు లగు చక్రవర్తి తిరుమలగురులన్
విస్మయ మొప్పఁగ నేను స
దాస్మరణ మొనర్చువాఁడఁ దాత్పర్యమునన్.

సీ. ధరనాంధ్రకవితా పితామహు నన్నయ
భట్టు సద్భక్తితోఁ బ్రణుతిచేసి
భారతసాగరోత్తారణ నిపుణుఁ ది
క్కన సోమయాజుల వినుతి చేసి
హరివంశ భారతాఖ్యానావధాన స
జ్జనను నెఱ్ఱాప్రెగ్గడను భజించి

ప్రేమమదీయ మాతామహవంశ
విహారుఁ బింగళి సూరనార్యుఁదలఁచి

గీ. వెలయ శ్రీనాథ భట్టారకులకుఁ బోత
రాజకవివర్యునకు మ్రొక్కి రామలింగ
పెద్దనార్యులఁ గొనియాడి బిరుదులైన
వర్తమాన కవీంద్రుల వరుసఁదలఁచి

పింగళి సూరనార్యుఁడు శ్రీనాథ పోతరాజుల కంటెఁ గాలముచేఁ దరువాతివాఁడైనను, తనమాతామహ కుటుంబములోని పూర్వుఁడగుటచేఁ గాఁబోలు సూరనార్యుని ముందుగాఁ జేర్కొని యున్నాఁడు. కవి తన పితామహుఁడైన యన్నపరాజు తుమ్మిడికి స్థలపతియైనట్లిక్రింది రెండుపద్యములలోఁ జెప్పియున్నాఁడు.

గీ. సరవి షట్సహస్ర శాఖాభిమాన ప్ర
యత్నమున నియోగిరత్నమనఁగ
సకలజనులు మెచ్చ జగతిపై నాగేంద్రు
నన్న పార్యుఁడొప్పె నాల్గుదిశల.

క. క్షేమాంకూరుఁడు తుమ్మిడిఁ
గామించెన్ రాజధానిగా స్థలపతియై
నేమములో వీరమ యను
భామన్వరించెఁ గాంచె భాగ్యయశంబుల్.

ఈకవి తనయగ్రజులైన సూరమంత్రిని వీరరాఘవుని యీక్రింది పద్యములో స్మరించియున్నాఁడు.

ఉ. శ్రీమహితుండు బంధుసరసీజ దినేశుఁడు సూరమంత్రి శ్రీ
రామకటాక్షవీక్షణ పరంపరయుక్తుఁడు వీరరాఘవుం
డామహితాత్ము లిద్దఱు మదగ్రజులై నను గారవింప నా
నామము పెద్ద లెన్నుదురు నన్నపరాజసుతున్ బ్రియంబునన్.

ఇతఁడు కాశీఖండమును ద్విపదగా రచియించి నరాంకితము చేసి న ట్లీక్రిందిపద్యము వలనఁ దెలియుచున్నది. కాని యాగ్రంథమిప్పటి వఱకును బయటపడలేదు. అది యెవరి కంకిత మీయఁబడియెనో యదియు నెఱుంగరాలేదు.

శా. కాశీఖండము వేడ్కతో ద్విపదగాఁ గావించి నేనిచ్చితిన్
వాసి న్మీఱ నరాంకితంబుగను వాసన్ లాభ మేమంచు ను
ల్లాసం బొప్పఁగ సర్వలక్షణములన్ లక్షించి సాంబోదయం
బా సర్వేశ్వరు కంకితంబుగను జేయంబూని యున్నట్టిచో౯.

శ్రీకృష్ణుని కుమారుఁడగు సాంబునకును దుర్యోధన మహారాజు తనయ యగు లక్షణకును జరిగిన పరిణయ వృత్తాంత మీ ప్రబంధమున మనోహరముగా వర్ణింపఁబడినది. ఈగ్రంథము ముద్రితము కాలేదు. అముద్రితప్రతి యొకటి మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగార మున నున్నది

ఈకవి పింగళి సూరనార్యుని పూర్వకవినిగా వర్ణించియుండుటచే క్రీ.శ. ౧౬౦౦వసంవత్సరమునకుఁ దరువాతివాఁడనియు, అప్పకవి సాంబో పాఖ్యానమునుండి లక్ష్యములను గైకొనియుండుటచే క్రీ. శ. ౧౬౬౦వ సంవత్సరమునకుఁ బూర్వుఁడనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

మోచర్ల - తుమ్మెడి గ్రామములు, నెల్లూరు మండలములోనివి. కావున నీకవిని నెల్లూరు మండల కవియనియుఁ బదునేడవ శతాబ్దిని బూర్వార్ధమందుండెననియు నిర్ణయింతము.



# 267 వణుకూరి గుర్వరాజు



ఇతఁడు శమంతకమణి చరిత్ర మనునొక పద్యకావ్యమును రచియించి నట్లందలి యీక్రింది పద్యము నామాఖండ విశ్రమమునకు లక్ష్యముగా అప్పకవీయమునం దుదాహృత మగుటచేఁ దెలియవచ్చినది

ఉ. కాయ వచో మనస్థ్సలన కల్పితదోషము లెల్లఁ బాయగా
నాయెదలోన నిత్యము సనాతన ధర్మముఁబూని యర్మిలిం
బాయక కొల్తు రామనరపాల నిరంతర సౌఖ్యదాయి సీ
తాయి సమస్తశోభన విధాయి మహాఫలసిద్ధి దాయిగన్.

అప్పకవీయము క్రీ. శ. 1656 లో రచితమైనది. కావున నీకవి యంతకుఁ బూర్వుఁడనుట స్పష్టము. వణుకూరు కృష్ణామండలమునం దున్నది. అగ్రామమునకు వణుకూరి వారేకరణములు! వారిపేర నేను త్తరము వ్రాయఁగా రెండువందల యేబదిసంవత్సరముల వంశవృక్షము తమయొద్దనున్నదనియు నందు గుర్వరాజు లేఁడనియుఁ గవులున్నట్లు గానరాదనియుఁ దమది భారద్వాజసగోత్రమనియు బ్రత్యుత్తరము వ్రాసిరి. వణుకూరి యను గృహనామముగలవారు కృష్ణామండలములో నియోగిశాఖలో మరికొన్ని తావులందున్నారనియు, తమకును, వారికిని గోత్రభేదము కలదనియు నందువ్రాసి యున్నారు. ఈకవిని గురించి ప్రస్తుత మింతతోఁ దృప్తిఁజెంది భావిపరిశోధనమున కవకాశ మీయవలసి యున్నది.

ఈ గ్రంథ మిప్పుడెచ్చటను గానవచ్చుటలేదు.

---

11—57]

# 268 రంగరాజు లింగయ్య



ఈకవి వృత్తాంత మేమియుఁ దెలియరాలేదు. ఇతఁడు ఏమయిన గ్రంథములను రచించెనేమో తెలియదు.

" రంగరాజు లింగయ తృతీయస్థానమునందు కకారముఁగూర్చి గూఢముగాఁ దిట్టిన చాటుధారపద్యము

క. రవికోటిధామమయమై
నవకాంచనయుతము నగుచు నానాటికొగిన్
భువిని శివాన్వితమగు నీ
భవనము జూపల్లిలింగ భవగుణసంగా!

ఈపద్యమువలన నీకవిపేరు మనకుఁ దెలిసినది. అప్పకవి క్రీ. శ. 1650 ప్రాంతమువాఁడు కావునఁ గవి యంతకుఁ బూర్వుఁడనుట నిశ్చయము.

ఈపద్యమందలి జూపల్లి లింగయ యెవరో తెలియదు. ఎలకూచి బాలసరస్వతి కృతచంద్రికాపరిణయ కృతిపతియైన జూపల్లి వెంకటాద్రి పూర్వులలోని నిద్దరును, వెంకటాద్రి పుత్రుఁడొక లింగనయుఁగలరు పైపద్యములోని లింగన యీముగ్వురిలో నెవ్వరైన నై యుండిరేని యీకవి బాలసరస్వతితో సమకాలికుఁడుగాని యంతకుఁ బూర్వుఁడు గాని యై యుండును. పై లింగనలతో సంబంధించిన బాలసరస్వతి పద్యముల నీక్రింద వ్రాయుచున్నాఁడను.

క. ఆరామచంద్రు నను జుఁడు
వారణశ్యబ్ధి మధ్యవ సుథాబుధచే
తోరంజన దానకళా
భూరి విశారదుఁడు లింగభూపతి యలరున్.

తే. శిష్టజనవర్గ కైరవసిత కరోప
మానలచ్ఛాంబికయు నసమానసుగుణ
రత్నయగు పెద్దమయుఁ గళత్రంబు లైరి
భావభవతుల్యుఁ డగు లింగభూవరునకు.

క. మీపుత్రులు సుచరిత్రులు
శ్రీపతి సన్నిభుఁడు నారసింహుఁడు తిమ్మ
క్ష్మాపాలుఁడు లింగనయుఁ బ్ర
తాపఘనుఁడు వెంకటాద్రి తనపదురు సిరిఁగా.



## 269 కట్టా వరదరాజు



ఇతఁడు పరమ భాగవతచరిత్రమను నేనిమిదాశ్వాసముల పద్య కావ్యమును, శ్రీరంగ మాహాత్మ్యమను మఱియొక పద్యకావ్యమును, శ్రీమద్రామాయణ యుద్ధకాండలును ద్విపదకావ్యముగను రచియించి, శ్రీవెంకటేశ్వరున కంకితము చేసెను. ఇతఁడుసూర్యవంశ క్షత్రియుండనియుఁ దనవంశమునకు మూలపురుషుఁడైన కరికాలచోళుఁడు కావేరీనదికానకట్ట కట్టించుటచేఁ నావంశీయులకు "కట్ట" గృహనామమయ్యెననియు, నావంశమున నే బిజ్జలుడుదయించెననియుఁ దనగ్రంథములలోఁ జెప్పుకొనియున్నాడు.

ఇతఁడు రచించిన గ్రంథములలో శ్రీరంగ మాహాత్మ్య మొక్కటి మాత్రము ముద్రితమైనది. తక్కిన గ్రంథముల తాళపత్ర ప్రతులు తంజావూరు లిఖిత పుస్తక భాండాగారమునం దున్నవి. పరమ భాగవత చరిత్రమున రుక్మాంగదుఁడు, పుండరీకుఁడు మొదలుగాఁగల భాగవతుల చరిత్రములు వర్ణింపఁబడినవి. ఈ కవివంశావళిని వర్ణించుచు రామాయణ కృత్యాదియందు జెప్పిన ద్విపదల నీక్రింద నొందుపఱచుచున్నాఁడను.

శ్రీకరుఁడై ధరిత్రీ చక్రమేలె
నాకల్ప విఖ్యాతుఁడగు చోళవిభుఁడు
ఆకరి కాళచోళాధిపుకీర్తి
* * *
అతఁడు కావేరికల్లన కట్టగట్ట
నతిశయించెను దదీయాన్వాయమున
బుట్టి వరవి పంశభూభుజావళికి
కట్టన్వయా లనంగ కలిత తేజమున
అందులోఁ దెలుఁగు బిజ్జావనీ విభుఁడు
కుందేందు మందార గురుకీర్తిశాలి
వార్తగా హత్తు ముప్వర గండబిరుదు
కర్తహన్నిబ్బర గండవిక్రముఁడు
వెండికి గండండు వీరాగ్రయాయి
వాండికి గండండ వార్యదోర్బలుఁడు
లీల-బారామండలి కరగండ
పాళీకతాటకీ నారాయణుండు
దళితారి నవలక్షదళ విభాళాంక
కలితుండు మీసరగండ సాహసుఁడు
కీర్తివంతుఁడు పాతకీపుత్రబిరుద
కర్తబిజ్జలు మహీకాంతుండు వెలసె

ఆసంతతిని బుట్టె నహితగజేంద్ర
కేసరితాతన కేసరియగుచు
కొట్టి చంగఁగదోలి కుటిలారివరుల
మట్టెఱుంగని దానమహిమచే మించె
నిట్టెఱుంగమటంచు నెల్లరుఁబొగడ
కట్టరంగక్షమాకాంత శేఖరుఁడు
ఆరాజ దేవేంద్రు నాత్మజుండయ్యె
పోరాజ భామినీ పోరియేశుండు
పరవధూద్రవ్య చాపల్యదూరుండు
హరిదాసరాజైన హరిదాసరాజు
అంగనాభూషణంబగు పోచిరాజు
శింగరిరాజవ్య శేఖరుసుతను
బాళిమై కృష్ణమాంబను వరియించె
నాతేమ తోఁబుట్టువగు నోబమాంబ
ఆర్ధి శ్రీరంగరాయలు వాల్గు పూరు
పార్ధములో గలుగ కల్యాణమైమించె
ఆయశోనిధి సుతుఁడై రామదేవ
రాయలుమారట రాముఁడై వెలసె
హరిదాసరాజు కృష్ణాంబయందులను
హరిసుదర్శనమూర్తి యగురామరాజు
రాజ భగీరథు రవితేజువరద
రాజును నిను దాతరాయనింగాంచె
రచియింపుమీవు శ్రీరామాయణంబు.

ఈకవి తండ్రి రామరాజు; తాత హరిదాసురాజు; ఈతనిభార్య కృష్ణాంబ. ఈహరిదాసు రాజును, శ్రీరంగరాయలును తోడియల్లుండ్రు; పోచిరాజు సింగరాజున కల్లురు. శ్రీరంగరాయలభార్య ఓబమాంబ; ఇతనికుమారుఁడు రామదేవరాయలు. ఈశ్రీరంగరాయలు, ఆర్వీటి

బుక్కరాజు వంశములోనివాఁడు. వసుచరిత్రి కృతినందిన తిరుమల రాయల మూఁడవకుమారుఁడైన వీరవెంకటపతిరాయల కుమారుఁడు. ఇతనిని రెండవ శ్రీరంగరాయలందురు. ఇతఁడు క్రీ. శ. ౧౬౧౪ వ సంవత్సరములోను ఇతని కుమారుఁడైన రామరాయలు క్రీ. శ. ౧౬౩౦ మొదలు ౧౬౩౩ వ సంవత్సరమువఱకును చంద్రగిరి రాజధానిగా విజయనగర రాజ్యమును బరిపాలించినవారు.

ఈ కవికి యతిరాజయోగి గురువైన ట్లీక్రింది ద్విపదలలోఁ జెప్పియున్నాఁడు. కవి తాను రచించిన రామాయణ ద్విపద కావ్యము యొక్క కవిత్వ రీతినిగూర్చి యీక్రింది ద్విపదలను రచియించెను.

రతిరాజు గురు కృపారాజితు విజిత
రతిరాజు యతిరాజరాజదాకారు
యతిరాజుయోగి మదాచార్యు చరణ
శతపత్రములు సహచరములౌ గాత
*            *            *

అట్టి యాదిమ కావ్యమందమై తేట
పుట్టంగ నవరసంబులు పిచ్చిలంగ
జల్లిమాటలు నవశబ్దముల్ జజ్జ
టల్లికల్ ప్రావలందదుకు బల్కులును
పునరుక్తములు వట్టి పూదెలు కాకుఁ
దెనుఁగు కీచలును సందిగ్ధముల్ ప్రోలు
మాటికల్ కటువులే మరుపులు కొసరు
లాలంబములు వెత్తియతకడంబులును
ఛాయలెత్తుట లబ్ధచౌర్యముల్ పెట్టుఁ
జాయలు లేక లక్షణ సమ్మతముగ
నందమై సుకవులౌ రాయన చెవుల
విందుగా కపురంబు వెదఁజల్లినట్లు
ధ్వనులు వ్యంగ్యములు వింతలు వాసనలును
మినుకుల జిగిబిగి తొరవడుల్ జాతి

వార్తలు నుపమలు వర్ణనాంశములు
మూర్తి మద్వాక్యముల ముద్దులుచూప
నొకమాటకన్న వేఱొకమాట వింత
యొకపాదమునకన్న నొకపాద మొరపు
నొకదళంబున కన్న నొకదళంబంద
మొకయుత్తరమును మించ నొకయుత్తరంబు
వెలయంగ ద్విపదగావింప చిత్తమునఁ
దలఁచియే నొక శుభోత్కట దినంబునను

ఈక్రింది ద్విపదలవలన, శ్రీవెంకటేశ్వరుఁడు కలలోఁగన్పడి యీకృతిని దనకంకితము సేయుమని చెప్పినట్లును, ఈతని యితర రచనములింతకుఁబూర్వమే రచియింపఁబడినట్లును దెలియుచున్నది.

సుఖనిద్రితుఁడనైనచోఁ బూర్వపుణ్య
సఖమైన యొక సుఖస్వప్నంబు వందు
కలకలనవ్వు చక్కని సెమ్మొగంబు
యొక దివ్యమూర్తి నాయెద్దఁజూపట్టె
నినుమెచ్చివచ్చితి నీతలంపెఱిఁగి
ననుఁ దిరువెంగళనాథుఁగాఁ దెలియు
పద్యకావ్యముచేసి పరమభాగవత
హృద్యచరిత్రంబు నిచ్చితిమాకు
మంగళప్రదము సామ్యముశతాధ్యాయి
రంగమాహాత్మ్యంబు రచియించినావు
మాపేరనిపుడు రామాయణద్విపద
యేపుమీఱంగ రచియింపు మింపలర
ద్విపద కావింపుము తేట తెల్లముగ
నిపుణత శ్రీరాముని కథాక్రమంబు
వాలాయమిది యథా వాల్మీకముగను.

బ్రహ్మశ్రీ మానవిల్లి రామకృష్ణకవిగారు, ఈకవితండ్రియైన హరిదాసరాజును, అళియరామరాజు తండ్రియైన శ్రీరంగరాయలును తోడియల్లుండ్రయినట్లు వ్రాసియున్నారు. అళియరామరాజుతండ్రి కూడా శ్రీరంగరాయలే యగుటచే కవిగారట్లు భ్రమపడినట్లు తోచుచున్నది. ఈ శ్రీరంగరాయల భార్య ఓబమాంబ కాదు- తిరుమలాంబ. ఈ శ్రీరంగరాయలు పోచిరాజు సింగరాజున కల్లుండుకాండు.

శ్రీరామకృష్ణకవిగారు శ్రీరంగరాయల విషయములో వ్రాసినది సరికాదని నిర్ణయించినంత మాత్రమున మనకార్యము పూర్తికాలేదు. వరదరాజకవివ్రాసిన శ్రీరంగరాయలెవరో వారికిఁగల బాంధవ్యమెట్టిదో నిర్ణయింపవలసియున్నది. ఆరవీటి వంశములో శ్రీరంగరాయ నామధారులు పెక్కురున్నారు. ఇందువరదరాజుపేర్కొన్న శ్రీరంగరాయలను గనుగొనుట చాలకష్టము ఇతనిని దెలిసికొనుటకై వరదరాజు మనకు రెండుగురుతులనిచ్చియున్నాఁడు. మొదటిది పోచిరాజు సింగభూపతి తనయయైన యోబమ్మకుభర్త. రెండవది రామదేవరాయలకుఁ దండ్రి.

అళియరామరాయలకుఁ దండ్రియైన శ్రీరంగరాయల భార్య తిరుమలాంబ కాని యోబమ్మకాదు. అందుగుల వెంకయ్య కృతి రామరాజీయము నందలి యీక్రింది పద్యమువలన నీవిషయము తెలియుచున్నది.

తే. ప్రకట సాత్త్వికుఁడైన శ్రీరంగరాజు
లక్ష్మికెనయైన లక్షణలక్ష్మి కాంగి
యైన తిమ్మాంబ నుద్వాహమై చెలంగె
నధికతర భోగభాగ్యంబు లతిశయిల్ల - 227

వసుచరిత్ర కృతిపతి యైన తిరుమలరాయలకు శ్రీరంగరాయ లను కుమారుఁడు కలఁడు. కాని యాతనిభార్య తిమ్మమాంబయని రామరాజీయము నందలి యీక్రిందిపద్యములో నున్నది.

తే. రాజగుణహారి శ్రీరంగరాయశౌరి
ప్రీతితోఁ దిమ్మమాంబను బెండ్లియయ్యె
నావధూవరు లఖిలసౌఖ్యముల
వెలసిరవని ధరాత్మజేశులను బోలి... 245

కావున మనకుఁ గావలసిన దీశ్రీరంగరాయలు కాఁడు.

అళియరామరాయలకు లక్ష్మమ్మయను భార్యయందుఁ గలిగిన శ్రీరంగరాయలను కుమారుడుండెను. ఆతనిభార్య పోచిరాజువారి యాడుబడుచే కాని యోబమ్మ కాదు.

చ. కడిమి కిరీటిమాడ్కి నతిఁగన్న సింగమహీవిభుండు మే
ల్నడకల పోచిరాజు రఘునాథ నృపాలుని కూర్మిపుత్రికన్
బుడమిపడంతి దాల్మిననఁ బోలిన లక్ష్మమను న్వరించె నిం
పడరఁగ రాఘవుండు జనకాత్మజఁ గైకొనుచంద మేర్పడన్. 322

లక్ష్మమ్మభర్తయైన యాశ్రీరంగరాయలతోను మనకుబనిలేదు.

అళియరామరాయల పౌత్రుఁడైన చినవెంకటపతిరాయలకు శ్రీరంగరాయలను కుమారుఁడున్నాఁడు. ఇతఁడు వెంకటాద్రికి మనుమఁడైన గోపాలరాయునికి దత్తుఁడు. ఇతనికి ముప్వురు భార్యలు. ఇతనిని మూఁడవ శ్రీరంగరాయలని కొందఱు చరిత్రకారులందురు.

క. శ్రీరంగరాయనికి గో
బ్బూరికులుం డైన వెంగళోర్వీశు తనూ
జారత్నముఁ బాపమ్మ న
పారవిభవ మందఁగా వివాహంబయ్యెన్. 362

సీ. మఱి పోచిరాట్కుల మండనుండగు వెంగ
భూనాయకాగ్రణి పుత్రియైన
రాఘువమ్మను బోచిరాజు వెంకటరాజు
తనయు వెంగమ్మ నుద్వాహమయ్యె

నాసతీత్రయమును నను రక్తితో సర్వ
ధర్మసహాయమై తగభజింప 36

ఈ మువ్వురిలోను యోబమ్మ లేదు. కావున నీ శ్రీరంగరాయలతో మన కేమిపని?

వసుచరిత్ర కృతిపతి యగు తిరుమలరాయల మూఁడవకుమారుఁడు రామరాయలు. ఇతనిభార్య నరసింగమ్మ. వీరిరువురకు శ్రీరంగరాయ లను కుమారుఁడుండెను. ఇతనికి చిక్కరాయ లను నామాంతరము కలదు. అతనిని రామరాజీయమునం దిట్లు వర్ణించినాఁడు.

తే. యూర! యపహాయశూరుఁడు నరికృతాంతుఁ
డంగనాజనమాన్య లతాంతశరుఁడు
ధర్మతత్పరుఁడగుచు భూధవుల వినుతిఁ
గనియె శ్రీరంగ చికరాయ మనుజ విభుఁడు.

తే. రాజకులభూషణుఁడు చిక్కరాయభూప
శౌరి వరియించె జిల్లేళ్ళ నారసింహ
రాజదేవేంద్రపుత్రి యంభోజనేత్ర
యైన యోబమ్మదేవి నాయతివవలన. 254

తే. ఆవసుమతీశునకు రామదేవరాయ
లుదయమైనను రిపురాజు లొదిగి శైల
గుహలఁ జేరిరి రవి దోఁప ఘూకచయము
లతిరయంబున గొందుల నణఁగు పగిది. 255

వరదరాజకవి యిచ్చిన రెండుగుఱుతులును నీ శ్రీరంగరాయలకు సరిపోయినవి. ఇతని భార్య ఓబమ్మ. ఇతని కుమారుఁడు రామదేవరాయలు. కావున నీ శ్రీరంగరాయలే వరదరాజుకవి యిచ్చిన శ్రీరంగరాయలని నిర్ణయింతము. కాని యిందులకొక వ్యత్యాసము కన్పట్టుచున్నది. వరదరాజు కవి చెప్పిన శ్రీరంగరాయల భార్య యోబమ్మ పోచిరాజు సింగరాజుకుమార్తె. రామరాజీయము ననుసరించి, యీయోబమ్మ జిల్లేళ్ళ నరసింహరాజు కుమార్తె; ఈభేదము

ను సమన్వయించువఱకు శ్రీరంగరాయ నిర్ణయము నిర్బాధకము కాఁజాలదు.

శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య M.A. గారు కట్టా వరదరాజుకవిని గురించి భారతి పత్రికలో నొకవ్యాసమును * వ్రాసి యందీభేదమునుగూర్చి, 'దీనింజూడఁగాజిల్లెల్లవారికే పోచిరాజువారనినామాంతరముకూడ నుండినట్లుతోఁచుచున్నది." అనివ్రాసి యీభేదమును సమన్వయించిరి. ఈగృహనామమును వ్రాయుటలో వరదరాజు గాని, వెంకయ్యకవిగాని పొరబడిరేమో అని నాయుద్దేశము. వరదరాజుకవి తనతల్లి పుట్టినింటివారి యింటిపేరు వ్రాయుటలో పొరబాటుపడి యుండఁడనియు వెంకయ్యయే పొరబడియుండు ననియుఁ దలఁచుచున్నాడను. శ్రీ వెంకటరమణయ్య పంతులుగారు కట్టా హరిదాసురాజు శాసనము నుదాహరించుచు దానినిబట్టి వరదరాజు కవి కాలము పదునేడవశతాబ్ది మధ్యమైయుండునని నిర్ణయించినారు. ఈ కవిరచించిన ద్విపదరామాయణ మిప్పుడు ముద్రితమగుచున్నది. దానికిఁ బీఠికవ్రాసిన శ్రీనిడదవోలు వెంకటరావు పంతులు M.A. గారు వరదరాజుకవి కాలము క్రీ. శ. 1630 ప్రాంతమని పీఠికలో వ్రాసియున్నారు. ఈ రెండింటికిని విశేషభేదము లేదు. ఇంతకంటె సునిశ్చితముగా కాలనిర్ణయము చేయుటకాధారములు లభింపలేదు. కావున నీకవికాలము పదునేడవ శతాబ్ది పూర్వార్ధమని నిర్ణయింతము.

ఈకవి రచించిన శ్రీరంగమాహాత్మ్యము సంస్కృతములో గరుడపురాణమున నూఱధ్యాయములు గలదిగా నున్నది. శ్రీరంగమాహాత్మ్యము బ్రహ్మాండపురాణమునఁగూడ నున్నది. అది తొమ్మిదధ్యాయములు గలది. శ్రీరంగమాహాత్మ్యమును పదుగురు కవులు రచించియుండిరి. ఈవరదరాజును బైరవకవియు గరుడపురాణము నుండి కథను గైకొని రచియించియుండిరి. ఈకవి తన గ్రంథమును శ్రీ వెంకటేశ్వరున కంకితము చేసెను. ఆస్వామి కలలోఁగనుపడి

---

* 1 భారతి - పార్థివ - మాఘము - పుట 114

గీ. "మున్ను నాపేర నంకితంబుగ నొనర్చి
తవని( బొగడొంద( బరమభాగవతచరిత
మిపుడొనర్చు ప్రబంధమ్ము నిమ్ము నాకు
నంకితంబుగ నే వేంకటాధిపతిని.

క. నీకవిత విన్న వీనుల
శాకడ( బెరకవుల కృతుల నరుచిజనించుజ్
మాకు మఱిమఱియు యున్న
చ్ఛ్రీకర వాక్యంబులందు( జిత్తము వొడమెజ్.

క. కృతి సేయుము గారుడసం
హిత హితమది మాకు గారుడేలాదరమూ
గిర నిజధామంబగుటం
బ్రితప్రత్తి విశేషమగుచు( బాటిలునందుజ్.

ఉ. చేయరె తొల్లి సత్కవు లశేషపురాణములుం దెనుంగులో
నీయితిహాసమెందు రచియింపమి తావకపుణ్య మింతె యా
మ్నాయ చతుష్కసారము సనాతనగారుడ సంహితాశతా
ధ్యాయి తెనుంగుసేయ నొకడర్హు(డె నే(టికవీంద్రకోటిలోజ్"

అని యానతిచ్చెన(ట!

ఈకవి నివాసము నిర్దిష్టముగా తెలియలేదు. దత్తమండలముల వా(డో, మైసూరురాష్ట్ర-నివాసు(డో అయియుండును. ఇత(డు పదునేడవ శతాబ్దియందు పూర్వార్ధమున నున్నవా(డని నిశ్చయముగా( జెప్పవచ్చును. ఈత(డు వైష్ణవమతాభిమాని. శ్రీరంగమాహాత్మ్య మదివఱకెవ్వరును రచియించియుండలేదని పైపద్యములో వ్రాసికొనియున్నా(డు. కాని భైరవకవి యితనికంటె ముందువా(డు. ఆత(డు శ్రీరంగ మాహాత్మ్యమును రచించిన ట్లిత(డెఱుంగక యుండవచ్చును. కవిత్వశైలి తెలియుటకై శ్రీరంగమాహాత్మ్యము నందలి కొన్ని పద్యముల నిట నుదాహరించు చున్నా(డను.

క. విత్తు మొదలు చెఱచినగతి । నుత్తమధర్మమున శ్రీశు నుల్లమునందుం
హత్తించి కర్మఫల మతఁ । డెత్తుకుచనఁ దారు ముక్తి కేగుదు రధిపా

మ. ధరణీభారము మాన్ప దాశరథియై తాఁబుట్టి కైకేయి యా
భరతుం బట్టముగట్ట వేఁడువరమున్ బాటించి సౌమిత్రియుం
ధరణీజాతయు వెంటరా భయదకాంతారంబుల న్మౌనులం
బరిపాలించి ఖరాదిదైత్యుల ననిం మర్దించి శౌర్యోన్నతుల్.

ఉ. ఇమ్మనికిన్కచేత నొకయించుకఁ గన్నులువిచ్చిచూడ లే
దమ్మక చెల్ల యింద్రపలు కొందలమున్నది యాతఁడల్కచే
హుమ్మని శాపమిచ్చిన బయోజభవుండు మరల్పఁజాలు నే
యిమ్మెయి మాని రండనుచు నేగిరి వచ్చినత్రోవ నందఱుం.

శా. కావేరీతటముల్ నివాసములుగాఁ గాలంబు పోద్రోయుచున్
దేవారాధ్యుని రంగనాయకుని భక్తింగొల్చుచుం దారు లే
త్రోవంబోయినఁ బోవనిమ్మనుచు నెందున్ ఖేదముల్ మానియా
ప్రోవన్ దన్మహి గాచు భూతగణముల్ భూరిప్రభావంబునన్.

గీ. అనిన నట్లనె యగు సందియంబు లేదు
నను విభీషణుఁడిచట నేనాఁడు నిలిపె
నాఁడు యిచ్చోటికై మది నాటియునికి
నతని వేడుక మనవిగా నడుగుకొంటి ౫ ఆ

చ. పడగలు వేయు గల్గనునుపానుపుపైఁ బవళించి పద్మపై
నడుగులు నిల్పి యొక్కకర మల్లన సాచి కరంబొకండు పెం
పడర దలాడగా నునిచి యబ్జవిలాసవిలోకనంబులన్
పొడము దయారసస్ఫురణ బోల్చిన రంగనివాసు నీశ్వరున్. ౬ ఆ

గీ. బలుసుకూరను ముళ్ళేరువగిది నీవు
రాష్ట్రకంటకశోధనక్రమము వలన
నెచ్చరిక మానకున్నారె హితులు నహితు
లిట్టివారని క్రియలందు నెఱిఁగివాపె

# 270 చెన్నమరాజు చెన్నమరాజు



ఈతఁడు; నందవరీక నియోగి బ్రాహ్మణుడు; ఆత్రేయ సగోత్రుఁడు శేషామాత్య సర్వాంబలకుఁ బుత్త్రుఁడు; చెన్నమరాజు బాలశాంబలకుఁ బౌత్రుఁడు.

ఈకవి చారుచంద్రోదయ మను నైదాశ్వాసముల శృంగార ప్రబంధమును రచియించి తాఁడిపత్రియందు దానునెలకొల్పిన శ్రీగోపాలకృష్ణున కంకితముచేసెను. ఈతఁడు తనగ్రంథమున నందవరీక బ్రాహ్మణుల నీక్రింది సీసపద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. వరమొసంగిరి యోగవాగాలు పంపుసే
యఁగ నందునకుఁ గాశియందు నెలవి
మోటరావిచిగుళ్లు మొలిపించి రత్యద్భు
తంబుగ యంత్రాక్షతంబు లునిచి
చౌడీశ్వరమహాశక్తి వేఁదోడితెచ్చి
సాక్షిఁబల్కించి రాశ్చర్య మెసగ
నలనంద విభునిచే నగ్రహారముఁ గాంచి
రాచంద్ర తారార్కమై రహింపఁ
దత్పురావాసుఁడగు జనార్దమ కటాక్ష
మహిమఁగూర్చిరి సత్కీర్తు లహరహంబు
ధరణి సామాన్యులే నందవరపురాఢ్య
విప్రవరులద్భుత మహాకవిప్రవరులు.

కవికాలమును నిర్ణయించుట కగత్యమగుటచే నీకవి వంశవృక్షము నీక్రిందనిచ్చుచున్నాఁడము.




ఈకవి పూర్వులు మంత్రులై దండనాయకులై దాతలై యశము నార్జించి యున్నవారు. పూర్వ మీవంశము వారి గృహనామము "అన్మలచింతల" వారైనట్లును, నందుఁ జెన్నమరాజను నాతఁడు సుప్రసిద్ధుఁడౌటచే నాతనినిబట్టి వారియింటిపేరు చెన్నమరాజువారని మారి నట్లును కవి యీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

ఉ. ఆయనవద్యవంశభవులందుఁ బ్రసిద్ధివహించి మించె నా
త్రేయ పవిత్రగోత్రుఁడు సుధీనిధి యన్మల చింతలాన్వయ
శ్రీయుతుఁడర్థికల్పకము చెన్నమరాజు గుణాభిరాముఁడై

పై వంశవృక్షములోని మూలపురుషుఁడైన మొదటి చెన్నమరాజును బట్టియే గృహనామమేర్పడియుండునని తలంపవచ్చును. ఈ చెన్నమ

రాజునకుఁ బౌత్రుఁడును గొండయ్యకు ద్వితీయపుత్రుఁడు నైన తమ్మన మంత్రిని గవి యీక్రింది పద్యములో వర్ణించియున్నాఁడు.

సీ. శ్రీరంగరాయ ధాత్రీతలాధ్యక్షు ద
క్షిణభుజాదండమై చెలఁగినాఁడు
కరమొప్పనతనిచే గజవాహనాందోళి
కాసితచ్ఛత్రము ల్గాంచినాఁడు
రమణ వేంకటరాయ దేవేంద్రుఁడు నుతింపఁ
బటుకార్య దక్షుఁడై పరిఁగినాఁడు
దునియఁదారులఁదెచ్చి ఘనతవాతనికిఁ బా
దాక్రాంతులుగఁ జేసి యలరినాఁడు

భోటకర్ణాటలాట కాంభోజ మగధ
గౌళ నేపాళ మాళవ చోళ సింధు
నృపవరాస్థానముల మంతు కెక్కినాఁడు
మంత్రిమాత్రుండె తమ్మయమంత్రి మౌళి.

ఈతమ్మయమంత్రి మనకవికిఁ ముత్తాత తమ్మనికుమారుఁడు. దీనిని బట్టి తమ్మయమంత్రియుఁ గవికి పితామహుఁడైన చెన్నమరాజును దాదాపుగ సమకాలికులని యూహింపవచ్చును. పై పద్యములో నీ తమ్మయమంత్రి శ్రీరంగరాయలకడను వెంకటరాయలయొద్దను మంత్రిగా నున్నటు చెప్పియున్నాఁడు. ఈతమ్మయమంత్రి కాలమును నిర్ణయించినచోఁ గవికాలము సులభముగాఁ దెలియును.

ఈతమ్మనమంత్రినిగూర్చి వర్ణించిన పద్యము నుదాహరించుచు బ్ర. శ్రీ. వీరేశలింగముపంతులుగారు కవులచారిత్రములో "ఈకవితాను పెమ్మసానితిమ్మరాజున కాశ్రితుఁడయినట్లు చెప్పి తిమ్మరాజు శ్రీరంగ నాయనికిని వెంకటపతిరాయనికిని మంత్రియైన ట్లీ సీసపద్యములో నీ క్రిందివాక్యములతోఁ జెప్పియున్నాఁడు" అని వ్రాసియున్నారు. కాని అది పొరపాటు. కవులచారిత్రములోఁ బై సీసపద్యమును బూర్తిగా

నుదాహరింపక రెండుపాదములనుమాత్రమే యిచ్చియున్నారు. పైని నేనుదాహరించిన సంపూర్ణపద్యమును జదివినచో నందుఁ జెప్పబడిన వాఁడు కవి వంశీయుఁడగు తమ్మన మంత్రి కాని పెమ్మసాని తిమ్మయ కాఁడని తెలిసికొనవచ్చును. వీరేశలింగము పంతులుగారు "కవి శ్రీరంగ రాయ వేంకటపతిరాయల కాలములో నున్నవాఁడగుటచేత క్రీస్తుశకము ౧౫౭౪ - ౧౬౧౪ సంవత్సరములమధ్యను ప్రబలియున్నవాఁడు" అను వాక్యములనుగూడ వ్రాసియున్నారు. ఇదికూడఁ బొరపాటే. పై సీసపద్య మునందు వర్ణింపఁబడిన చెన్నమరాజు తమ్మనను, పెమ్మసానితిమ్మన యనుకొనుట వలననే యీపొరబాటును వచ్చినది.

తమ్మయమంత్రికిఁ బ్రభువులుగా నున్న శ్రీరంగరాయ వెంకట రాయ లిరువురు నార్వీటి వంశములోని వారు ఈపేరులను వహించి న వా రార్వీటివారిలోఁ బెక్కురున్నారు. కాని, వీరిరువురును అర్వీటి తిరుమలరాయల (వసుచరిత్ర కృతిపతి) కుమారులైన శ్రీరంగరాయ వెంకటపతిరాయలై యున్నారు వీరిరువురు నొకరితరువాత నొకరు కర్ణాట సింహాసన మధిష్ఠించి క్రీ. శ. ౧౫౭౪-౧౬౧౪ వఱకు రాజ్య పాలనము చేసినవారు. తమ్మనమంత్రి ౧౫౭౪ మొదలు ౧౫౮౭ వఱకు శ్రీరంగరాయలకడను అటుపిమ్మట మఱి ౧౦ సంవత్సరములు వెంకటపతిరాయల కడను మంత్రిత్వ పదవియందుండి యుండును. అయినచో నీతమ్మనమంత్రి కాలము ౧౫౭౦-౧౫౯౦ అని నిర్ణయింప వచ్చును. అళియరామరాయల తండ్రి శ్రీరంగరాయలును, నా శ్రీరంగ రాయల యైదవ కుమారుఁడైన వెంకటపతి (వెంకటాద్రి) రాయలును కలరు. కాని, తమ్మనమంత్రి యీకాలపువాఁడు కాఁడు. తమ్మన మంత్రి కాలమును బట్టి చూచినచో మన చెన్నమరాజుకవి తమ్మన మంత్రికిఁ బిమ్మట నేఁబది. ఆఱువదేండ్లలో నుండియుండవలయునని తెలుచున్నది అనగా ౧౫౯౦ + ౫౦ = ౧౬౪౦ ప్రాంతములో చెన్నమరాజకవి 'చారుచంద్రోదయమును' రచియించినట్లు తేలుచున్న

ది. పదేండ్లావలీవల నీకాలము సరియైనదనియే తోఁచుచున్నది. కాని యీనిర్ణయమునకొక్క యాటంకము గన్పించుచున్నది.

ఈకవికిఁ బితామహుఁడైన చెన్నమరాజు, కవిసార్వభౌమ బిరుదాంకితుఁడగు శ్రీనాథ మహాకవి యొద్దఁ గవిత్వ విద్యనభ్యసించి నట్లీ క్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

క. సన్నుత కవిత్వ విద్యా
భ్యున్నతి శ్రీనాథ సుకవిపుంగవు కరుణన్
చెన్నమరుణ లక్ష్మీపతి
చెన్నమరాజ ప్రధానశేఖరుఁ డెలమిన్.

బ్రి. శ్రీ. వీరేశలింగము పంతులుగారు శ్రీనాథకవి శిష్యుఁడు లక్ష్మీపతి యని వ్రాసి దానినిబట్టి కవి కాలనిర్ణయ మొనర్చినారు. అది పొరపాటు. పైపద్యములో వర్ణితుఁడైన యాతఁడు, కవి సాంప్రదాయము ననుసరించి లక్ష్మీపతి కుమారుఁడైన చెన్నమరాజుగాని, లక్ష్మీపతికాఁడు. కాని చెన్నమరాజని నిర్ణయించినంతమాత్రమున మనకుఁ గలిగిన సంశయము తీరదు ఈ చెన్నమరాజు మనకవికిఁ బితామహుఁడు. శ్రీనాథుఁడు పదునాల్గవశతాబ్ది తుదను పదునైదవ శతాబ్ది మొదటను నున్నవాఁడు. ఆ చెన్నమరాజు శ్రీనాథుని శిష్యుఁడైనచో వా కాలమునందే యుండునుకదా! తాతె చెన్నమరాజు పదునైదవశతాబ్దిని, మనుమఁడు చెన్నమరాజు పదునేడవ శతాబ్ది యందు నుండుట పొసఁగదు. తాత మనుమలమధ్య రెండువందల సంవత్సరములు వ్యత్యాసముండదు. ఈభేదమును సమన్వయము చేయవలయునన్నచో మొదటి చెన్నమరాజు శ్రీనాథునిశిష్యుఁడు కాఁడనినిర్ణయించుట కంటె సాధనాంతరము గన్పట్టదు. పైకంద పద్యములోని "కరుణన్" అనుమాటను "కరణిన్" అనిదిద్దినచో నీవ్యత్యాసముండదు. 'కరణిన్' అనుమాట లేఖక ప్రమాదమున "కరుణన్" అయ్యెనని భావించు చున్నాఁడను. ఈ చెన్నమరాజు రచించిన గ్రంథములేవియో తెలియ

లేదు. కవి తనతండ్రియైన శేషాద్రిమంత్రి నీక్రింది సీసపద్యములోఁ బ్రశంసించి యున్నాఁడు.

సీ. తల్లిదండ్రులపేర ధరఁ బ్రసిద్ధికి నెక్క
రహిమీఱ నగ్రహారములు చేసె
రాజాధిరాజులు రాయలౌనన మెచ్చ
బ్రజ్ఞాధురంధర ప్రౌఢి మెఱసె
బాంధవాశ్రిత విప్రపటలంబు వినుతింప
ననిశాన్నదాన విఖ్యాతిఁ గనియె
బుధసత్కవి స్తోమములు నుతుల్సేయ శా
శ్వతముగా సప్తసంతతులు గూర్చె
నితని కితండె ప్రతిగాక యితరు లెనయె
యనుచు జను లెన్న వెలసె హృదబ్జ వధుక
రాంబకీ కృతజైవాతృకాద్రి చెన్న
మంత్రి శేషాద్రి పటుధైర్య మందరాద్రి.

కవికాల నిర్ణయము చేయుటకుఁ దగినయాధారము లేమియు నీపద్యమున లేవు.

చెన్నమరాజ కవికిఁ బితామహుఁ డగు చెన్నమరాజునకుఁ బిన తండ్రియైనఁ గృష్ణరాజునకుఁ దనయుఁడగు లింగనమంత్రి, పెమ్మసాని పెదవీర నృపాలుని యందలముపై మదగజం బొక్కటి వచ్చి పడు చుండగాఁ జూచి దానికుంభస్థలమున నొక్క గ్రుద్దుగ్రుద్ది వెనుకకు మరలించినట్లు చారుచంద్రోదయమునం దీక్రింది పద్యములోఁ జెప్పి యున్నాఁడు.

చ. విడువక పెమ్మసాని పెదవీరనృపాలుని యందలంబుపై
నడుచు సుదారఘోరమదనాగముఁ జేపిడియమ్మకొద్ది రొ
క్కుడువడి గ్రుద్ది పోఁదరిమె కొంచక లింగయమంత్రసింహ మిం
పలరెడివేడ్క రాయలపురాయన నావిడిగేసి వెంకటా.

ఆకాలపు బ్రాహ్మణులు కేవలబుద్ధిబలముననే గాకుండ దేహదార్ఢ్యమునం గూడ నెంత ప్రసిద్ధిగాంచిరో దీనినిబట్టి తెలియుచున్నది.

పెదవీరనృపాలుని కాలము మనకు సునిశ్చితము గాఁదెలియదు. కాని క్రీ. శ. 1540 అని చరిత్రకారు లనుచున్నారు. అయినను ఈలింగమంత్రిశాసన మొకటి అనంతపుర మండలములోని తాడిపత్రి యందున్నది. వెల్లలూరిలోవి యెదుతూములభూమి తాడిపత్రి చింతల రాయస్వామి కర్పించినట్లు శాసనమునంగలదు. ఆశాసన సంవత్సరము శా. శ. ౧౫౮౬ అని యున్నదని శ్రీరంగాచార్యులవారి శాసనసంపుటములో నున్నది.* అది క్రీ. శ. ౧౬౬౪ అయినది. అప్పటికిఁ పెమ్మసానివారి పరిపాలనాధికారము లేదు. మహమ్మదీయుల హస్తగతమై పోయినది. శాసనకర్త పెదవీరనృపాలుని కాలములోని లింగనమంత్రి కాఁడని యనుటకును వీలులేదు. లింగనమంత్రి తండ్రి కృష్ణమంత్రి యని పై వంశవృక్షము చెప్పుచున్నది. శాసనములోను నట్లేయున్నది. లింగనమంత్రి కుమారుఁడు కృష్ణమంత్రి యనియు నాతని తనయుఁడు లింగనమంత్రియనియుఁ దాతపేరు మనుమనికిఁబెట్టిరని తలంపవలయునని యు గొందఱనవచ్చును. కాని యట్లనుట కవకాశములేదు. లింగనమంత్రి తనయుఁడు శ్రీహరి మంత్రియనియు నాతని తనయుఁడు మంగపతి యని యుఁ బైవంశవృక్షములో నున్నది. అందుచే శాసనకాలము పొరపాటు పడినదనుట స్పష్టము. శా. శ. ౧౪౮౬ అని యుండవలయునేమో! తాడిపత్రి కయఫియ్యతులో నీలింగనమంత్రిదే యొకశాసనముదాహృతమైనదఁట! అందులో నతఁడు పెమ్మసాని నారసింహ నృపాలునివద్ద ధారాగ్రహీతముగా పొందిన కొంతభూమిని సూర్యగ్రహణ కాలమున చింతలరాయస్వామి కిచ్చినట్లు వ్రాయఁబడినదఁట. అందులో కాలము శా. శ. ౧౫౧౬ అని యున్నదఁట.! (కమ్మవారిచరిత్రము పుట ౨౪౪. రెండవభాగము.)

* దత్తమండల శాసనములు పుట 833 సంఖ్య 86: రంగాచార్యులవారి మదరాసు రాష్ట్రీయ శాసనములు పుట 30

ఈశాసనమే పైనివ్రాసిన శాసనమైయుండును. అందుచే లింగన క్రీ. శ. ౧౫౯౪ లో నున్నాఁడని స్పష్టమగుచున్నది. అతని కప్పటి కేఁబదియేండ్లు న్నవన్నచో వరుస కాతని నునుమఁడైన చెన్నమరాజు పదేండ్లవాఁడై నలువదేండ్లవయసున క్రీ. శ. ౧౬౪౦ ప్రాంతమున జారుచంద్రోదయమును రచియించి యుండునని తేలుచున్నది.

పైన చెప్పిన తిమ్మనామాత్యుని కుమారుఁడును లింగనమంత్రికి అన్నకుమారుఁడు నైన వెంకటపతి ప్రధాని యనేక ధర్మకార్యము లొనర్చిన ట్లీక్రింది సీసపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. ఎలమి బ్రాహ్మణపల్లె నేమంత్రి నిల్పె గో
పాలదేవునకు దేవాలయంబు
నేడకిపురమున నేమంత్రితిలకుండు
వనము వేయించె పావనముగాఁగ
నిష్టార్థములొసంగి యేమంత్రి చెప్పించె
వేదశాస్త్రంబులు విప్రతతికి
భువనప్రసిద్ధమై పొలుపొంద నేమంత్రి
చెఱువుగట్టించె నచ్చెరువు గాఁగ
నతని నుతియింపఁదగు బంధు యాచకద్వి
జౌఘసంస్తూయమాన నిత్యాన్నదాన
ఘనుని తిమ్మయామాత్య వేంకటవర ప్ర
ధాన సంక్రందమని హరిధ్యానఘనుని.

ఈపద్యములోఁ జెప్పబడిన గ్రామములు అనంతపుర మండల మందలి తాడిపర్తి తాలూకాలోనివి. ఆగ్రామములలోఁ జెన్నమ రాజు వారి శాసనములు గన్పట్టలేదు. ఈ దేవాలయాదులు నిర్మించి నట్లు శాసనములను వ్రాయించలేదో! వ్రాయించినను గన్పడలేదో!

అందువలన నీపద్యములుకూడఁ గవి కాలనిర్ణయమునకు సహాక రించలేదు.

ఈకవి పూర్వుల గృహనామము అన్నలచింతలవారైనట్లును జెన్నమరాజును బట్టి చెన్నమరాజువారని మారినట్లును బైని వ్రాసియుంటిని. పెమ్మసానివారికి, గండికోట, యాడకిపరగణాల పరిపాలనాధికారము లభింపగనే చెన్నమరాజును అన్నచింతలనుండి తీసికొనివచ్చి, తాడిపత్రియం దుంచినట్లును, అప్పటినుండియు వారివంశీయులు, తాడిపత్రియందో, ఆప్రాంతములయందో నివసించుచున్నట్లును దెలియుచున్నది.

ఈకవిచేసిన ధర్మకార్యములను దెలుపు యీక్రిందిసీసపద్యమును బట్టియు నీతని నివాసము తాడిపత్రియనియే నిశ్చయింప నగుచున్నది.

సీ. తాడిపత్రీపురస్థలిని గోపాలకృ
ష్ణప్రతిష్ఠ యొనర్చినాఁడ వెలమి
సేయించినాఁడవు చెలువంబుమీఱ నా
హరికిఁ గిరీట పీతాంబరములు
పూని యాడకి చెంతఁ గోనేరు కట్టించి
వనము వేయించినా వనఘులీల
నలరఁజేసితి వగ్రహారంబు తిల్లి పే
రను సర్వమాంబాపురంబు నాఁగ
మఱియుఁ జేసితి వఖిల ధర్మములు మిగుల
నన్నియును సఫలంబులై చెన్నమీఱఁ
జెన్నయామాత్యమణి నీవు చేయు కావ్య
మొనర గోపాలకృష్ణున కొసఁగుమనిరి.

ఈకవి చెన్నమరాజు శాసనములుగూడఁ గన్పట్టలేదు. కావున నీపద్యముకూడఁ గవికాలనిర్ణయమునకుఁ దోడుపడలేదు.

ఇఁక నీకవి తనసామర్థ్యమును గూర్చి చెప్పిన యీక్రిందిపద్యములే కవి కాలనిర్ణయమునకు దారి జూపుచున్నవి వాని నీక్రింద

నుదాహరించి పైని నిర్ణయించిన కాలముకంటె సునిశ్చితమైన కాలము ను దెలుపునేమో చూచెదను.

ఈకవి పెమ్మసాని తిమ్మభూపాలునకు మంత్రియై వెంకటపతి రాయలవద్దనుండి పెక్కులు బహుమతులు తెచ్చి తనయేలిక యైన తిమ్మ నృపతి కిచ్చినట్లును నందుఁ గొన్ని బహుమానముల నాతఁడు తనకిచ్చి నట్లును వెంకటపతిరాయలు తనకు "కుంచ కాళాంజి" పట్టించుకొనుటకు ముద్రి యొసంగినట్లును నీక్రిందిపద్యములలోఁ జెప్పి యున్నాఁడు.

సీ. తనల సద్వనలక్ష్మి తనలసద్వనలక్ష్మి
పగిది నాళీవైభవములఁ బూన
తన మహోయశపాళి తనమహోయశపాళి
గతి దానవారిసంగతి వహింప
తనకళావిభవంబు తనకళావిభవంబు
సరణి నబ్జజ పరిస్ఫురణ నెఱప
తన విగ్రహస్ఫూర్తి తనవిగ్రహస్ఫూర్తి
రీతి దర్పక నిరాకృతి యొనర్ప

నలరు ధాత్రిని మన్నెమార్తాండుఁడట్టి
గండరాదిత్య గండరగండబిరుద
దీపితాటోప భయదప్రతాప తీవ్ర
ఘృణికి పెమ్మసాని తిమ్మభూమీంద్రమణికి.

తే. మంత్రివై నీవు చెన్నయమంత్రిచంద్ర!
ప్రణుతి కెక్కితి వఖిలభూపాల సభల
క్షితి హరిశ్చంద్రునకు సత్యకీర్తిసరణి
ధరణిధరగర్వభేదికి గుణనికరణి.

సీ. గరుడ నారాయణ బిరుద ధ్వజంబు బం
గారుపూవుల చంద్రికావిపా వ

డయు తురాయిగజంబు హయరత్నమును వీర
మలహరి ఘనకంఠమాలికయును
తాళి చౌకట్లు ముత్యాలకడియములు
గండపెండేరమ్ము కత్తిదుచ్చు
వేంకటపతిరాయ విభునిచేతను దెచ్చి
పెనుసాని తిమ్మమ్మభూరమణిమణికి

నిచ్చి తదనుజ్ఞగైకొంటి వెలమిపీవు
రాయదత్తంబులైన కుల్లాయిమొదలి
పొగ ధవళ శంఖంబులు పల్లకియును
తాళిచౌకట్లు చెన్నప్రధానమంత్రి!

తే. కుంచకాళాంజిపట్టించుకొమ్మటంచు
మొదల యిడి రాయలెంతయు ముదముమీఱ
సకలసన్మానము లొసఁగ జగతికీర్తిఁ
జెన్ను మీఱితి వౌరౌర చెన్నధీర!

ఈకవి రచించిన చారుచంద్రోదయమునందు శ్రీకృష్ణుని తనయుఁడగు చారుచంద్రుఁడు పుష్కరుఁడను రాక్షసుని సంహరించుటయు రత్నకేతన పురప్రభువగు పద్మాకరుని తనయ కుముద్వతిని పెండ్లియాడుటయు వర్ణింపఁబడినవి.

వ్యాకరణ మంగీకరింపని ఇకారసంధులు మొదలైన ప్రయోగములున్నను నీతనికవిత్వము మనోహరముగా నున్నది. కవిత్వరీతి తెలియుటకై కొన్ని పద్యముల నుదాహరించుచున్నాఁడను. ఈగ్రంథమునందు మనుచరిత్రయందలి పద్యములవంటి పద్యములు కొన్ని కలవు.

ఉ. ఇక్కడి పావురంపురొద లీపొద లీకదళీవనోత్కరం
బిక్కడి చంద్రకాంత తరులీ విరులీనును సౌరభంబులీ
ఇక్కడి తావి తీవి మొకమాపిక మాశుకవాక్యవైభవం
బెక్కడ నెక్కడైన తగు మక్కడ నిట్టివిలేవు భూసురా!

శా. పంచారించిన గుబ్బచన్నులు చలింపఁ గెంపురాదిన్నెలన్
మించుంబోడుల గుంపుసొంపు మదిలో మించన్ దుగా భారతీ
పంచా, యుత్తిరా దచ్చి చక్కనత చోవంచీపదీ తొమ్మిదీ
యంచున్మల్లవ రాజితోష సాగటాలాడుఁ బురీవీథులన్.

చ. అరవిరి ముత్తెముంబివురుటాకుల కెంపులు తేటనీలముల్
హరువుగఁ జెక్కినట్టి యొకయందపు పూఁబొదగుమ్మటంబులో
సరసమరందబిందువులు చల్లుచుఁ జల్లనికమ్మతెమ్మెరల్
తిరిగెడు నున్నపూరజవు తిన్నెపయి న్వసియించి యున్నెడన్.

ఉ. నాలుగు దిక్కులంగనక నద్భుతి హేతులు మింటనంటఁగా
గ్రాలుచునున్న వహ్నులమరన్ నయనద్వయముఁ గ్రిదీప్తిపై
గీలుకొనంగఁ జేసి నృపకేసరి చేసెతపంబు తన్మహోభీల
నిదాఘువేళ శిలఁబేర్కొనఁ జెక్కిన బొమ్మకైవడిన్.

చ. అలరుపయోధరాటనమహాంసకముల్ గవలంగవేణికో
చ్చలనము మించఁ గంకణపు సందడి హెచ్చఁగ రోదసీ వధూ
తిలకము డాయనప్పు...తిన్ రతిఁ బైకొని క్రీడసల్పఁగా
జలజలరాలు హార మణిసంతతి నాఁగగశాళి భాసిలెన్.

సీ. నసబోఁడి నిడువాలు కనుడాలుపరిబోలు
తొగగుఁవు జిగిపెంపుఁ దోలఁగఁ జేసె
నవచంచలాంగి వేనడమించు వెలయించు
నంచబోదలఁగంచుమించఁ జేసె
కోడగుబ్బెతమోముతో డుత నీకనఁగూడు
హరిణాంకు జలధరాంతరితుఁ జేసె
లతకూనకటితటోన్నతి తీరుఁగనివారు
పులినవైఖరి నీటఁగలియఁ జేసె

గీ. సకట! పార్ణేశ్వరీ జ్ఞాపనానురూప
వస్తువితోసుఖంబు దైవంబుకంటి

కింతవేగరమ్యనేయని వంతనొందె
ప్రావృడాగ పరిపాటి పాంథవీటి.

చ. తనరె వసంతమంతట నితాంతలతాంతనిశాంత మీనకే
తనరణతాంతకాంత వనితాజనతాతనుతాపరూపథం
జనచణసార సౌరభవిసార సమీరకిశోరవార న
ర్తన దళదంబుజాత మిళిత భ్రమరభ్రమరీ తరంగమై.

చ. ఒకయలినీలకేశిక పయోరుహలక్ష్మి నహంకరించి కొం
చక వదనాసవం బుమియ సారెకుఁ దేటులమ్రోత దిట్టుచున్
వకుళము సీధుకైతవము బ్రీతిగానుమియందొడంగె నో
ర్వుకొన దలంతురే పటుతరుల్ మది నన్యకృతావమానముల్

చ. అలవి దలిర్పనంటి తలయంటి నలుంగిడి తేఁటనీటిచే
జలక మొనర్చి యుగ్గొసఁగి చన్నిడి చల్వవుచల్వ జెల్గు పా
త్తుల పొలుపొందఁగాఁ బరచి తొట్టెలలోపలనుంచి దాదులిం
పలరఁగఁ బ్రోదిపెంచి రనయంబుఁ గుమారుఁ గుమారికామణిఁ.

శా. తావుల్గుల్కెడు మేనుతీవెకు పరీతాపంబు గావించు నీ
జీవంజీవ మనోజ్ఞమూర్తి యకటా శీతాంశువా కాదు శో
భావైరూప్యమునంజన భ్రమదమా భస్మావృతానంగతే
జో వైశ్వానర విస్ఫులింగముసుమీ చూడఁ దిశానాయకా!

---

# 271 గూళికల్లు వేంకటరమణకవి



ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు; వెంకటపతి పౌత్రుఁడు; వెంకటామాత్య రంగమాంబలకుఁ బుత్రుఁడు. ఈరంగమాంబ జక్కిలేటి వారి యాఁడబడుచు. సుమతీంద్రమునికిఁ బ్రియశిష్యుఁడు.

ఈతఁడు కనకరంజిత శిఖామణీపరిణయ మనుశృంగారప్రబంధమును రచియించి శ్రీ వెం క టే శ్వ రు న కంకితము చేసెను. ఈగ్రంథము ముద్రింపఁబడలేదు. మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నైదాశ్వాసములు సంపూర్ణముగను నాఱవ యాశ్వాసమునఁ గొంతవఱకును గల యొక యముద్రితప్రతి యున్నది. గ్రంథము మొత్త మెన్నియాశ్వాసములో( దెలియలేదు. తిరుపతి వెంకటేశ్వరుఁ డీకవికి స్వప్నమునఁగన్పడి—

సీ. నీయిష్టదైవంబ నినుఁ బ్రోచుచుండెదు
శ్రీవేంకటేశుండ నీవెఱుంగు
మోవత్స! యిపుడు నీభావంబు దెలిసి వ
చ్చితి గూళి కల్వంశశేఖరుఁడవు
వేకంటామాత్యుఁడై వెలయుమంత్రికి జక్కి
లేటి వంశజయౌ వధూటి రంగ
మాంబకు జనియించి మాపేరుగొన్న వేం
కటరమణుఁడవు సత్కవివిమాఱ

మునుపు హరివంశ మంతయుఁ దెనుఁగుచేసి
యంకిత మొనర్చితివి విక్రమార్కచరిత
మిఁకఁ బ్రబంధ మొనర్చి మాకిమ్ము సిరులు
శుభములొసంగెద ననిపల్కె సుముఖుఁడగుచు,

ఈకవి యింతకుఁబూర్వము హరివంశము నంతను నాంధ్రీకరించిన ట్లీపద్యములోఁ జెప్పఁబడినది. కాని యాగ్రంథ మిప్పు డెచ్చటను గానవచ్చుట లేదు.

విక్రమార్కుని సోదరుఁడైన భట్టికిని కనకరంజిత శిఖామణియను కన్యకకును బరిణయమైనకథ యిందు వర్ణితమయినది. ఈకథ ప్రధానమైనను విక్రమార్కుని చరిత్రము కూడ నిందుఁ దెలుపఁబడినది. ఈ కవి యెప్పటివాఁడో యెచ్చటివాఁడో తెలిసికొనఁదగిన యాధారములు లేవు. ఈక్రింది పద్యములో తెనాలి రామకృష్ణుని, పెద్దనామాత్యుని, పింగళి సూరన్నను, పూర్వకవులుగా స్తుతించియున్నాఁడు.

సీ. వల్మీక సంభవ వ్యాస జైమిని భర
ద్వాజ బిల్హణ కాళిదాసదండి
భవభూతి జయదేవ బాణదోయి మయూర
చోర భారవి మాఘ వీరభీమ
నన్నయా ర్యాథర్వణాచార్య తిక్కన పోత
రాజ శ్రీనాథ గౌరన్న రంగ
నాథ భాస్కర పెద్దనార్య సూరన్న యె
ఱ్ఱాప్రగడ సోమ రామభద్ర
రామలింగన తిమ్మన ప్రముఖులగుచు
వేదవేదాంగ బహుకళావితతి సంస్కృ
తాంధ్రభాషా కవీంద్రులైనట్టి ఘనుల
భక్తి సేవింతు సుకవిత ల్పట్టువడఁగ

దీనినిబట్టి యాతఁడు పదునాఱవ శతాబ్దికిఁ దరువాతి వాఁడనుట స్పష్టము. పదునేడవ శతాబ్దియందుఁ బూర్వార్ధమునందుండునని యనుకొనుచున్నాఁడను. ఇతఁ డెచ్చటివాఁడో తెలియలేదు. బహుశః నెల్లూరుమండలము లోనివాఁడేమో. పైపద్యములోని రామభద్రుఁడు అయ్యలరాజు రామభద్రకవియని యనుకొనుచున్నాఁడను. ఈకవిని గూర్చి యింక నేమియుఁ దెలియరాలేదు.

---

# 272 రాజలింగకవి



ఇతఁడు వ్యాసప్రోక్తమగు కూర్మపురాణమును ఆఱాశ్వాసముల పద్యకావ్యముగా రచియించి, చెలికాఁడు లక్ష్మణామాత్యుని ప్రేరణముచే శ్రీశైలమందలి మల్లికార్జునస్వామి కంకితము చేసెను. లక్ష్మణామాత్యుఁడు కవికి స్నేహితుఁడైన ట్లీక్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

చ. అతనికి మేలువాఁడనయి, యాప్తుఁడనై సచివుండనై మహో
హితవరినై సఖుండనయి యెల్లెడలన్ బెడబాయకుండి సం
తతము మృదూక్తులన్ శివకథాకథనంబులఁ బ్రొద్దుపుచ్చుచున్
గుతుకముతో వసించెద నతుంతితవృత్తిఁ గవుల్నుతింపగన్.

ఈకవి కులమేదియో తెలియదు. ఈక్రింది గద్యపద్యములనుబట్టి యితఁడు వసిష్ఠగోత్రజుఁడ నగుటచే బ్రాహ్మణుఁడనియు, వీరశైవ మతావలంబియనియు నూహింపవచ్చును.

గద్య:— ఇది శ్రీగిరీశ్వర వరప్రసాద లబ్ధ కవితావిలాస ఆశ్వలాయనసూత్ర వసిష్ఠ సగోత్ర పవిత్ర నరేశ్వరపుత్ర సకలవిద్యా ప్రసంగానుషంగ రాజలింగప్రణీతం బైన శ్రీకూర్మపురాణం బను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

ఉ. శ్రీగిరినాథ పాదసరసీరుహచింతన వీరశైవ శా
స్త్రాగమ మార్గనిర్ణయరిరంసు నిరంతరధీజనశ్లాఘసం
యోగమనస్కు నుత్తమగుణోచిత సంగ్రహ దక్షవర్తనా
భోగుని రాజలింగ కవిపుంగవు మంజులభాషు నన్నాగిన్.

కృతిపతి కృతికర్తల నివాసము కొలిపుట్లయైన ట్లీక్రింది పద్యమువలన నూహింపఁదగియున్నది.

సీ. గీ. హయమదద్విరదస్యందనాన్వితంబు
చారు పుణ్యాంగనాజన సంశ్రయంబు
మహిత ధనధాన్య రత్నసమంచితంబు
భూరిసుకరంబు కొరవుట్ల పురవరంబు

ఆపట్టణంబున "కధీశ్వరుండు" అనివ్రాసి, కృతిపతి పూర్వుఁడైన చెఱకుభూపతిని కవి యీక్రింది పద్యములోఁ గీర్తించియున్నాఁడు.

ఉ. శ్రీపరమేశ పాదసరసీరుహ చింతనుఁ డగ్రజన్మ సం
స్థాపనుఁ డప్రమత్తుఁ డరిసంచయ భంజనుఁ డుత్తముండుధా
త్రీపరిపాలన ప్రియవికీర్ణుఁడు చెర్కుకులావతంసుఁడౌ
భూపతిమించెఁ గీర్తిపరిపూరిత సర్వదిగంతరాళుఁడై.

కృతిపతి తండ్రి సంగనమంత్రి తల్లి గాజుబాయి.

ఆ. అతఁడు విష్ణుదాస అకపల్లికి సుభద్ర
నాజనించినట్టి గాజుబాయి
నతివిభూతిఁ బరిణయంబయి సుచరిత్ర
సుతుల సుతులఁగనియెఁ గుతుక మలర.

తల్లిదండ్రుల నామములనుబట్టి చెఱకువారు, మధ్వబ్రాహ్మణులని యూహకలుగుచున్నది.

కొరవుట్ల పట్టణ మాంధ్రమండలములలోఁ గన్పట్టలేదు. నిజాము రాష్ట్రములో నుండెనేమో! కవియు నచ్చటివాఁడే యైయుండును.

సంస్కృతభాషలో వ్యాసప్రోక్తమయిన కూర్మపురాణముకలదు. దానికిది యాంధ్రీకరణము.

శ్లో॥ నమస్కృత్వాప్రమేయాయ
విష్ణవే కూర్మరూపిణే
పురాణం సంప్రవక్ష్యామి
యదుక్తం విశ్వయోనినా.

ఈకవి శివకవులను వేఱుగాను యితరకవులను వేఱుగాను నుతించి యున్నాఁడు.

సీ. పండితారాధ్య దేశికుఁ బాలకురికి
సోమనాయకుఁ బిడుపర్తిసోము బసవ

దేవు శరభాంకు ఘుటికసిద్ధేశు నాత్మ
లోన సన్నుతి సేయు దనూనభక్తి.

సీ. నన్నయభట్టుఁ దిక్కన్నను నెఱ్ఱయ
కవిని భీమయను భాస్కరునిఁ బోత
రాజును శ్రీనాథు రామలింగయ్యను
రంగనాథుని రామలింగ కవిని
సూరపరాజును గౌరపాహ్వయుఁ బ్రౌఢ
కవిమల్లుఁగుకవి భైరవునిఁ బెద్ద
నార్యుని ముక్కుతిమ్మన్నను జిన్నన్న
యాదిగా రసికులౌ నాంధ్రకవుల

రామలింగయ్యను రామలింగకవిని అని ద్విరుక్తిగా వ్రాసినాఁడు. ఒకటి రామభద్రయ్యను అని యుండవలెనేమో. పింగళి సూరనార్యుని నిందు స్మరించియుండుటచే నీకవి యాతనికిఁ దరువాతి వాఁడగుట నిశ్చయము. ఇతఁడు పదునేడవ శతాబ్దిని బూర్వార్ధమునం దుండునని నిశ్చయింతము.

అప్పకవి యంభేద ప్రాసమునకు లక్ష్యముగాఁ గూర్మపురాణము నుండి గైకొనియుండుటచేఁ బైని చెప్పిన కాలము సరియైనదని నిశ్చయమగుచున్నది.

ఇతని కవిత్వము సరళమై ధారాశుద్ధికలిగి మనోహరముగా నున్నది.

